# అనుపల్లవి

[లఘు సంపాదకీయాల సంకలనం]

నండూరి రామమోహనరావు

నవోదయ పబ్లిషర్స్ విజయవాడ-2
గుంటూరు-2

# ఒక మాట

పల్లవిని అనుసరించి అనుపల్లవి. ప్రధాన సంపాదకీయం తర్వాత లఘు సంపాదకీయం.

ఇంగ్లీషు దిన పత్రికలలో ఇలాంటి లఘు సంపాదకీయాల సంప్రదాయం వుంది లండన్ "టైమ్స్" తన లఘు సంపాదకీయాలను Fourth Editorials పేరుతో సంపుటాలుగా ప్రచురిస్తూ వుండేదికూడా

ఏదో ఒక విచిత్ర వార్త వచ్చినప్పుడు, ఏదో వింత సంఘటన జరిగినప్పుడు, దానిపై వ్యంగ్యంగానో, సూటిగానో క్లుప్తంగా చేసినవాఖ్యలే ఈ సంపుటిలోని లఘు సంపాదకీయాలు.

ఇవి నేను "ఆంధ్రజ్యోతి" సహాయ సంపాదకుడుగా 1965-77 సంవత్సరాల మధ్య కాలంలో వ్రాసిన లఘు సంపాదకీయాలలో కొన్ని అక్కడక్కడ వాక్యాల దిద్దుడు, భాష సవరింపులు తప్ప పెద్ద మార్పులు చేయలేదు వీటి ప్రచురణ తేదీలు పుస్తకం చివర అనుక్రమణికలో ఇచ్చాను ఆ తేదీలనుబట్టి ఆయా సందర్భాలలో వచ్చిన వార్తలపై సంగ్రహ వ్యాఖ్యలుగానే పరిగణించి వీటిని చదువుకోవాలి కాలక్రమాన్ని బట్టిగాని, విషయ సాదృశ్యాన్ని బట్టిగాని కాక, వస్తు వైవిధ్యం దృష్టితోనే వీటిని ఒక క్రమంలో కూర్చడం జరిగింది

దిన పత్రికలలో రచన కాలంతో పాటు పరుగులు తీస్తూ క్షణా లపై జరిగిపోతుంది వ్రాసిన పేజీ వ్రాసినట్టుగా కంపోజింగ్ విభాగా నికి వెళ్ళిపోతుంది సావధానంగా వెనుదిరిగి చూచుకునే వ్యవధి సాధార ణంగా వుండదు కనుకనే Journalism is literature in a hurry అని ఎవరో అన్నారు ఈ లఘు సంపాదకీయాలు కూడా అంతే. అవ్యవధాన సాహిత్యం (literature in a hurry) గానే వీటి విలువ.

వీటిని పునర్ముద్రించుకొనుటకు అనుమతించిన
ఆంధ్రజ్యోతి అధిపతులకు నా కృతజ్ఞత

ఆంధ్రజ్యోతి
విజయవాడ

నండూరి రామమోహనరావు

# చెక్కిలిపై చుక్క

అందమైనవారికి ఏదైనా అందంగానే వుంటుందని మహాకవి వాక్కు. అయినా, అందంగా వున్నవారు మితి ఎరిగి అలంకరించుకుంటే మరింత అందంగా వుంటారు. ఈ రహస్యం తెలుసుకోబట్టే, పూర్వకాలంలో స్త్రీలు ఎన్నో విధాలుగా [illegible].

ఉదాహరణకు, చెక్కిళ్ళపై మకరికా పత్రాలు రచించుకోవడం అప్పటి సంప్రదాయం. నాజూకు పెరిగి హద్దుమీరి ఇవి మాసిపోయాయి. బుగ్గన చుక్కమాత్రమే మిగిలిపోయింది. ఇప్పుడు ఇదికూడా మానివేస్తున్నారనుకోండి.

బుగ్గన చుక్కతో చక్కనిచుక్క మరింత చక్కగా భాసించేది. నిజానికి ఎక్కడా ఒక వంక కూడా లేకపోతే అందం విలువ తెలియదు. ఏదో చిన్నలోపం వుంటేనే అందం రాణిస్తుంది. చందమామకు కళంకం లేకపోతే దానిమీద మన కవులకు ఇంత మోజు కలిగేది కాదేమో.

చెక్కిలిపై చుక్క పెట్టుకునే ఆచారం మరొకందుకు కూడా వచ్చివుండవచ్చు. ఏ వంక లేని అందానికి దిష్టికొడుతుందని మనవారు విశ్వసించేవారు. అందుకే చూపరుల దృష్టిని చెదరగొట్టడానికి ఇలా చుక్క పెట్టుకునే ఆచారం వచ్చివుండవచ్చు.

ఏమైనా, ఆంధ్రప్రదేశ్ శాసనసభను అందమైన స్త్రీ వదనంగాను ఇటీవల శాసనసభ ప్రారంభమైన మొదటిరోజునే మొదటిసారిగా దాన్ని వాయిదా వేయవలసి రావడం ఆ స్త్రీ ముఖంపై చుక్కగాను వర్ణించడం సభాపతి శ్రీ ఏ ఏ సుబ్బారెడ్డిగారి కవితా హృదయానికే చెల్లింది. నిజమే మరికొన్ని రాష్ట్రాల శాసనసభలతో, ఆ మాటకువస్తే పార్లమెంటుతో పోల్చిచూస్తే మన శాసనసభ క్రమశిక్షణకు మర్యాద ఎరిగిన ప్రవర్తనకు పేరెన్నికగన్నది.

చుక్క పెట్టుకోవడం అందంకదా అని ముఖంనిండా పెట్టుకుంటే దిష్టిపిడతవలె తయారవుతుంది. అలాకాక, మొన్నటితో సమాప్తమైన మన శాసనసభ ఒక చుక్కతోనే సరిపుచ్చడం దాని హుందాతనానికి మరింత వన్నె తెస్తున్నది.

# పుస్తకాల చౌర్యం

దొంగలలో గ్రంథాలయ చోరులది ఒకతెగ వీరు పైకి దొంగలవలె కనిపించరు పెద్ద మనుషులవలెనే వుంటారు గ్రంథాలయాలలో పుస్తకాలు చూడడానికో, చదువు కొనడానికో వచ్చినట్టే వచ్చి, ఎవరూ చూడకుండా చేతికందిన పుస్తకాన్ని ఏ జేబులోనో దాచుకుని వెళ్ళిపోతూ వుంటారు ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేనట్టు, వీరిని కూడా పట్టు కోవడం సాధ్యంకాదు

వీరి బెడదను అరికట్టడానికి ఒక బ్రిటిష్ శాస్త్రవేత్త ఒక ఉపాయం కనిపెట్టాడట గ్రంధాలయంలోని పుస్తకాలన్నిటికి లోపలి అట్టకు ఒక పల్చని కాగితమేదో అతికించాలి పుస్తకాన్ని దొంగ జేబులో పెట్టుకుని చల్లగా జారుకుంటుండగా, ద్వారంవద్ద అమర్చిన ఒక ఎలక్ట్రానిక్ పరి కరం పుస్తకం లోపలి కాగితంద్వారా పనిచేయడం ప్రారంభిస్తుంది, అలారం మోగుతుంది లేకపోతే ఎర్రలైట్లు వెలుగుతాయి దొంగను పట్టేసుకుంటారు

బాగానే వుంది ఈ ఉపాయం బాగా వ్యాప్తిలోకి వస్తే గ్రంథాల యాల అధికారులను చాలాకాలంగా వేధిస్తున్న పెద్ద బెడద తొలగిపోతుంది

కాని, ఇదొకరకం గ్రంధ చౌర్యం అసలైనవి వేరే వున్నది సునాయాసంగా పేరు కొట్టేయా లనుకునేవారు ఇతరుల గ్రంధాల నుంచి భావాలు, ఇతివృత్తాలు, వాక్యాలతో సహా కొట్టేస్తూ వుంటారు ఇటువంటి కుకవులనే పెద్దనగారు "మనుచరిత్రం"లో "నిరంతర తాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్థపుఁ దెరువాటుల్ దెగికొట్టి " అంటూ నిరసించారు. పెద్దనగారే అన్నట్టు, అటువంటివారిని పట్టుకొనడానికి "తజ్ఞు" లైన వారే ఎలక్ట్రానిక్ పరికరాలుగా పనిచేస్తారు అప్పటికీ కొందరు తప్పించుకుని లబ్ధ ప్రతిష్ఠ లవుతూనే వుంటారు అట్టివారికి వారి అంత రాత్మరే ఎలక్ట్రానిక్ పరికరాలు అవి వారి గుండెలలో నిత్యం అలారం మోగిస్తూనే వుంటాయి

# చిట్కా వైద్యం

శాస్త్రో కూస్త్రో వైద్యం రానివాడు, సంగీతం రానివాడు లేడంటారు
వంట్లోకొంచెం నలతగా వుందని నోరువిప్పి ఏ స్నేహితునితో నైనా చెప్పడం ఆలస్యం — ఫలానా విధంగా చేసి చూడకపోయారా? అని వెంటనే సలహా

అంతేకాదు ఒక్కొక్కరు ఒక్కొక్క సలహా ఇస్తారు తాము చెప్పిందే సరియైన వైద్యమని తెగవేసి చెబుతారు దేన్ని అనుసరించాలన్నది పెద్ద సమస్య అయిపోతుంది.

చిత్రం ఏమిటంటే పెద్దపెద్ద వైద్యాలకే లొంగని కొన్ని వ్యాధులు ఇలాటి చిట్కా వైద్యాలకు ఇట్టే నయమై పోతూ వుంటాయి

బ్రిటన్‌లో ఒకగొప్ప వైద్యునికి గొంతు వాచి ఏ వైద్యానికీ లొంగలేదట చివరికి అతనివద్ద చికిత్స పొందుతున్న రోగి చెప్పిన ఒక చిన్న ఉపాయం ప్రకారం చేయగా, నిమిషంలో వాపుతగ్గి పోయిందట

కీలెరిగి వాత అన్నట్టు, మూలకారణం తెలిసి మందువేస్తే ఏ వ్యాధి అయినా కుదురుతుంది అది తెలుసుకోనకుండా ఎంతవైద్యం చేసినా ఫలితం వుండదు

బ్రిటిష్ వారిని మనదేశంనుంచి సాగనంపడానికి గాంధీజీ అనుసరించిన సత్యాగ్రహ పద్ధతి ఒకవిధమైన చిట్కా వైద్యమేకాదా? అయితే, పిడుక్కి, బియ్యానికి ఒకటే మంత్ర మన్నట్టు, ప్రతి సందర్భానికి అదే చిట్కా ఉపయోగించకూడ దనుకోండి పరిస్థితులతో పాటు పద్ధతులుకూడా మారాలి.

# "మైక్, ప్లీజ్!"

మైక్రోఫోనులో మాట్లాడ్డం కూడా ఒక కళ. ఈ రోజులలో సభలలో ఉపన్యసించదలచిన ప్రతివాడు ఈ కళ అభ్యసించక తప్పదు.

కొందరికి మైక్ చూడగానే మైకం కమ్ముతుంది. ఏకు మైకై కూర్చుంటారు గొంతు చించుకుని. శ్రోతల చెవులు చిల్లులు పడేట్టు అరుస్తారు. కొందరు తమ మాట వినబడదేమోనని భయంతో మైక్‌లో మూతిపెట్టి మాట్లాడతారు. కొందరు రెండు గజాల దూరంలో నిలబడ ప్రసంగిస్తారు. కొందరు మైక్ చేత్తో మూయడం మరచిపోయి, వేదికపై వున్నవారితో సరసాలాడుతూ వుంటారు. కొందరు తుమ్ముతారు. పదేపదే దగ్గుతారు. చిటికెలు వేస్తూ ఆవులిస్తారు. అట్టహాసంగా నవ్వుతారు. సభా మర్యాదలు వుంటాయని వీరు గమనించరు.

మైక్‌లో మాట్లాడ్డం వలెనే, మైక్రోఫోను ఏర్పాట్లు చెయ్యడం కూడా కళే. సభకు ముందుగానే ఈ ఏర్పాట్లు చూచుకోవాలి. చాలమంది సభ ఆరంభమైన తర్వాత ఈ పనులన్నీ మొదలుపెట్టి చిరాకు కలిగిస్తారు.

మైకులలో ఎక్కువ భాగానికి గాంధీగారి సిద్ధాంతాలలో నమ్మకం జాస్తి. సాధారణంగా అవి సత్యాగ్రహం చేస్తాయి. వాటిని బుజ్జగించడానికి, సరిచేయడానికి సభా కాలంలో సగం గడిచిపోతుంది. ఎంత చేసినా, తరచుగా మైక్‌లోనుంచి మానవభాష బదులు గాడిదల ఓండ్ర, గుర్రాల సకిలింపు వినవస్తాయి. డబ్బాలో గులకరాళ్ళు గిలకరించినట్టు, పదిపిల్లులు పోరాడుకుంటున్నట్టు విపరీత ధ్వనులు వస్తాయి.

అందుకే, సభకు బాగా ముందుగానే మైక్ ఏర్పాట్లు చూచుకోవాలి. మొన్న ఢిల్లీలో ఇండియా, యుగొస్లావియా, అరబ్ రిపబ్లిక్‌ల శిఖరాగ్ర సభ సందర్భంలో ఓం ప్రథమంలోనే మైక్ చెడిపోయిందట. ఇందిర, టిటో, నాసర్‌లకు కొంతసేపటి వరకు ప్రపంచ సమస్యలన్నీ ఒకఎత్తు, మైక్ సమస్య ఒకఎత్తు అయిపోయాయి. అయినా, ఈ సభ కోసం మూడు నాలుగు నెలలుగా సన్నాహాలు చేసి చేసి, చివరికి మైక్ ఏర్పాట్లు తిన్నగా చేయక పోవడం ఏం బాగుంది?

# అతీంద్రియ జ్ఞానం

వేలకొలది మైళ్ళ దూరంలో వున్న వ్యక్తి మనోభావాలను గ్రహించడం సాధ్యమా? టెలిపతీ అనే విద్య ద్వారా ఇది సాధ్యమని విశ్వసించే వారు పెక్కుమంది వున్నారు మానవుడు అతీంద్రియ జ్ఞానం సంపాదించడం కష్టం కాదని చెప్పే శాస్త్రం—పారా సైకాలజీ—ఒకటున్నది

అయితే, కేవలం భౌతిక వాదులు ఈ శాస్త్రాన్ని విశ్వసించరు మార్క్సిస్టులను మించిన భౌతికవాదులు మరి లేరు కనుక, సోవియట్ యూనియన్‌లో నిన్న మొన్నటి వరకూ పారా సైకాలజీ, టెలిపతీ, క్లెయిర్వాయన్స్ మొదలైనవి నిషిద్ధాలు

ఇప్పుడు వాటిపట్ల సోవియట్ శాస్త్రవేత్తలకు జుగుప్స పోతున్నట్టుంది వాటిపై వారు పరిశోధనలు సాగిస్తున్నారట ఈ పరిశోధనల ఫలితంగా రెండువేల మైళ్ళ దూరంనుంచి శాస్త్రజ్ఞులు ఒకరి మనోగత భావాలను మరొకరు తెలుసుకోగలిగారట

కరడుకట్టిన భౌతిక వాదులకు సయితం ఇట్టి నమ్మకాలు కలగడం విచిత్రమే అయితే వాటికి వారు పారలౌకికం ఆధ్యాత్మికమైన ఆధారాలు కాక, కేవలం భౌతికమైన కారణాలనే కనుగొనడానికి ప్రయత్నిస్తారేమో

వారి ప్రయత్నాలు ఫలిస్తే, టెలిపతీ మొదలైన వా[illegible]కైనా శిక్షణ ఇవ్వడం సాధ్యమైతే, ఇక పోస్టాఫీసులతో టెలిగ్రాములతో బహుశా టెలిఫోనులతో కూడా పని వుండదు ఎవరికి వారు తమంతట తామే దూరాన వున్న మిత్రులతో, బంధువులతో భావాల ద్వారానే సంభాషించవచ్చు ఎదుట నిలబడి మనతో మాట్లాడుతున్న మన గాఢమిత్రుడు నిజంగా మనకు మిత్రుడో, లేక లోలోపల తిట్టుకుంటున్నాడో కనిపెట్టవచ్చు ఇటువంటి లాభాలు కొన్ని వున్నా, చిక్కులు కూడా చాలా బయలుదేరుతాయి, అవతలివాడు మన గురించి ఏమనుకుంటున్నాడో నిర్ధారణగా తెలియకపోబట్టిగాని, తెలిస్తే ఇక మానవ జీవితంలో ప్రశాంతి అనే దానికి తావుంటుందా?

# ఆదర్శ భార్య

సకల సద్గుణవతియైన సతి కోసం ఇకనుంచి ఎవరూ అట్టే శ్రమపడ నక్కరలేదు. లెడీ బేడెన్ పవెల్ మొన్న పూనాలో సలహా ఇచ్చినట్టు గర్ల్ గైడ్‌ను పెళ్ళి చేసుకుంటే సరి

ఆమె గర్ల్ గైడ్ ఉద్యమానికి నాయకురాలు. ఆ ఉద్యమం బాలిక లలో ఓర్పు, నేర్పు, మంచి మర్యాద, గౌరవ, ధైర్యం, దార్ఢ్యం మొదలైన సద్గుణాలను పెంపొందించడానికి ఉద్దేశించింది మరి ఇన్ని ఉత్తమ లక్షణాలలో శిక్షణ పొందిన యువతులు గర్ల్ గైడ్‌లలా కాక రెడీమేడ్‌గా ఎక్కడ దొరుకుతారు?

కాని, మన యువకులు ఈ లక్షణాలతోనే తృప్తిపడతారా? కొందరికి తమ భార్యలు సినీతారలంత అందంగా వుండాలి కొందరికి చదువుకున్న అమ్మాయిలు కావాలి కొందరికి సంగీతం వచ్చిన భార్య ఉండాలి. కొందరికి భార్య ఎలాంటిదైనా మామగారికి బాగా ఆస్తి వుండాల కొందరికి సంప్రదాయం మంచిదైతే చాలు పనీ పాటు చేతనైతే కొందరి దృష్టిలో భార్యకు మరే అర్హత అక్కరలేదు లోకో భిన్న రుచిః

అందుకే మన పూర్వులు కూడా వీలైనన్ని ఉత్తమ లక్షణాలను పోగేసి—"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపేచ లక్ష్మీః, క్షమయా ధరిత్రీ, స్నేహేచ మాతా, శయనేతు వేశ్యా" అని ఆదర్శ భార్యను నిర్వచించారు

ఇంతకీ ఇది కేవలం పురుషుల దృష్టి నుంచి ఆలోచించి చెప్పిన మాట యువతులకు మాత్రం తమభర్తలు ఆదర్శప్రాయులై వుండాలని వుండదా? అట్టివారికి లేడీ బేడెన్ పవెల్ సలహానే కొంచెం పొడిగించి. బోయ్ స్కౌట్లను అంటకడితే సరిపోతుంది

# "స్ట్రాంగ్ కాఫీ"

"అం కప్ కాఫీ "అని మనం ఆర్డరివ్వగానే, "స్ట్రాంగా, లైటా?" అని సర్వరు విధిగా అడుగుతాడు ముప్పాతిక మూడుపాళ్ళు మనవారు "స్ట్రాంగే" అని సమాధానం చెబుతారు లైట్ కాఫీ తాగడం మనవారి దృష్టిలో ఫేషన్‌కు విరుద్ధం

పాశ్చాత్యులు మనకంటే బడాయి మనుషులు అసలు పాలె కలుపుకోం అచ్చంగా బ్లాక్ కాఫీ తాగేస్తారు ఒకవేళ పాలు కలుపుకున్నా దాన్ని "మిల్క్" అనరు నాజూకుగా "క్రీమ్" అని వ్యవహరిస్తారు

ఇది మంచి పద్ధతి కాదట కొలోన్ డాక్టర్లు చెబుతున్నారు అసలు కాఫీయే మంచిదికాదు దానిలోని "కాఫీన్" అనే పదార్థం నిద్రను చెడగొడుతుందట గుండెలను బలహీనం చెస్తుందట దానికి తోడు పాలు కలపక పోయినా తక్కువ కలిపినా, కాఫీవల్ల హాని ఎక్కువై పోతుందట. అంతేకాదు, పంచదార ఎక్కువ కలుపు కోవడం కూడా "కాఫీన్" దుష్ఫలితాలను ఎక్కువ చేస్తుందట అందుచేత, పాలు ఎక్కువ, పంచదార తక్కువ కలుపుకుని కాఫీ సెవించాలట

కాని, చాల మంది—ముఖ్యంగా పరీక్షలు దగ్గర పడుతున్న విద్యార్థులు—నిద్ర చెడడం కోసమే స్ట్రాంగ్ కాఫీ, టీ లు తాగుతారు వీరి దృష్టిలో ఆరోగ్యం కంటె పరీక్షలే ముఖ్యం కావచ్చు గాని, "మొదటి నుంచి శ్రద్ధగా చదివితే కాఫీ, టీలు తాగి మేలుకుని చదువుకోవలసిన అవసరం వుండదు గదా." అని పెద్దలు మందలించకుండా వూరుకోరు

కాఫీ తర్వాత సిగరెట్టు కాల్చరాదని కూడా కొలోన్ డాక్టర్లు హెచ్చరిస్తున్నారు ఈ హెచ్చరిక బొత్తిగా అన్యాయంగా వుంది కాఫీ తర్వాత కాల్చే సిగరెట్టే సిగరెట్టు, దాని రుచి మరి దేనికీ రాదు చాలమంది కాఫీ తాగడం సిగరెట్టుకు ఒక "బెస్"ను— ఒక ప్రాతిపదికను— ఏర్పరచడం కోసమే

బహుశా మానవునికి ఆహ్లాదకరమైన ప్రతిదానిలోను ఏదో ఒక చెడు కూడా మిళితమై వుంటుంది కాబోలు— వెలుగు ప్రక్క నీడలా, గులాబీ క్రింద ముల్లులా!

# మితిమీరిన అలంకరణ

ఆడవారికి అలంకరణపై మోజు పుట్టుకతో వచ్చిన లక్షణంగా కని పిస్తుంది ముఖ్యంగా పడుచుతనంలో అలంకరణపట్ల చూపినంత శ్రద్ధ మరి దేనిమీద వారు చూపరనే చెప్పవచ్చు

అలంకరణవల్ల అందం ఇనుమడించదని మా తాత్పర్యం కాదు. కాని అది తగు మాత్రంగా వుండాలి మితం ఎరిగి అలంకరించుకుంటే అందమే లేకపోతే వున్న అందం కూడా చెడిపోవచ్చు. అలంకరణ మాటున అసలు అందమే మరుగుపడి పోవచ్చు

ఎంత కమ్యూనిస్టు దేశమైనా, సోవియట్ యూనియన్‌లో కూడా స్త్రీలకు అలంకరణ పట్ల వ్యామోహం తప్పలేదు వారి కృత్రిమా లంకరణను ఈ మధ్య ఒక సోవియట్ పత్రిక ఘాటుగా విమర్శించింది- వారి కేశాలంకరణ కాకి గూడు వలె వుంటున్నదట కళ్ళు, కనురెప్పలు, రెప్పల వెంట్రుకలు, పెదవులు—అన్నిటికి రంగులు పులమడం వల్ల మొత్తం ముఖమే వికృతంగా తయారవుతున్నదట వారి వస్త్రధారణ అసభ్యంగా వున్నదని కూడా ఆ పత్రిక విమర్శ

ఇది మన దేశంలో కూడా ఆధునికుల మనుకునే స్త్రీలకు వర్తి స్తుంది పూర్వ కాలపు ఆభరణాలు—చెవులకు దిద్దులు, తలలో నాగరం, మెడలో కంటె, చంద్రహారం, మోచేతుల పైన వంకీలు, మోచేతుల కింద గాజులు నడుముకు వడ్డాణం, కాళ్ళకు కడియాలు, కాలి వేళ్ళకు మట్టెలు ముక్కుకు అడ్డబాస, చేతి వేళ్ళకు ఉంగరాలు—ఇవన్నీ ఈనాడు మోటైపోయిన మాట నిజమే. కాని, నేటి స్త్రీలు పాశ్చాత్యులను అనుక రిస్తూ చేసుకునే అలంకరణ సయితం ఇంతే మోటుగా, ఇంతకంటె వికా రంగా, కొన్ని సందర్భాలలో అసభ్యంగా కూడా వుండడం లేదా?

అందుకే అతి ఎల్లప్పుడు వర్జనీయ మన్నారు అలంకరణకు మాత్రం ఇది ఎందుకు వర్తించదు?

# రష్యాలో రౌడీలు

కాశికి పోయినా ఈగల బాధ తప్పదన్నట్టు రష్యాలోకూడా రౌడీల బెడద తప్పడం లేదట సామ్యవాద సమాజం నవమానవులను సృష్టిస్తుందని రష్యన్లు ఇదివరలో ప్రచారం చేసేవారు బహుశా ఈ రౌడీలు కొత్తరకం రౌడీలై వుండవచ్చు

కొత్తరకం రౌడీలైనా కాకపోయినా వారికి రష్యాలో కొత్తరకం శిక్షలు మాత్రం వేస్తున్నారు. జైలులో చెప్పినమాట వినక ఎదురుతిరిగే రౌడీలకు తల శుభ్రంగా గొరిగించి అవమానించడం వీటిలో ఒకటి

మీసం పౌరుషచిహ్నం కనుక, దాన్ని బలవంతాన తీసివేస్తే అవమానం కావచ్చు. కాని, తలగొరగడం అవమానచిహ్నంగా ఎందుకు వచ్చిందో? ఇది అన్ని దేశాలలోను వున్నది. పూర్వం మన దేశంలో కూడా నేరస్థులను తల నున్నగా గొరిగి, సున్నపుబొట్లు పెట్టి, గాడిదలపై ఊరేగించే వారట

రష్యాలో ఈ కొత్తరకం శిక్షవల్ల అధికారులకు ఎదురుతిరిగే రౌడీల సంఖ్య తగ్గిపోతున్నదట మిగిలిన వారినికూడా దారికితీసుకు రావడానికి, వెనకటికి శ్రీకృష్ణుడు రుక్మికి చేసిన పరాభవం వంటిది చేయవచ్చు అంటే మరేమీ లేదు-తల పూర్తిగా కాక సగం మట్టుకే క్షవరం చేయడం

# హంతకాగ్రేసరుడు

ఒకోటి మానవుడిని హత్య చేసిన తర్వాత హంతకుని మనస్సు ఎలా వుంటుంది ? ఎట్టి వికారాలకు లోనౌతుంది ? పాపం, పుణ్యం అనేవి నిజంగా వున్నాయా ? మొదలైన తాత్త్విక, నైతిక సమస్యలపై పరిశోధన జరపడానికిగాను డాస్టొయెవ్‌స్కీ నవల "క్రైమ్ అండ్ పనిష్‌మెంట్"లో నాయకుడు రాస్కోల్నికొవ్ ఒక వృద్ధురాలిని హత్య చేస్తాడు

మొన్న టెక్సాస్‌లోని ఒస్టిన్ నగరంలో ఒక్కసారిగా తన భార్య, తల్లితో సహా, పదునలుగురిని హత్య చేసిన చార్లెస్ విట్మన్ కూడా రాస్కోల్నికోవ్ వంటి వాడేనేమో లేకపోతే, భార్యపట్ల అంత మక్కువ, తల్లిపట్ల అంత భక్తిగలవాడు, సాధారణంగా ఎవరికి అపకారం చేయని నెమ్మదస్తుడు నిష్కారణంగా అంత ఘోరచర్యకు ఎందుకు పాల్పడతాడు?

లేదా, పైకి సాయిలా పాయిలాగా మామూలుగానే తిరుగుతున్నట్టు కనబడినా, అతని గుండెలో ఏవో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతూ వుండాలి దానితో అతనికి తాత్కాలికంగా మతిభ్రమణం కలిగివుండాలి లేకపోతే అతనిలో మానవత్వం అంతర్హితమై ఒక్కసారిగా అంతటి దానవత్వం ఎలా పెల్లుబుకుతుంది ? ఏమైనా, మనస్తత్వ శాస్త్రజ్ఞులు పరిశోధింపదగిన జీవితకథే అతనిది అట్టి పరిశోధన జరిగినా, మానినా, ఆల్‌ఫ్రెడ్‌హిచ్ కాక్ వంటి ఏ దర్శకుడో ఈలోగా చలనచిత్రం తీసినా తీయవచ్చు

# మికీమౌస్

బాలలది ఒక ప్రత్యేక ప్రపంచం సాధారణ ప్రపంచాన్ని బాధించే నియమాలు, సూత్రాలు ఏవీ ఆ ప్రపంచాన్ని బాధించవు పిల్లల లోకంలో జంతువులు మానవభాషలో మాట్లాడుతాయి.వృక్షాలు నడుస్తాయి పర్వతాలు ఎగురుతాయి మంత్రగత్తెలు ప్రకృతి సమస్తాన్ని శాసిస్తారు ఆ లోకంలో ఏదీ అసంభవం కాదు.

ఈ రహస్యాన్ని కనిపెట్టిన వాల్ట్ డిస్నీ బాలల ప్రపంచాన్ని కార్టూన్ చలన చిత్రాల లోనికి అనువదించాడు మాట్లాడే ఎలుకను, బాతును, శునకాన్ని, ఇంకా ఎన్నెన్నో జంతువులను, పక్షులను పాత్రలుగా తీసుకుని అద్భుత కళాఖండాలను సృష్టించాడు దేశదేశాల బాల బాలికలకు వినోదాన్ని పంచిపెట్టాడు

ఆయన సృష్టించిన "మికీ మౌస్" మొన్న డిస్నీల్యాండ్‌లో 40వ జన్మదినోత్సవం చేసుకున్నదట డిస్నీ ఒకసారి న్యూయార్కు నుంచి కాలిఫోర్నియాకు రైలులో ప్రయాణం చేస్తుండగా ఆయనకు ఒక నిజమైన ఎలుకద్వారా మికీ మౌస్ పాత్ర భావన స్ఫురించిందట దాన్ని ఆయన మొదట సైలెంట్ కార్టూన్ చిత్రాలలో ఉపయోగించినప్పుడు ఎవ్వరూ మెచ్చుకోలేదు ఏ బ్యాంకరూ పెట్టుబడి పెట్టడానికి ముందుకు రాలేదు కాని, 1928లో "స్టీంబోట్ విల్లీ" అనే చిత్రంలో మికీ మౌస్ చేత మాట్లాడించినప్పుడు ఆ చిత్రం విజయవంతమైంది నాటి నుంచి అతడు ఎన్నో మికీ మౌస్ చిత్రాలు తీశాడు

అతని మికీ మౌస్ మాత్రమేకాక డొనాల్డ్ డక్, గూఫీ, ప్లూటో, ట్రాంప్, శ్క్రాంప్ మొదలైన జంతు పాత్రలు కూడా అపార విజయం పొందాయి షేక్స్పియర్ డికెన్స్ తమ రచనలలో సృష్టించిన పాత్రల వలె, డిస్నీ తన కార్టూన్ చిత్రాలలో సృష్టించిన ఈ పాత్రలు కలకాలం నిలిచిపోతాయి వాటితోపాటు వాటి సృష్టికర్త డిస్నీ కీర్తి అజరామరంగా నిలుస్తుంది

# పిల్లల దేవత

క్రిస్మస్ సంప్రదాయా లన్నిటిలోకి శాంటాక్లాస్ సంప్రదాయం మనోహరమైనది శాంటాక్లాస్ బాలబాలికలకు ఇష్టదేవత వంటివాడు క్రిస్మస్ పండుగ ముందునాటి రాత్రి ఆయన తమకు ఏవేవో కానుకలు తెచ్చి రహస్యంగా మేజోళ్ళలోనో, తలగడల క్రిందనో గూళ్ళలోనో పెడతారని పిల్లలు నమ్ముతారు తల్లిదండ్రులో మరెవరో తమ పిల్లలు కోరిన కానుకలు తామే తెచ్చి శాంటాక్లాస్ ఇచ్చినట్టు నమ్మించడం ఆచారం

శాంటాక్లాస్ పిల్లల భావనాలోకంలోనే వున్నంతకాలం ఫరవాలేదు. ఆయన ఘాలోకంలోకి యధార్థంగా వస్తేనే చిక్కు.

మొ లక్జెంబర్గ్‌లో కొందరు గృహస్థులు తమ పిల్లల వినోదార్థం ఒకడిని శాంటాక్లాస్ వేషంవేసుకుని రమ్మని చెప్పారట వాడు వచ్చే సరికి నాలుగు డబ్బులు అడుక్కుందామని మరొకడు అదే వేషంలో తయారయ్యాడట. నేనే అసలు శాంటాక్లాస్‌నంటే, నేనే అసలు శాంటాక్లాస్‌నని వారిద్దరూ దెబ్బలాడుకున్నారు తెల్లని గడ్డాలు ఊడిపోయాయి దుస్తులు పీలికలై పోయాయి ఇద్దరికీ వొళ్ళు హూనమైంది చివరికి గృహస్థులు వారిని వీధిలోకి గెంటి తలుపులు వేసుకున్నారు

తమకు ఆరాధ్యదేవత అయిన శాంటాక్లాస్ ఇలా రెండు రూపాలలో వచ్చి రౌడీవలె ప్రవర్తించడం ఆ గృహస్థుల పిల్లలకెంతో ఆశాభంగం కలిగించి వుంటుంది శాంటాక్లాస్‌పై వారి నమ్మకం ఎగిరిపోయి వుంటుంది లేక, తమ వినోదం కోసమే శాంటాక్లాస్ ఈ పోట్లాట ప్రదర్శన ఏర్పాటు చేశాడని వారు సరిపెట్టుకున్నారేమో !

# నిధి చాల సుఖమా!

"ఎంత వెట్టుకు అంత గాలి" అన్నారు డబ్బు దండిగా వున్నవాడికే సమస్యలు సమృద్ధిగా వుంటాయి

ఇంగ్లండులో ఒక స్కూలు విద్యార్థికి ఎలిజబెత్ రాణి మీద అసూయ పుట్టిందట తన రాబడి ఏడాదికి పది పౌనులు ఆమె రాబడి 4,75,000 పౌనులు ఆవిడ తన కంటె అన్ని రెట్లు సుఖంగా వున్నట్టు కాదా?

అయితే రాణీగారికివుండె కష్టాలు రాణీగారికి వుంటాయిని ఆ విద్యార్థికి టీచరు నచ్చ చెప్పిందట కాని, వాడు నమ్మలేదు రాణిగారి బాధ్యతలలో ఒకటి అప్పుడప్పుడు వెయ్యేసి మందితో కరచాలనం చెయ్య డం అది ఏమంత కష్టం కాదని నిరూపించడానికి పదిహేను షిల్లింగులు పందెం కట్టి వీధులలో అతడు బయలుదేరాడట.

ఆ తర్వాత ఏమి జరిగిందో మనకు తెలియదుగాని, ధనికులకు కష్టాలే వుండవని వాడనుకోవడం పొరపాటే అందుకే సగం ప్రపంచానికి మిగతా సగం ఎలా బ్రతుకుతున్నదో తెలియదంటారు

ఎలిజబెత్ రాణినే తీసుకోండి వెలాది జనంతో కరచాలనం చేయడ మేనా? ఏవేవో ప్రారంభోత్సవాలు చెస్తూ వుండాలి ఉపన్యాసాలిస్తూ వుండాలి దేశాలు పర్యటిస్తూ వుండాలి, కార్లలో తిరగాలి అతిథులతో ఇష్టం వున్నా లేకపోయినా, మర్యాదగా, తియ్యగా మాట్లాడాలి రాని చిరు నవ్వు తెప్పించుకుని గంటల తరబడి పెదవులకు అతికించుకుని వుండాలి మరెన్నో రాచకార్యాలు చక్కబెట్టాలి

ధనికులైనా అంతే పైన వున్నవాడికె కిందికి పడిపోతాననే భయం ఉన్నది పోతుందని ఆదుర్దా ఒక కోటి కలవాడికి ఇంకోటి కావాలని ఆందోళన డబ్బు రాగానే గొప్ప వాళ్ళయి పోయినట్టు, సర్వజ్ఞులైనట్టు, మేధావులైనట్టు నటించాలి ఇవన్నీ కష్టాలు కావా?

"నిధి చాలా సుఖమా? రాముని సన్నిధి చాల సుఖమా?" అని త్యాగరాజులవారు ఊరికే అన్నారా?

# బద్ధకస్తుల సంఘం

ఈ వేళ చేయగలిగిన దాన్ని రేపటికి వాయిదా వేయరాదని ఇంగ్లీషులో సూక్తి కాని, రేపటికి వాయిదా వెయగలిగినదాన్ని ఈ వేళ చేయరాదని భావించేవారు అమెరికాలో కొందరున్నట్టున్నారు వీరు ఫిలడెల్ఫియాలో స్థాపించుకున్న సంఘం పేరు "ప్రొక్రాస్టినేటర్స్ క్లబ్" "ప్రొక్రాస్టినేషన్" అంటే వాయిదా వేయడం ఈ క్లబ్బును అచ్చ తెలుగులో "బద్ధకస్తుల సంఘం" అనవచ్చు

ఈ సంఘంలోని 25 మంది సభ్యులు న్యూయార్కులోని "ప్రపంచ ప్రదర్శనం" చూడ్డానికి బయలుదేరి అది ముగిసిన పదమూడు నెలలకు మొన్న న్యూయార్కు చేరుకున్నారట. జనం రద్దీ క్యూలు లేకుండా "అన్నీ" చూడవచ్చునని వారు సంబరపడుతున్నారట.

బహుశా అమెరికాలో ఎప్పుడు చేయవలసిన పని అప్పుడే చేస్తారేమో పనులు వాయిదా వేయరెమో అందుచేత ఏ కొందరో బద్ధకిస్తులంటే వారు తమ ప్రత్యేకతను కాపాడుకొనడానికి ఈ క్లబ్బు స్థాపించుకొని వుండవచ్చు

మనదేశంలొ ఇట్టి క్లబ్బులు అవసరం లేదు వాటి బదులు మనకు ప్రభుత్వాలున్నాయి అవి ఎప్పుడు చేయవలసిన పనులను అప్పుడు చేయకపోవడంలో ప్రసిద్ధి కెక్కాయి బద్ధకంవల్ల కాదు గాని. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అన్నట్టు అవి సందిగ్ధతకు బందీలుగా (ప్రిజనర్స్ ఆఫ్ ఇన్‌డెసిషన్) తయారైనాయి

దేశంలో కొంత అలజడి వస్తేగాని మన ప్రభుత్వాలు చేయవలసినవి చేయవు వాటిని ఏ పనికి ఒప్పించాలన్నా ఇదే మార్గమన్న భావం ప్రబలడం ఇందుకే ఆంధ్రరాష్ట్రం, పంజాబీ సుబా, మైసూరు—మహారాష్ట్ర సరిహద్దు వివాదం—ఇంకెన్నో ఇందుకు ఉదాహరణలు ఇప్పుడు ఉక్కు ఫ్యాక్టరీ సమస్యను వాయిదా వేయడం సరికొత్త ఉదాహరణ

# ముత్యాల సరాలు

ఆకాశంలో అరుదుగా అగుపించే విచిత్రాలలో తోకచుక్క ఒకటి అందుకే నింగిపై తోకచుక్క పొడిచినప్పుడెల్లా అది ఖగోళ శాస్త్రజ్ఞులను, సామాన్య ప్రజలను కూడా సమానంగా ఆకర్షిస్తుంది

నెలరోజులుగా వివిధ దేశాలలో శాస్త్రజ్ఞులచేత రకరకాలుగా ఊహాగానాలు చేయించిన "ఇకెయా-సెకీ" తోకచుక్క అటువంటిదే అది సూర్యగోళంలోకి చొచ్చుకు పోతుందని కొందరు, మార్గమధ్యంలోనే ముక్కలై మింటిలో ముత్యాల ముగ్గులు పెడుతుందని కొందరు ఊహించారు చివరి కది సూర్యుని సమీపిస్తూ మెల్లిగా విచ్ఛిన్నమై పోతున్నట్టు చెబుతున్నారు

ఇవన్నీ ఖగోళ శాస్త్రజ్ఞులకే ఆసక్తి కలిగించే విశేషాలు సామాన్యులకు తోకచుక్క ఒక వింత అది ఎంతగా ఆసక్తిని కలిగిస్తుందో, అంతగా భీతినికూడా కలిగిస్తుంది తోకచుక్క అరిష్ట సూచకమనే నమ్మకం ఇండియాలోనే కాదు, ప్రాచీన కాలంలో అన్ని దేశాలలోను వుండేది అయితే ఖగోళాన్ని శాస్త్రీయదృష్టితో పరిశోధించడం హెచ్చినప్పటి నుంచి, సౌర కుటుంబంలో లక్ష ఇరవై వేలకుపైగా తోకచుక్కలున్నవని కనుగొన్నప్పటినుంచి తోకచుక్క పొడుపు కూడా సూర్య, చంద్ర గ్రహణాలవలె పరిపాటిగా జరిగే విశేషమైపోయింది

తోకచుక్కను గురించిన మూఢ విశ్వాసాలను ఖండించిన మొదటి తెలుగువాడు బహుశా గురజాడ అప్పారావుగారేనేమో! "అరుదుగా మిను చప్పరంబున- చొప్పు తెలియని వింత పొడమగ-చన్న కాలపు చిన్న బుద్ధులు-బెదరి యెంచిరి కీడుగా" అని ఆయన తమ "ముత్యాల సరాలు" గేయకావ్యంలో వ్రాశారు అంతేకాదు- తోకచుక్కను మన్మధ బాణంగా- ఆకాశానికి ఆభరణంగా, సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగా ఆయన వర్ణించారు

అప్పారావుగారికి 21 ఏళ్ళ వయసప్పుడు - 1882లో—

ఒక తోకచుక్క వచ్చిందట అది సరిగా మొన్నటి "ఇకెయా—సెకీ" తోకచుక్క వంటిదేనని డాక్టర్ ఫ్రాంక్లిన్ అనే అమెరికన్ శాస్త్రజ్ఞుడు వెల్లడించాడు అది కూడా సూర్యుని సమీపించే మార్గంలో ఛిన్నాభిన్నమై లక్షమైళ్ళమేర ముత్యాలవంటి వెలుగులను విరజిమ్మిందట అందుకే దానికి "స్ట్రింగ్ ఆఫ్ పెరల్స్" [ముత్యాల హారం] తోకచుక్క అని శాస్త్రజ్ఞులు పేరు పెట్టారు అప్పారావుగారు దాన్ని దృష్టిలో పెట్టుకునే, తోకచుక్కపై తాము వ్రాసిన గేయాన్ని "గుత్తునా ముత్యాల సరములు" అని ప్రారంభించారేమో, ఆ గేయానికి "ముత్యాల సరా"లనే శీర్షిక పెట్టడానికి, తమ కొత్త ఛందస్సుకు కూడా అదే పేరుపెట్టడానికి ఆ తోకచుక్క ఉదంతమే కారణమేమో ,

ఏమైనా, ఎక్కడో విశ్వాంతరాళంలో జరిగే గ్రహ, నక్షత్రాల కదలికలకు వ్యక్తి జీవితంలో జరిగే అనుదిన శుభాశుభాలకు సంబంధం లేదని గ్రహించడం శాస్త్రీయ దృక్పథానికి మొదటి మెట్టు అంతగా సంబంధం వున్న దనుకోవడం లోనే మనసు సంతృప్తి కలిగేట్టయితే, తోకచుక్కను అరిష్టదాయకంగానే ఎందుకు భావించాలి? అప్పారావు గారివలె మనంకూడా మొన్నటి తోకచుక్కను "విశ్వకళ్యాణ పతాక"గా ఎందుకు భావించరాదు ?

# మంద మతులకం మందు

ఒకసారి కొందరు వైద్యశాస్త్రవేత్తలు ఎలుకలపై నికొటిన్ ప్రయోగించి, దాని ఫలితాలనుబట్టి ధూమపానం చాలా చెడ్డదని సిద్ధాంతీకరించారు. దీనిపై ప్రసిద్ధ హాస్య రచయిత పి.జి. వోడ్‌హౌస్ వ్యాఖ్యానిస్తూ "ఎలుకలకు ధూమపానం చెడ్డదే కావచ్చు. కాని మనుషులు ఎలుకలు కారుగదా" అన్నాడు.

ఈ మధ్య అమెరికన్ శాస్త్రజ్ఞులు కొందరు "మెగ్నీషియం పెమోలిన్" అనే మందును ఎలుకలపై ప్రయోగించగా వాటికి విషయ గ్రహణ శక్తి పెరిగినట్లు తేలిందట.

ఇదేవిధంగా మానవుడి మెదడు ఎలా పని చేస్తుందో పరిశోధించి, దానికి తగు ఔషధాలను కనిపెడితే, గ్రహణశక్తిని, జ్ఞాపక శక్తిని, విస్మృతి శక్తిని కూడా పెంచవచ్చునని వారి సిద్ధాంతం.

మంచిదే! సుఖంగా, సునాయాసంగా మహత్కార్యాలను సాధించాలనేది అనాదిగా మానవుడు చేస్తున్న కృషి. ఎక్కడికి వడితే అక్కడికి చిటికెలో వెళ్ళడానికి పాదలేపం కోసం, ఏ లోహాన్నయినా బంగారం చేయగల స్పర్శవేదికోసం, నాలుకపై పూసినంత మాత్రాన సమస్తవిద్యలను కరతలామలకం చేసే మరేదో పసరు కోసం అనాదిగా అన్వేషణ జరుగుతూనే వుంది. మనిషి చెమటోడ్చి పని చేస్తేగాని జీవించలేని స్థితి ఆదిమానవుడైన ఆదాం పొరపాటువల్లనేనని క్రైస్తవుల విశ్వాసం. ఇందుకే సులభోపాయాలకోసం ఈ నిరంతరాన్వేషణ.

అమెరికన్ శాస్త్రజ్ఞులు ఆ మందు లేవో త్వరలో కనిపెడితే ఎంత బాగుండును! జ్ఞాపక శక్తి పెరుగుతుంది కనుక పిల్లలు ఒక్కసారి పాఠం చదివితే చాలు, పరీక్షలు ప్యాసైపోతారు; లాయర్లు ఎట్టి గడ్డుకేసైనా ఇట్టే వాదించేస్తారు; కవులకు ఏ మాట కావలిస్తే అది చటుక్కున స్ఫురిస్తుంది. భర్తలకు భార్యల పురమాయింపు ప్రకారం బజారు నుంచి తేవలసినవి మరపుకు రావు. మతిమరపు ప్రొఫెసర్లపై "జోక్స్" వాడుకనుంచి తొలగిపోతాయి. ఇంకా ఎందరికో ఎన్నో లాభాలు.

మంచిదేగాని, ఇంతకూ శాస్త్రజ్ఞులు చేసిన ప్రయోగాలు ఎలుకలపైనే. వోడ్‌హౌస్ అన్నట్లు ఎలుకలు మానవులు కావుగదా! మానవులు కూడా ఎలుకలైపోతే తప్ప ఆ మందులు పని చేయవేమో మరి!

# గృహ నిర్వహణ బాధ్యత

గృహ నిర్వహణ విద్యను స్త్రీలకే ఎందుకు నేర్పాలి? పురుషుల కెందుకు నేర్ప రాదు? రాజ్యసభ ఉపాధ్యక్షురాలు శ్రీమతి వయొలెట్ ఆల్వా మొన్న ఢిల్లీలో జరిగిన ఒక సభలో ఈ ప్రశ్నలు వేశారు

నిజమే. స్త్రీ పురుషులమధ్య ఈ అసమానత ఎందుకుండాలి? అన్ని రంగాలలో స్త్రీలు ముందుకు వస్తున్నారు పురుషులు చేయగల ఏ పనినైనా తాముకూడా చేయగలమని నిరూపించుకుంటున్నారు చివరికి రోదసీయానంలో సయితం స్త్రీలు వెనుకబడి లేరని రష్యన్ తెరిష్కోవా రుజువు చేసింది అయినప్పుడు గృహనిర్వహణను మాత్రం స్త్రీతే చేయదగినదని ప్రత్యేకించడం దేనికి?

అయితే, స్త్రీ పురుషులలో ప్రాకృతికంగానే కొన్ని భేదాలున్నాయి వాటినిబట్టి వారి విధులలో, బాధ్యతలలో సయితం విభేదా లుండక తప్పదు వంట చేయడం, స్థూలంగా గృహ నిర్వహణ భారం వహించడం వరకు ఫరవాలేదు కాని, పిల్లలను లాలించడం, సాకడం, పెంచి పెద్దచెయడం వంటివి ప్రత్యేకించి మహిళలే వహించవలసిన బాధ్యతలు

క్షమకు స్త్రీని పర్యాయ పదంగా వాడుతారు సహనానికి వారిది పెట్టిందిపేరు అది పుట్టుకతో ప్రకృతి ధర్మాన్నిబట్టి రావలసిందే, నేర్పితే వచ్చేది కాదు పిల్లలపట్ల ముఖ్యంగా శైశవ దశలో, తల్లులు చూపగలిగిన శ్రద్ధాసక్తులు తండ్రులు చూపలేరు.

అయినా పిల్లలను లాలించడంతోసహా గృహ నిర్వహణశాస్త్ర మర్మాలన్నీ పురుషులకు నేర్పాలని శ్రీమతి ఆల్వా సూచించడం— ఈ బాదరబందీ స్త్రీలకు మాత్రమే దేనికుండాలని, పురుషు లెందుకు స్వేచ్ఛగా వుండాలని అసహనంతో చేసినదే కావచ్చు. ఇంతకీ, శిశు పోషణ బాధ్యతను పురుషులకు అప్పగించడానికి స్త్రీలైనా అంగీకరిస్తారో లేదో?

# ప్రేమ పాఠాలు

యువతులు, యువకులు అజ్ఞానంవల్ల చెడు త్రోవలు పట్టకుండా, జీవితాలను దుఃఖభాజనాలుగా చేసుకోకుండా, వారికి పాఠశాలల లోనే లైంగిక విజ్ఞానాన్ని బోధించడం అవసరమని ఒక వాదం చాల కాలంగా వున్నది పాశ్చాత్య దేశాలలో ఈ విధానాన్ని అమలుచేయడం కూడా జరిగింది

ఇది సరేగాని, ఇంగ్లండ్‌లో రోష్‌డెల్ అనే వూళ్ళో ఒక పాఠశాల ఇంకొక మెట్టు పైకి పోయిందట సెక్స్ విజ్ఞానమేకాక, బాల బాలికలకు ప్రేమ పాఠాలనుకూడా అక్కడ సిలబస్‌లో చేర్చారట

మన దేశంలో సెక్స్ విజ్ఞాన బోధన సమస్య సంగతి ఏమైనా, ప్రేమ పాఠాలను మాత్రం సిలబస్‌లో చేర్చవలసిన అవసరం లేదు ఆ పని మన చలనచిత్రాలే చేసిపెడుతున్నాయి

కథానాయకుడు, నాయిక పరస్పరం ఎలా ఆకర్షించుకోవాలి, వారి కోసం ప్రత్యేకంగా నిర్జనం చేయబడిన తోటలలో పొదల చుట్టూనో సెలయేళ్ళవద్దనో, జలపాతాల వద్దనో పాటలు పాడుతూ ఎలా పరిగెత్తాలి మొదలైన వాటిని వివరంగా చూపని చలన చిత్రాలే వుండడంలేదు ఇతి వృత్తం ఏదైనా, ఈదృశ్యాలకు కొంత నిడివిని కేటాయించడం పరిపాటై పోయింది వీటిని అందరితో పాటు విద్యార్థులుకూడా బాగా అభిమానిస్తు న్నారు కాగా, పాఠశాలలలో వేరే ప్రేమ పాఠాలు నేర్పడం దేనికి?

# నలుగురితో పాటు....

సిగరెట్లు కాల్చేవారికి క్యాన్సర్ వచ్చే అవకాశాలెక్కువని ఇంతవరకు వైద్యులు భయపెడుతున్నారు ఇకపై వారు నిశ్చింతంగా వుండవచ్చు

గ్లాస్గో డాక్టరొకడు పరిశోధనలు జరిపి తేల్చిన దాన్నిబట్టి-మాన సిక బాధలు, చికాకులవల్ల క్యాన్సర్ రావచ్చునట ఈనాడు ప్రపంచంలో బాధలు, చికాకులు లేని దెవరికి? ప్రతివాడికి పొద్దున లెచిన దగ్గిరనుంచి ఏదో ఒక బాధ, చికాకు తప్పదుగదా?

బాధలు, మనోవేదనలు బయటికి చెప్పుకోలేక దిగమింగేవారికి క్యాన్సర్ రావచ్చునట ప్రతివాడికి ఏదో బాధవున్నప్పుడు. ఎవరిబాధ లెవరు వింటారు? వినే ఓపిక ఎవరి కుంటుంది?

భార్యలతో తగవులాడె వారికి కూడా క్యాన్సర్ రావచ్చునట ఇదీ అంతే భార్యలతో దేనికో ఒకదానికి పేచీపడని పెద్దమనిషి ఎవడుంటాడు?

మొత్తంపై, గ్లాస్గో డాక్టరు చెప్పిన క్యాన్సర్ అవకాశాల లక్షణాలు ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులకు వర్తిస్తాయి అంటే దాదాపు ప్రతి వాడికి క్యాన్సర్ రాగల అవకాశం ఏదో విధంగా వుంటుందన్నమాట

అయినప్పుడు ప్రత్యేకించి సిగరెట్లు కాల్చేవారు మాత్రమే క్యాన్సర్‌కు భయపడవలసిన అవసరం ఏముంది? నలుగురితో పాటు నారాయణా!

# ఎందరో మహానుభావులు !

మొన్న హైదరాబాద్‌లో జరిగిన ఒక సభలో మూడు రకాల వక్తలు ప్రసంగాలు చేశారట

ముగ్గురిలోకి ముఖ్యమంత్రి అదృష్టవంతులు ఆయనకు ఉపన్యాసాలు వ్రాసిపెట్టేవారున్నారు అందుచేత ఎవరిచేతనో వ్రాయించుకుని చదివారు

సభలో పాల్గొన్న వైజ్ఞానిక, పారిశ్రామిక పరిశోధనా సంస్థ అధ్యక్షుడు డక్టర్ ఆత్మారాం తనకు వ్రాసిపెట్టేవారెవరూ లేక ఆశువుగా ఉపన్యసించారు

ప్రధాని ఇందిరాగాంధికి వ్రాసిపెట్టేవారు లేకపోలేదుగాని, మరొకరి అభిప్రాయాలను ఎరువు తెచ్చుకొనడం ఇష్టం లేక తనకు తానే ఆశువుగా ప్రసంగించారు

వీరుకాక, సాధారణంగా వక్తలలో మరొక రకం వారుంటారు వారికి వ్రాసిపెట్టేవారు చదివిపెట్టేవారు కూడా కావాలి చదివిపెట్టేవారు దొరక్క, తామే చదవవలసివస్తే అభాసుపా లవుతూ వుంటారు కూడా

దక్షిణాఫ్రికాలో వెనకటికి లక్ష్మీకటాక్షం వున్నా సరస్వతీ ప్రసన్నుడు కాని భారతీయ వర్తకు డొకడు ప్రముఖు లెవరు వచ్చినా, సన్మాన పత్రాలు చదవడానికి ఉబలాటపడే వాడట శ్రీమతి సరోజినీ నాయుడు ఒకసారి రాగా, ఆమెకు సన్మానపత్రం సమర్పిస్తూ, "నైటింగేల్ ఆఫ్ ఇండియా" అనడానికి బదులు "నాటీగర్ల్ ఆఫ్ ఇండియా" అని చదివాడట

ఒకసారి తిరుపతి సంస్కృత విశ్వపరిషత్తులో ఒక మంత్రిగారు ఉపన్యసిస్తూ "ఇమ్మోర్టల్ ఇండియా (అమర భారతి)" అనడానికి "ఇమ్మోరల్ ఇండియా" (అవినీతి మయమైన ఇండియా) అన్నారట

ఢిల్లీ సభలో ఒక తెలుగాయనే డాక్టర్ రాధాకృష్ణన్ పేరు ఉచ్చారణలో సయితం తడబడి "రాధాపల్లి సర్వేకృష్ణన్" అని కొంత వినోదం కలిగించాడట

ఎందరో మహానుభావు లుంటారు మరి; వీరందరికీ వందనాలు చేయడం కూడా కష్టం !

# అభివృద్ధి ఖరీదు

ప్రస్తుతం మన సమస్యలన్నీ దేశం సర్వతో ముఖంగా అభివృద్ధి చెందుతున్నందువల్ల వస్తున్న వేనని ప్రధాని ఇంధిరాగాంధి చెబుతున్నారు ఇందులో నిజం లేకపోలేదు. మరి

ఆమె ఉదాహరించినట్టు విద్యావంతు లెక్కువౌతున్నారు. దానితో నిరుద్యోగుల సంఖ్య పెరుగుతున్నది. ప్రజలకు వైద్య సౌకర్యాలను పెంపొందిస్తున్నాము దీనివల్ల మరణాల సంఖ్య తగ్గి జనాభా పెరిగి పోతున్నది

కాని, నిరుద్యోగాన్ని తప్పించుకొనడానికి ప్రజలను విద్యాగంధం లేకుండా వుంచి వేయడం సాధ్యమా? జనాభా పెరగకుండా చేయడానికి ప్రజలకు వైద్యసౌకర్యాలు లేకుండా చేయగలమా?

ప్రధాని ఉదాహరించిన సమస్యలను మరెన్నిటినైనా పేర్కొన వచ్చు విద్యారంగాన్నే తీసుకుంటే, విద్యాలయాలను పెంచివేసినకొద్దీ విద్యాబోధన సౌకర్యాలు తగ్గిపోతున్నాయి. విద్యాప్రమాణాలు పడిపోతున్నాయి. విద్యార్థులలో క్రమశిక్షణ తగ్గిపోతున్నది అలాగే వైద్య సౌకర్యాలను పెంచినకొద్దీ ఆస్పత్రులు అధ్వాన్నంగా తయారవుతున్నాయి కల్తీ మందులు హెచ్చుతున్నాయి. వాటి ధరలు పెరిగిపోతున్నాయి

ప్రణాళికల తీగను కదిపితే పన్నుల భారం ద్రవ్యోల్బణం, అధిక ధరలు,అధికారుల ప్రాబల్యం మొదలైన డొంకంతా కదులుతుంది కనుక దాని జోలికి పోకపోవడమే మంచిది.

ప్రతి గులాబీకి ముళ్ళుంటాయన్న మాట నిజమే దేశాభివృద్ధి గులాబీ అయితే దానికీ ముళ్ళు తప్పవు. కాని, గులాబీయే కనబడకుండా ముళ్ళ పొద ఆవరిస్తే చేసేదేమిటి?

# విడ్డూరం

అసత్య ప్రచారం లేకపోతే— అభూత కల్పనలు లేకపోతే— అది పీకింగ్ రేడియో ఎలా అవుతుంది? ఒక సరికొత్త కట్టుకథను మొన్న పీకింగ్ రేడియో ప్రచారం చేసింది ఇండియా ప్రజలకు మావో తత్వం వంటపడుతున్నదట. అందువల్లనే, ఇండియాలో ఆందోళనలు, ఉద్యమాలు జరుగుతున్నవట!

పచ్చకామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగాకాక, మరొక విధంగా ఎలా కనిపిస్తుంది? ఒక రకమైన "మానసిక వ్యాధి" కింద జమకట్టదగిన- ఇటీవల వికృతరూపం ధరించి, వెర్రితలలు వేస్తున్న— మావోయిజం పట్ల ఇండియాలోనే కాదు, కమ్యూనిస్టు దేశాలలో సయితం ఎవ్వరికీ భ్రమలు లేవు మొన్నటి వరకు వ్యక్తి పూజను నిరసించి, ఇటీవల మావో పూజను ప్రారంభించిన పీకింగ్ రేడియో ఈ కట్టుకథను ప్రచారం చేస్తున్న సమయంలోనే మావో విధానాలు ఎంత ఆత్మ వినాశకరమో వివరిస్తూ మాస్కో రెడియో చేసిన నిశిత విమర్శయే ఇందుకు జవాబు

మావో విధానాలను చివరికి భారత కమ్యూనిస్టు పార్టీ కూడా హర్షించడం లేదనడానికి ఆ పార్టీ నుంచి మావో అనుకూల వర్గం విడిపోయి ప్రత్యేకమైన పార్టీని నిర్మించుకొనడమే నిదర్శనం కాగా, నేడు భారతదేశంలో జరుగుతున్న ఆందోళనలు, ఉద్యమాలు తమ ప్రభావం వల్లనేనని చైనా అనుకుంటూ వుంటే అది లోకవంచనేకాక ఆత్మవంచన కూడా.

ఆందోళనలు, ఉద్యమాలు ప్రజాస్వామిక దేశాలలోనే జరుగుతాయి అందులోను ఎన్నికల సంవత్సరంలో అవి ఉద్ధృతం కావడం కూడా సర్వసాధారణమే చైనా వంటి నియంతృత్వ దేశంలో అలాంటి వాటికి తావే లేదు అక్కడ ఆందోళన కారులను అణచి వేస్తారు అదేమంటే, ఆ వ్యక్తి అతీగతీ తెలియకుండా పోతాడు అదే నియంతృత్వ, ప్రజాస్వామ్య వ్యవస్థల మధ్య తేడా

# దొంగ సన్యాసులు

ఎవడైనా అదేపనిగా నీతులు వల్లిస్తుంటే వాడిని అనుమానించ బుద్ధి పుడుతుంది. ఏదో లొసుగు లేనిదే వీడికి నీతిపట్ల ఇంత యావ దేనికని సందేహం కలుగుతుంది

ఆస్ట్రేలియాలో ఒకడు పని గట్టుకుని నీతి బోధలు చేస్తూ తిరుగుతున్నాడట మతాచార్యుని వేషం వేసుకుని చర్చిలలో వాడిచ్చే ఉపన్యాసాలు వినడానికి జనం వేలం వెర్రిగా మూగుతున్నారట వాడు బోధించే నీతి ఒకటే "దొంగతనం మహాపాపం!"

అస్తమానం వాడు ఇదే పాట పాడుతుంటే ఎవరికైనా అనుమానం కలుగుతుంది తీరా ఆరా తీస్తే వాడు జైలునుంచి తప్పించుకు పోయిన గజదొంగ అని తేలింది వాడి కోసం పోలీసు లిప్పుడు గాలిస్తున్నారు

ఇటువంటి దొంగ సన్యాసులు మన సమాజంలోను కనిపిస్తారు "అద్వైతులు వస్తున్నారు చెంబు తప్పాళా జాగ్రత్త" అని సామెతే వుంది అద్వైతులకు జగమంతా బ్రహ్మమయం స్వ-పర భేదం లేదు అందుచేత ఇతరుల వస్తువులన్నీ వారివే ఆట్టే మాట్లాడితే "గజం మిథ్య. పలాయనం మిథ్య" అని తప్పుకోగలరు

వీరొక రకంకాగా శరీరం అశాశ్వతమని, దానిపై వ్యామోహం తగదని తత్వాలు పాడుతూనే, ఆ పాడు శరీరం కోసం బిచ్చమెత్తుతూ తిరిగే యాచకులు లెక్కలేనంత మంది ఈ విధంగా శ్రీరంగనీతులు చెప్పేవారు యాచక వేషంలో వున్నా, మరే ఘరానా వేషంలో వున్నా.. వారి నొక కంట కనిపెట్టి వుండవలసిందే

# మంత్రాలూ, మంత్రులూ

మంత్రాలకు చింతకాయలే రాలవు వానలు మటుకు కురుస్తాయా?
ఒకప్పుడు మంత్రాలకు చింతకాయలురాలుతాయనే జనం భావించే వారు చింతకాయలు తమంతట తాము రాలిపడినా అది తమ మంత్రాల ప్రభావమేనని అనుకునేవారు

అలాగే వానలు కూడా వరుణదేవుడికో, ఇంద్రుడికో పూజలు చేస్తే, ప్రార్థనలుచేస్తే యజ్ఞయాగాదులు నిర్వహిస్తే వానలు కురుస్తా యని విశ్వసించేవారు ప్రకృతి శక్తుల స్వభావం క్రమంగా తెలియడం ప్రారంభమైనప్పటినుంచి ఈ మూఢ విశ్వాసాలు తగ్గిపోవడంకూడా ప్రారంభమైంది వాటిని వశపరచుకొనడానికి ఇతర మార్గాలను—వైజ్ఞా నిక మార్గాలను—అన్వేషించడం మొదలైంది

అయినా, నేటికీ ఈ విశ్వాసాలు పూర్తిగా తొలగిపోలేదు ఇప్ప టికీ వానలకోసం అభిషేకాలు ప్రార్థనలు, యజ్ఞయాగాదులు అప్పు డప్పుడు, అక్కడక్కడ దేశంలో జరుగుతూనే వున్నాయి మంత్రాలకు ఆ మహిమె వుంటే గత సంవత్సరం మన దేశంలో ఘోరమైన అనా వృష్టి సంభవించేదే కాదు

మంత్రోచ్చారణేకాదు, అంత కంటె శక్తిమంతంగా కోట్లకొలది ప్రజలు వానల కోసం పరితపించారు బీటలువారిన పొలాలమధ్య వట్టి పోయిన చెరువుల గట్లపై, బావుల ప్రక్కన, మాడంత మబ్బయినా లేని ఆకాశంకేసి చూస్తూ ఎందరు రైతులు మౌనంగా ప్రార్థించారో ఎవరికి తెలుసు? అయినా, వానదేవుడికి దయరాలేదు,

అందుకే మొన్న బెంగుళూరులో కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామ రాజ్ ఎవరైనా మంత్రాలతో వానలు కురిపిస్తే మంత్రి పదవి ఇస్తామని సవాలు చేశారు ఈ సవాలును ఎవరు స్వీకరిస్తారు? ఎవరైనా స్వీకరిస్తే, వారికి మంత్రి పదవేం ఖర్మ! ప్రధానమంత్రి పదవినే కట్టబెట్టవచ్చు కావలసినప్పుడెల్లా, కావలసినంత వర్షం కురిపించగలగడంకంటె మన దేశానికిప్పుడు కావలసిన దేముంది?

# క్యాన్సర్ కొక కారణం

నిజమాడితే నిష్ఠూరమని సామెత  నిర్మొగమాటంగా అనుకున్న దాన్ని అనుకున్నట్టు కుండ బద్దలుకొట్టినట్టు మాట్లాడేవాడిని లోకం సహించ లేదు  అది సభ్యతకూడా కాదు  నాగరికత బలుస్తున్నకొద్దీ మనోభావాలను వికారాలను ముఖంపై కనబడకుండా కప్పి పెట్టడం ఒకకళగా తయారైంది ఎదటివాడిమీద లోలోపల మండిపోతున్నా పైకి శాంతంగా కనబడడం, ఈ నాటి మర్యాద

కాని, ఈ విధంగా ఉద్రేకాలను మనసులోనె అణచివేయడం ఆరోగ్యానికి భంగమట  దానివల్ల ఊపిరితిత్తుల క్యాన్సర్ వచ్చి చనిపోవ డానికి అవకాశం వుందట  ఉద్రేకాలను వెళ్ళగ్రక్కే వారికంటె వాటిని అణచివేసే వారికి క్యాన్సర్ రావడానికి నాలుగున్నర రెట్లు ఎక్కువ అవకాశం వుందట  ఈ విషయాన్ని గ్లాస్గో యూనివర్సిటీకి చెందిన ఒక స్కాటిష్ డాక్టర్ వెల్లడించాడు

క్యాన్సర్ వస్తుందనే విషయం కొత్తదే కావచ్చుగాని, ఉద్రేకాలను బలవంతాన ఎక్కువకాలం ఆపుకోవడం ఆరోగ్యానికి, కనీసం మానసి కారోగ్యానికి, మంచిది కాదనేది అందరూ ఎరిగిందే  కోపాన్ని ఆపుకునే వాడు, లోలోపల దుఃఖాన్ని దిగమ్రింగేవాడు, తనలో తనే కుళ్ళిపోయే వాడు ఎప్పుడూ నిరుత్సాహంగా, నీరసంగా, నిర్జీవంగా వుండడం పరిపాటి ఇది కొంతకాలం పోయేసరికి శరీరారోగ్యాన్ని చెడగొట్టవచ్చు

ఉద్రేకాలను - వచ్చిన వాటిని వచ్చినట్టు వెళ్ళగ్రక్కే వాడికి క్యాన్సర్ ప్రమాదం లేక పోవచ్చుగాని, ఇతరులతో ఘర్షణపడే ప్రమా దం ఎక్కువ  అది ఒక్కొక్కసారి క్యాన్సర్ కంటె హానికరం కూడా కావచ్చు  అందుకే ఉద్రేకాలను మొరటుగా కాక, నాగరిక పద్ధతులలో ప్రదర్శించడం మంచిదేమో  అసలు మానవునిలోని సుప్తోద్రేకాలను నాగరికంగా అభివ్యక్తం చేయడానికి బయలుదేరినవే కవిత్వం, చిత్ర లేఖనం మొదలైన లలితకళలని ఫ్రాయిడ్ సిద్ధాంతం

స్కాటిష్ డాక్టర్ పరిశోధనా ఫలితం ప్రకారం ధూమపానం చేసేవారికైనా, చేయని వారికైనా ఉద్రేకాలను త్రొక్కిపట్టి వుంచే వారందరికీ క్యాన్సర్ ప్రమాదం వుంటుందట  ఇది సిగరెట్లు కాల్చేవారికి కొంత ఉపశమనం కలిగించే విషయమే.

# రష్యాలో ఇందిరలు

రష్యాలో "ఇందిర"ల సంఖ్య ఎక్కువగా వున్నదట శ్రీమతి ఇందిరా గాంధి 1953లో మొదటిసారిగా రష్యా వెళ్ళినప్పటినుంచి నేటి వరకు ఆ పేరుపెట్టుకున్న బాలికలు యాభై అయిదుగు రున్నారట

ఇప్పుడు శ్రీమతి ఇందిర భారత ప్రధానిగా రష్యా పర్యటనకు వెడుతున్నారు ఈ పర్యటన తర్వాత రష్యాలో "ఇందిర"ల సంఖ్య ఇబ్బడి ముబ్బడిగా పెరగవచ్చు

"ఇందిర" చాలా శ్రావ్యమైన పేరు. పలకడానికి సులభమైనది ఆకారాంత శబ్దం కనుక రష్యన్ స్త్రీ పేర్లలో తేలికగా కలిసిపోతుంది అన్నిటినిమించి అది ప్రపంచ ప్రసిద్ధుడైన భారతీయ నాయకుని కుమార్తె పేరు. ఆయన కృషి ఫలితంగానే ఇండియా, రష్యాలమధ్య సన్నిహితమైన స్నేహ సంబంధం ఏర్పడింది అందుచేత "ఇందిర" పేరు పట్ల రష్యాకు మక్కువ కలగడంలో ఆశ్చర్యం ఏముంది?

రష్యన్ "ఇందిర"లతో తాను తరచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నట్టు శ్రీమతి ఇందిరా గాంధి పేర్కొన్నారు అయితే, ఒక్కటె చిక్కు, రష్యాలో తన పేరిటి పిల్లలు ఎక్కువైనకొద్ది ఆమెకు ఏ "ఇందిర" ఎవరైంది గుర్తుపెట్టుకోవడం పెద్ద సమస్య కావచ్చు ఏ "ఇందిర" తనకు లెఖ వ్రాసిందో, తాను ఏ "ఇందిర"కు ప్రత్యుత్తరం వ్రాయాలో పరిశీలించడానికి ప్రత్యేకం ఒక సెక్రటరీని వేయడం అవసరం కావచ్చు

ఏమైనా రష్యన్ "ఇందిర"లు ఇందిరాకు ఇండియాకు గర్వకారిణులే కాగలరు.

# ప్రేమ సందేశం

ప్రేమ మహిమను కవులు పలురకాలుగా గానం చేశారు. నిజమైన ప్రేమ అమరమని, అజేయమని, అప్రతిహతమని వర్ణించారు.

ఇదంతా కవుల ఉన్మత్త కల్పనగా కొట్టిపేయడానికి ఎవరైనా సాహసించే ముందు ఇటీవలి ఒక సంఘటనను చూడాలి. కెనడాలోని నోవా స్కోషియా విద్యార్థి ఒకడు న్యూయార్క్ రాష్ట్రంలోని ఒక యువతిని ప్రేమించి పెళ్ళాడగోరాడు. కాని, ఆ సంగతి ఆమెతో చెప్పడానికి బిడియ పడ్డాడు. ఆమెకు ప్రేమలేఖ వ్రాసి, సీసాలో భద్రపరచి, దాన్ని హడ్సన్ అఖాతంలో వదలి పెట్టాడు.

అతని ప్రేమ ఎంత శక్తిమంతమైనదో మరి! ఆ సీసా అలలపై తేలియాడుతూ పదకొండు నెలలలో నాలుగువేల మైళ్ళ అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటి, ఇంగ్లండు పశ్చిమ తీరాన్ని చేరుకుంది. అక్కడ ఒక పెద్దమనిషికి దొరకగా అతడు దాన్ని అమెరికాలోని ఆ యువతికి పోస్టు చేశాడు. ఆమె తన ప్రేమికునికి "యస్" అని టెలిగ్రామిచ్చి పెళ్ళికి తన సుముఖతను వెల్లడించింది.

అంత సుదీర్ఘ ప్రయాణంలో ఆ సీసాను ఏ తిమింగలమో మింగకుండా అతని ప్రేమే కాపాడి వుండాలి. ఎటొచ్చి ప్రేమ గుడ్డిది కనుక, ప్రక్కనే వున్న న్యూయార్క్ తీరానికి కాక, అట్లాంటిక్ సముద్రానికి అద్దరినున్న దేశానికి దాన్ని చేర్చింది.

"ధూమ జ్యోతిస్సలిల మరుత్తుల" కలయికతో ఏర్పడిన మేఘం ద్వారా యక్షుడు తన ప్రియురాలికి సందేశం పంపించాడు. ఇతర ప్రియులు హంసలను, చిలుకలను వార్తా వహులుగా వినియోగించినట్లు మన కావ్యాలు పేర్కొంటున్నాయి. వారికి తీసిపోనివాడే నోవా స్కోషియా విద్యార్థి. అయితే, అవి కవి కల్పనలు. ఇది వాస్తవిక గాథ. కల్పన కంటె యథార్థం విచిత్రంగా వుంటుందని ఇంగ్లీషు లోకోక్తి వూరికెనే వచ్చిందా?

# నవాబు, గరీబు

నిన్నటి నవాబు నేడు గరీబు కావచ్చు అలాగే నిన్నటి గరీబు నేడు నవాబు కావచ్చు ఓడలు బండ్లు, బండ్లు ఓడలు కావడానికి వీలున్న ఈ ప్రపంచంలో ఇది అసంభవం కాదుగాని, అసహజం మాత్రం అవును. అసాధారణం మాత్రం అవును ఏ లాటరీయో, మరొకటో తగిలినట్టు సాక్ష్యం లేకుండా, నిన్న మొన్నటి వరకు కుచేలుడుగా వున్నవాడు ఒక్కసారిగా కుబేరుడైనాడంటే, దాని వెనుక ఏదో కుంభకోణం జరిగినట్టు అనుమానించవలసిందే

బొంబాయిలో మొన్నజరిగిన ఒక ఉదంతమే ఇందుకు దృష్టాంతం ఎనిమిదేళ్ళ క్రిందట బూట్ పాలిష్ చేసి బ్రతుకుతూ వుండిన ఒకడు వున్నట్టుండి ధనవంతుడై పోయాడు వాడి నివాసం, నిద్ర పేవ్ మెంట్ల మీదినుంచి కొలాబాలోని పెద్ద భవంతి లోనికి హంసతూలికా తల్పాల మీదికి మారింది అదివరలో వాడికి చిరుగుల కోటు ఒకటైనా వుండేదో లేదోగాని, వాడుకొద్ది కాలంలోనే రెండు కోట్లు-రూపాయలే సుమండీ-సంపాదించాడు

తీరా, అధికారులు దర్యాప్తు చేస్తే వాడి బండారం బయటపడింది బూట్ పాలిష్ వృత్తిని వదలి వాడు బంగారం దొంగరవాణా వ్యాపారంలో చేరాడు ఇక సంపాదన కేమి కొరత.

పైసా పెట్టుబడి లేకుండానే వాడు రెండుకోట్లు సంపాదించాడంటే ఆ వ్యాపారంలో మరెందరు మరెంత సంపాదించి వుంటారో, వారికి పోటీగా వాడు దొంగ అయినాడుకాని, దొరకకుండా దొరలుగా మరెందరు చెలామణీ అవుతున్నారో. బహుశా ఇట్టిదొరలను చూసిన తర్వాతనే ఫ్రెంచి అనార్కిస్టు తత్త్వవేత్త ప్రౌధన్ "ఆస్తి సంపాదించడానికి, చౌర్యానికి భేదంలేదు" (అల్ ప్రోపర్టీ ఈజ్ థెఫ్ట్) అనే సిద్ధాంతానికి వచ్చివుంటాడు

# అబద్ధాలు

కొందరిని ఎల్లకాలం మోసగించవచ్చు అందరిని కొంతకాలం మోస గించవచ్చు, కాని, అందరిని ఎల్లకాలం మోసగించడం సాధ్యమా?

ఈ సుభాషితానికి నిదర్శనం మొన్న కలకత్తాలో జరిగింది. ఒక మోసగాడు ముఖ్య మంత్రి శ్రీ పి సి సేన్ వద్దకు వెళ్ళి, తన సోదరి అంత్యక్రియలకు డబ్బు కావాలని అడగ్గా, ఆయన ఇరవై రూపాయ లిచ్చారు మూడు నెలల తర్వాత అదే కథ చెప్పి యాభై రూపాయలు గుంజుకున్నాడు మళ్ళీ రెండు వారాల తర్వాత అదే పురాణం విప్ప బోతుండగా, నౌకర్లు వాడిని గుర్తుపట్టి, పోలీసులకు అప్పగించారు

మోసానికి లోనైన వ్యక్తి సాధారణంగా అమాయకుడే అయి వుంటాడు మోసం చేయబోయినవాడు కూడా అమాయకుడు కావడం ఈ వార్తలోని విశేషం వాడు శ్రీ సెన్ వద్దకు వెళ్ళినప్పుడల్లా కథ మార్చి వుండవలసింది లేదా, అదే కథతో వేర్వేరు వ్యక్తుల వద్దకు వెళ్ళి వుండ వలసింది అయిదేళ్ళ కొకసారి వోటర్ల వద్దకు వెళ్ళి "అది చేస్తాము-ఇది చేస్తాము" అని మార్చి మార్చి వాగ్దానాలుచేసే రాజకీయ పక్షాల నాయకు లను చూసి అయినా, అతడు ఈ విద్య నేర్చుకుని వుండవలసింది.

అబద్ధం ఆడినా అతికేట్టు వుండాలన్నారు చతుష్షష్టి కళలలో అది వున్నదో లేదోగాని, అబద్ధం ఆడడం కూడా ఒక కళే "ఆడది అబద్ధం ఆడితే గోడకట్టినట్టు, మగవాడు అబద్ధం ఆడితే తడిక పెట్టినట్టు" అని సామెత మగవాడు కనుకనే ఆ మోసగాడు సరిగా అబద్ధాలైనా ఆడలేక పోయాడు!

# స్త్రీల వస్త్రధారణ

ఇండియా ప్రధాని మహిళ కనుక మహిళా సమస్యలపై ఆమె ఆసక్తి ప్రదర్శించడం సహజమే స్త్రీల వస్త్రధారణ పద్ధతులపై ఆమె మొన్న నొక సూచన చేశారు

వదులొదులుగా వుండే సల్వార్ల" కంటె చుడీదార్ పైజమాలను ధరిస్తేనే స్త్రీలు అందంగా కనబడతారని శ్రీమతి ఇందిరా గాంధి సలహా ఇది ఒక మహిళ నుంచి వచ్చిన సాధికారమైన సలహా కనుక దాన్ని తీసివేయడానికీ వీలు లేదు

అయితే, ఈ సలహా ఉత్తరాది రాష్ట్రాల వనితలకె వర్తిస్తుంది దక్షిణాది రాష్ట్రాలలోనే కాక, మరి పెక్కు ప్రాంతాలలో చాలా స్త్రీలు ప్రధాని సలహాను పాటించ నవసరం లేదు

ప్రధాని పేర్కొన్న సల్వారు, పైజమాలు ఎంత పాత సంప్రదాయమో తెలియదు కాని చీర ధరించడమె అచ్చమైన భారతీయ సంప్రదాయం, ప్రపంచంలో మరె దేశంలోను లెని విశిష్ట సంప్రదాయం పాశ్చాత్యులను సయితం విశేషంగా ఆకర్షిస్తున్న సంప్రదాయం ఇటీవల జరిగిన సిల్కు వస్త్రాల అంతర్జాతీయపు పోటీలలో మన దేశపు చీరకే ప్రథమ బహుమతి రావడం ఇందుకొక సాక్ష్యం

చీరను మొట్టమొదటగా కనిపెట్టిన వాడెవడోగాని గొప్ప మేధాశాలి అయివుండాలి అవయవ సౌష్ఠవం కలవారికి అది అద్భుతంగా నప్పుతుంది, లేనివారికి ఆ లోపాన్ని కప్పిపుచ్చడానికి అంత కంటె తోడ్పడే వస్త్ర విశేషం మరొకటి లేదు

కొందరు స్త్రీలు భర్తలను కొంగుకు కట్టుకు తిరుగుతారు చీరల వాడకమే లేకపోతే ఇది సాధ్యమా?

ఏమైనా, ప్రధానితో ఇంటర్వ్యూ జరిపిన ఒక పత్రిక సూచించినట్టు ఇండియాలో అందాలకు, అలంకారాలకు ఒక మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేయాలి కనీసం ఒక దర్యాప్తు సంఘాన్నయినా నియమించడం మంచిదేమో గడ్డు సమస్యలనేకం ఇప్పటిలో ఎలాగూ పరిష్కారమయ్యేటట్టు లేవు కనీసం స్త్రీల కట్టుబొట్టు సమస్య తీరినా తీరినట్టే

# నవ్వుపై నాలుగు మాటలు

"నవ్వని వాడిని నమ్మరాదు" అని సామెత. నవ్వు సృష్టిలోకెల్లా మానవుని కొక్కడికే ప్రకృతి ప్రసాదించిన వరం. ఎన్నడూ నవ్వి ఎరగని వాడిని కడుపులో ఏదో కుట్ర పెట్టుకున్నవాడుగా పరిగణించడం పరిపాటి

ఆరోగ్యానికికూడా నవ్వు మంచిదంటారు నవ్వడంవల్ల బిగుసుకుపోయిన నరాలన్నీ సడలి రక్త ప్రసారం బాగా జరుగుతుంది హాయిగా నవ్వేవాడు సాధారణంగా ఆరోగ్యవంతుడై వుంటాడు ఆరోగ్యం బాగా లేనివాడు నవ్వలేడు

అయితే, "నవ్వు నాలుగిందాల చేటు" అనే లోకోక్తికూడా లేకపోలేదు. కాని, ఇది సుమతీ శతకకారుడు చెప్పిన కారణంలేని నవ్వుకు. కారణం చెప్పకుండా నవ్వే నవ్వుకు, వెకిలి నవ్వుకు మాత్రమే వర్తిస్తుంది లక్ష్మణదేవర నవ్వు వినాయకుని చూసి చంద్రుడు నవ్విన నవ్వు ఇలాంటివే

ఇక అతిగా నవ్వడం కూడా ప్రమాదకరమే అతిగా నవ్వితే పొట్ట నిజంగా చెక్కలు కాకపోయినా పక్కలు నొప్పి పుడతాయి

బోర్న్‌మత్ అనేచోట మొన్న నొక కుర్రవాడు ఇలాగే అతిగా నవ్వి నవ్వి గోడమిదనుంచి పడిపోయి, అతనిమీద గోడ పడిపోయి, గాయపడిపోయి, చివరికి ఆస్పత్రిలో చేరాడట అతని అతినవ్వుకు కారణం మరొక కుర్రవాడు చెప్పిన ఛలోక్తి.

కొన్ని కొన్ని ఛలోక్తులు విపరీతంగా నవ్వుపుట్టిస్తాయి మరికొన్ని మందహాసం మాత్రం తెప్పిస్తాయి ఇంకా కొన్ని మానసికాహ్లాదం మటుకు కలిగించి వూరుకుంటాయి కాని, ఈ ఏర్గీకరణ అందరికి, అన్ని వేళల వర్తించదు కొందరికి—ముఖ్యంగా మనసు బాగా లేనప్పుడు, ఎంత మంచి జోక్ చెప్పినా నవ్వురాదు కొందరు అల్ప సంతోషులు మాటకు ముందు నవ్వేస్తారు డబ్బుగలవాడి ఛలోక్తి ఎంత చెత్తదైనా నవ్వు పుట్టిస్తుందని ఇంగ్లీషులో ఒక నానుడి వుంది ఇందులో ఏ రకం జోక్ విని బోర్న్‌మత్ కుర్రవాడు అంతగా నవ్వాడో మరి?

ఏమైనా అతన్ని చూసి నేర్చుకోదగిన నీతి ఒకటే అతిగా నవ్వకండి నవ్వినా ఎత్తైన గోడమీద కూర్చుని నవ్వకండి

# రోదసినుంచి దృశ్యం

"దూరపు కొండలు నునుపు" అని సామెత వుండనే వున్నది అందు చేత అమెరికన్ రోదసీ యాత్రికుడు యూజీన్ సెర్నాన్‌కు 180 మైళ్ళ ఎత్తు నుంచి భూమి దృశ్యం మహాద్భుతంగా, పరమ రమణీయంగా కనిపించడంలో ఆశ్చర్యం ఏముంది?

రెండు లక్షల నలభై వేల మైళ్ళ దూరం నుంచి చంద్రగోళం మనకు అందాల చందమామగా కనిపిస్తుంది. గగన సరోవరంలో విరిసిన ఏకైక శతపత్రంవలె అది భాసిస్తుంది దానిలోని మచ్చ మన పిల్లలకు చెట్టు నీడలో కూర్చుని అట్లు పోసుకునే అవ్వవలె కనిపిస్తుంది మన కవులకు చంద్రుడు "అమృతము మాడు కట్టిన దోర" వలె కనిపిస్తాడు. ప్రియులకు జాబిల్లి చెదిరిన ముంగురులతోడి ప్రియురాలి వదనంవలె గోచరిస్తాడు

దగ్గరకు వెళ్ళిచూస్తే ఈ భావనా కల్పితసౌందర్యం మటుమాయం కాక తప్పదు. చంద్రోపరితలం ఉల్కా ధూళి ధూసరితమై కనిపిస్తుంది, అక్కడి బిలాలు స్ఫోటకం పోసిన ముఖంపై గుంటలవలె, కొండలు మొటిమలవలె కనబడక మానవు ఇక్కడ రాత్రివేళ మనకు హాయిగొలిపే చంద్రాతపం అక్కడ పగటి వేళ దుర్భరోష్ణంగా, నిశీథులలో దుస్సహ శైత్యంగా మారిపోతుంది

ఏదైనా, ఎవరైనా ఇంతే దూరంగావున్నంతసేపే ఆకర్షణ ప్రతి దినం దేనికో దానికి సాధిస్తూ, ఇంటిలో అదిలే దిది లేదని వేధిస్తూ, చిరాకుపడుతూ, చికాకుపరచే భార్య నెల రోజుల వియోగంతో ప్రేయసిగా మారి మనో వీధిలో నృత్యం చేయడం మొదలు పెట్టదా?

యూజీన్ సెర్నాన్ విజయవాడ మీదుగా వెళ్ళ లేదుగాని, వెళ్ళి వుంటే, పురపాలక సంఘంవారి క్షమార్హంగాని అశ్రద్ధకు తోడు మొన్నటి వానలకు మొత్తం మురికి పేటగా తయారైన ఈ పట్టణం సయితం 180 మైళ్ళ ఎత్తు నుంచి దర్శనీయంగానే కనబడి వుండేది!

# సంగీత పర్వతం

గోటితో మీటితే సప్తస్వరాలు పలికే స్తంభా లున్నాయి సంగీత వృక్షాలు కూడా వుంటాయని విన్నాము కాని, సంగీత పర్వతా లుంటాయా?

ఉన్నవనే మాస్కోనుంచి రాయిటర్ వార్త కజక్ రిపబ్లిక్ రాజధాని అల్మా అటాకు 85 మైళ్ళు తూర్పుగా ఒక పర్వతం వున్నదట దాని మీదుగా పెనుగాలి వీచినా, దాని సానువులపై మనుష్యులు, జంతువులు నడచినా అది ధ్వనిస్తుందట ఆ ధ్వనులు ఉరుముల ఢమ ఢమలవలె వుంటాయట దాని నుంచి ఇసుకతీసి ఒక సంచిలోపోసి కదిపితే ఘూకం కేకలవలె ధ్వనిస్తుందట

అవి సంగీత శబ్దాలేనా? లేక రోదన ధ్వనులా? తన మానవ సంతానం ఇటీవల సాధిస్తున్న అద్భుత వైజ్ఞానిక పురోగతిచూసి భూమాత ఆలపిస్తున్న సంతోష స్వరాలా అవి? లేక మానవుల నైతిక పతనానికి హృదయం క్షుభితమై ఆక్రోశిస్తున్నదా? ప్రస్తుతం ఆ పర్వత వైచిత్రిని పరిశోధిస్తున్న రష్యన్ శాస్త్రజ్ఞులు ఈ ప్రశ్నకు సమాధానం కనుగొనగలరా?

# పెళ్ళికొడుకు పలాయనం

వరామగారు తనకు వాగ్దానం చేసిన స్కూటరో, రేడియోగ్రామో ఇవ్వలేదని అలిగే అల్లుళ్ళుంటారు ఇస్తామన్న కట్నం ఇవ్వలేక పోయినందుకు పెళ్ళిపీటల మీద నుంచే లేచిపోయే పెళ్ళికొడుకు లుంటారు పెళ్ళి ఏర్పాట్లు మహావైభవంగా చేయనందుకు చిన్నబుచ్చుకునే ప్రబుద్ధు లుంటారు అల్లుడు పదో గ్రహమని మనకు సామెతే వుంది

కాని, పెళ్లి ఏర్పాట్లు ఘనంగా చేయడమే తప్పుగా భావించే పెళ్ళి కొడుకు లుంటారా?

మియామీ (అమెరికా) నగరంలో మొన్ననొక వరుడు ఇలాగే చేశాడట 25వేల డాలర్ల ఖర్చుతో అట్టహాసంగా జరిగిన ఏర్పాట్లు చూసి అతని కళ్ళు చెదిరిపోయాయి, మనసు బెదిరిపోయింది నాకీ పెళ్ళివద్దు, పెటాకులూ వద్దు అని అతను పారిపోయాడట

పెళ్ళి కొడుకు లందరూ అతని ఆదర్శాన్ని అనుసరిస్తే ఎంత బావుంటుంది జామాత దశమ గ్రహమనే నానుడి వాడుక నుంచిపోతుంది "పెళ్ళి చేసి చూడు, ఇల్లు కట్టిచూడు" అనే సామెతలో కనీసం మొదటిది రద్దయి పోతుంది ఆడపిల్లను కనడమే అపరాధంగా భావించే మనస్తత్వం మటుమాయమై పోతుంది.

# మిత భాషణ

కాంగ్రెసు వాదులలో ఎన్ని సుగుణాలైనా వుండవచ్చుగాని మిత భాషిత్వం వాటిలో ఒకటి కాదు దాదాపు కాంగ్రెసు నాయకు లందరు ఉపన్యాసకేసరులే ఎంత దీర్ఘంగా, ఎంత ఆవేశంతో ఉపన్య సిస్తే అంత మహానాయకుడు

కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ పద్ధతి ఇందుకు భిన్నమై నది ముక్తసరిగా మాట్లాడ్డం ఆయన అలవాటు, అది ఆయన ప్రత్యేకత కూడా మొన్న బొంబాయిలో ప్రెస్ గిల్డ్ సమావేశంలో ఆయన ప్రసంగ మంతా కలిపి పదమూడు ఇంగ్లీషుముక్కలు, వాటిలో అయిదుముక్కలు తాను చెప్పవలసిం దెమీలేదని

అతిగా మాట్లాడ్డంవల్ల ఎన్ని ఇబ్బంది లున్నాయో మితంగా మాట్లాడ్డంవల్ల అన్ని లాభా లున్నాయి చాలా తక్కువ మాట్లాడే వారు విజ్ఞానఖనులుగా, బలమైన వ్యక్తిత్వం కలవారుగా సులువుగా చెలామణీ కావచ్చు ఇట్టివారినే ఇంగ్లీషులో "స్ట్రాంగ్ ఎండ్ సైలెంట్ మెన్" అంటారు

ముఖ్యంగా ఇది రాజకీయ నాయకులు అలవరచుకోవలసిన సుగుణం తమ సుదీర్ఘ ప్రసంగం తీరా పత్రికలలో పడినతరువాత "నేనలా అనలేదు నేనన్నది అది కాదు"అని తిరిగి ప్రకటన చేయవలసిన బెడద వుండదు

వెనుకటికి గ్లాడ్‌స్టన్ తన ప్రసంగంలో నుంచి తనకే వ్యతి రేకంగా ఏదైనా వాక్యాన్ని ఎవరైనా ఉదహరిస్తే,ఆయనకు ఆ ఉపన్యాస మేదో జ్ఞాపకం లేకపోయినా "రీ డాన్" (ఇంకాచదువు) అనేవాడట ఇంకా చదువుతూపోతే పైన చెప్పినదానికి భిన్నంగా మరొక వాక్యం వుండేదట "అదీ నా ఉద్దేశం," అని ఆయన తెలివిగా తప్పుకునేవాడట ఆ విధంగా ఆచితూచి, తప్పుకొనడానికి దోవ ఉంచుకుంటూ మాట్లాడ్డం గ్లాడ్‌స్టన్ ఎంటి అనుభవశాలురకే చేతనౌతుంది

ఈ బెడద లేమి లెకుండా అసలు మాటలే తగ్గిస్తే పోదా? చెప్ప వలసిన ముక్కలు నాలుగూ కుండ బద్దలు కొట్టినట్టు చెప్పి కూర్చుంటే మంచిది కాదా?

# నాటకాలు, రాజకీయాలు

ఛలోక్తిగానే అన్నా. శ్రీ సంజీవయ్య నిజమే పలికారు రాజకీయాలు కూడా ఒక రకం నాటకాలే, రాజకీయవేత్తలుకూడా నటులే

నవరసాలు అవలీలగా అభినయించగల వాడె రాజకీయవేత్తగా రాణిస్తాడు తనను తాను మరిచిపోయి పాత్రలో లీనమై పోవాలి దేశ సేవ కోసమే తాను జన్మించినట్టు నటించాలి

నటన నాలుగు రకాలన్నారు మన పూర్వులు తన సౌఖ్యమే ప్రజల సౌఖ్యమైనా, ప్రజల సౌఖ్యమే తన సౌఖ్యమని ఎలుగెత్తి చాటాలి, ఇది వాచికం దేశం దురవస్థను చూసి ఆవేదన వెల్లడించాలి, ఇది సాత్వికం ప్రజల కష్టాలుచూసి వేదికపై దీనంగా విలపించాలి, ఇది ఆంగికం వేషం చటుక్కున మార్చగలగాలి, ఇది ఆహార్యం ఇవన్నీ చక్కగా నటించగలవాడే ప్రజల హృదయాలను దోచుకుంటాడు

రాజకీయ నాటకాలలో చాలా రకాలున్నాయి కొన్ని సుఖాంతాలు ఇవి రాష్ట్ర మంత్రి పదవితోనో, కేంద్రమంత్రి పదవితోనో అంతమవుతాయి కొన్ని విషాదాంతాలు ; ఏ పనికిమాలిన కమిటీకో అధ్యక్ష పదవితో ఇవి అంత మవుతాయి కొన్ని ఫార్సు (ప్రహసనాలు) లుంటాయి ఇవి ఎందులో వేలుపెట్టినా అంతా రసాభాసగా తయారవడంవల్ల ప్రేక్షకులకు నవ్వు పుట్టిస్తాయి కొన్ని సెటైర్లు ఇందులో పాత్రధారి ఎదటి గ్రూపు నాయకునిపై వ్యంగ్యబాణాలు గుప్పించాలి ఇంగ్లీషులో 'డ్రామా ఆఫ్ ఐడియాస్" అనే ఒక తెగ నాటకా లున్నాయి, ఇందులో నటించే వాడు దేశాన్ని ఉద్ధరించడానికి ఎడాపెడా అయూచితంగా అద్భుతమైన భావాలు వెదజల్లుకుంటూ పోవాలి

సంస్కృత రూపకాలలో 'సమవాకారం" అని ఒకటుంది దానిలో దేవతలకు, దానవులకు సంబంధించిన ఇతివృత్తాలే వుంటాయి మన రాజకీయాలకు ఈ రూపక భేదం బాగా వర్తిస్తుంది రాజకీయవేత్త ఏ ముఠాకు చెందినవాడైతే అది దేవతావర్గం, ప్రత్యర్థుంది దానవవర్గం ఎన్నికలు సమీపిస్తున్న కొద్దీ ఈ సమవాకారం బాగా రక్తికడుతుంది

రాజకీయాలు నాటకాలు కావని ఎవరంటారు? అవే నిసలైన నాటకాలు

# క్రికెట్ తారలు, సినీతారలు

సినీ తారలు అప్పుడప్పుడు క్రికెట్ ఆడే ఆనవాయితీ వుంది కాని క్రికెట్ తారలు సినిమాలలో నటించడం ఇంతవరకు లేదు

పేరుపొందిన టెస్ట్ ఆటగాడు సలీం దురానీ ఇకపై సినిమాలలో నటిస్తాడట కమాల్ అమ్రోహి అనే బొంబాయి నిర్మాత దురానీని రెండు చిత్రాలకు రెండేళ్ళపాటు కాంట్రాక్టుపై బుక్ చేశాడట

ఇంగ్లీషులో "టు ప్లే క్రికెట్" అనే జాతీయం వుంది అంటే నిజాయితీతో, న్యాయంగా వ్యవహరించడం అని అర్థం సినీ తారలు క్రికెట్ ఆడుతున్నప్పుడు కూడా ప్రేక్షకులు వారినుంచి వినోదమే ఆశిస్తారు కాని క్రికెట్‌నుకాదు అందుచేత వారెంత చప్పగా ఆడితే, క్రికెట్‌కు ఎంత అన్యాయం చేస్తే ప్రేక్షకులకు అంతగా వినోదం లభిస్తుంది

రాజకీయవేత్తలు, మంత్రులు కూడా అప్పుడప్పుడు క్రికెట్ ఆడుతూ వుంటారు అయితే వీరుకూడా సినీ తారలవలె "నటించడం"లో ఆరితేరినవారు కనుక క్రికెట్ ఆడుతున్నట్టు నటిస్తారు రాజకీయరంగంలో వలెనే క్రికెట్ రంగంలో కూడా (ఇంగ్లీషు జాతీయపు అర్థంలో) "క్రికెట్" ఆడరు

కాని, క్రికెట్ తార సినిమాలలో నటించవలసివస్తే అలాకాదు అతడు సినిమా నటనను క్షుణ్ణంగా నేర్చుకుని మరీ నటించాలి లేకపోతే అతడు సినిమాలనుంచి సులభంగా "బౌల్ ఔట్" అయిపోతాడు

సలీం దురానీ మంచి ఆటగాడు కనుక అతనికి "ఫ్యాన్స్" కొరత లేదు అందుచేత "ఫ్యాన్స్"ను సంపాదించుకోవడం కోసం కాక నిజంగానే సినిమాలపై ఆసక్తి వుండి అతడు ఆ రంగంలో ప్రవేశిస్తున్నాడనుకోవాలి అతడు మంచి స్ఫురద్రూపి కనుక, నటనకూడా బాగా నేర్చుకుంటే, క్రికెట్‌కు న్యాయం చేసినట్టే సినిమాలకుకూడా న్యాయం చేస్తాడని, ప్రేక్షకుల హృదయాలలోనికి సూటిగా "సిక్సర్స్" కొడుతూ బాగా స్కోర్ చేస్తాడని ఆశిద్దాము

# దేవతా వస్త్రాలు

పాశ్చాత్య దేశాలలో ప్రతి పదేళ్ళకొకొక మహానగరం ఫ్యాషన్ కేంద్రం అవుతున్నదట కొంతకాలం పారిస్ మరికొంత కాలం రోమ్, ఒకసారి వియన్నా, మరొకసారి బెర్లిన్, వేరొకసారి న్యూయార్క్ మొత్తంపై పారిస్ చాలాకాలం ప్రపంచానికే ఫ్యాషన్ కేంద్రంగా చెల్లింది అయితే డిగోల్ పరిపాలనా ప్రభావంవల్ల కావచ్చు, ఇప్పుడు పారిస్‌బదులు లండన్ మహానగరం ఫ్యాషన్ల కేంద్రంగా మారిందట

ప్రస్తుతం పెక్కు పాశ్చాత్య దేశాలలో యువతీ యువకులు చీకిరిబాకిరిగా జుట్టు పెంచి వేయడం లండన్‌నుంచి బయలుదేరిన "బీటిల్స్" అనే గాయక బృందాన్ని చూసి నేర్చుకున్న ఫ్యాషనే ఇంకా ఆడవారి "టాప్‌లెస్" దుస్తులు, మోకాళ్ళపై వరకు కనిపించే దుస్తులు లండన్ ఫ్యాషన్లే

మొన్న లండన్‌లో మరొక కొత్త ఫ్యాషన్ క్షణాలలో వ్యాపించిందట అది పసుపు, నీలం, ఎరుపు రంగుల సెల్లొఫేన్ కాగితంతో తయారుచేసిన దుస్తులు ధరించడం నైలాన్, టెర్లిన్ దుస్తులు కొంత కాకపోతే కొంతైనా శరీరాన్ని మరుగుపరుస్తాయి ఉల్లిపొరలవంటి ఈ సెల్లొఫేన్ దుస్తులు దాదాపు దేవతావస్త్రాలనే చెప్పవచ్చు

ఫ్యాషన్లు చిత్ర విచిత్రంగా మారిపోతూ వుంటాయి నిన్నటి ఫ్యాషన్ నేడు మోటు, అదే రేపటికి కొత్తరూపంలో మళ్ళీ ఫ్యాషన్ కాలచక్రం ఇలాగే ఒక పెద్ద చుట్టుతిరిగివచ్చే సరికి, ఆదిమానవులైన ఆదం, ఈవ్‌లు ధరించిన అశ్వత్థ పత్రాలే మళ్ళీ ఫ్యాషన్ కావచ్చు ఇంకా కొంతకాలం పోతే ఆ పురాణ దంపతులు "నిషిద్ధ ఫలాన్ని" భుజించకముందు "ధరించిన" దిగంబరిత్వమే ఫ్యాషన్ కావచ్చు

# ఐన్‌స్టయిన్ మెదడు

క్రీర్తి శేషుడైన ఐన్‌స్టయిన్ మెదడులో విశేష మేమీ లేదట అది సామాన్యు లందరి మెదడుల వలెనే వున్నదట దాన్ని కడచిన పద కొండేళ్ళుగా పరిశోధించిన శాస్త్రవేత్తలు ఈ నిర్ధారణకు వచ్చారు

ఆయన ఈ శతాబ్దపు మేధావులలో అగ్రగణ్యుడు, విశ్వ రహస్యాన్ని ఒక చిన్న గణిత సూత్రంలొ వ్యక్తం చేయడానికి యత్నించిన మహామనీషి గణిత, భౌతిక శాస్త్రాలలో ఒక గొప్ప విప్ల వానికి కారకుడైన ప్రతిభాశాలి మరి ఆయన మెదడులో విశేష మేమీ లేదన్న మాటను నమ్మ వచ్చునా?

ఐన్‌స్టయిన్ వంటి శాస్త్రజ్ఞుని మెదడునే కాదు, షేక్‌స్పియర్ వంటి మహాకవి మెదడును వెదకినా, డా విన్సీ వంటి చిత్రకారుని మేదస్సును శోధించినా, బేతోవెన్ వంటి సంగీతకారుని మస్తిష్కాన్ని మథించినా భౌతిక చక్షువులకు విశేష మేమీ కనబడక పోవచ్చు ఈ అన్వేషణలో శాస్త్రీయ పరికరాలు విఫలమై పోవచ్చు అంత మాత్రాననే వారివి సాధా రణ మానవుల మెదడులకు భిన్నం కావని తీర్మానించుకొనడ మెలా?

గులాబీలో మిగతా పూలలో లేని విశిష్టత ఏదో లేకపోలేదు కాని, రేకు రేకునా విడదీసి,దుర్భిణీ యంత్రం క్రిందపెట్టి, ఎంత పరిశోధించినా ఆ విశిష్టత ఏదో కనుగొనడం సాధ్యమా? అది సాధ్య మైననాడు నిర్జీవం, నిర్గంధం అయిన ప్లాస్టిక్ గులాబీలనుకాక నిజమైన పూలనే కృత్రిమ పద్ధతులలో తయారు చేయలేమా ?

సామాన్య మానవుని మెదడుకు 2+2=4 కావచ్చు కాని అతీత ప్రతిభను ప్రదర్శించే గాయకుల, కవుల, చిత్రకారుల శాస్త్రజ్ఞుల మేధః కుహరాలలో 2+2 ఒక అద్భుత గీతం కావచ్చు, ఒక "శాకుంతలం" కావచ్చు , ఒక "మోనా లిజా" కావచ్చు , ఆ రహస్యం కనుగొనడం ఎవరి తరం ?

# మద్రాసులో ఇడ్లీలు

బియ్యం కొరత కారణంగా మైసూరు హోటళ్ళలో ఇడ్లీలను నిషేధించిన తరువాత, మొన్న మరొకసారి అవి వార్తలలోని కెక్కాయి మద్రాసు శాసనసభలో ఒక డి ఎం కె సభ్యుడు రెండు ఇడ్లీలను ప్రదర్శించాడు హోటళ్ళలో ఇడ్లీల ధర పెరిగి, సైజు ఏ విధంగా తరిగిపోతున్నదో ప్రభుత్వం దృష్టికి తేవడం ఆయన ఉద్దేశం

ఒకప్పుడు రెండిడ్లీ సాంబారు, అరకప్పు కాఫీతో కడుపు నింపుకొనడం సాధ్యమయ్యేది ఆ రోజులలో ఇడ్లీలు ఆకారంలోనే కాక మందంలోకూడా పెద్దవిగా వుండేవి లావుపాటి మనిషిని ఇడ్డెన్‌లా వున్నాడని పోలికతేవడం అ రోజులలోనే వచ్చింది ఇప్పుడీ ఉపమానం వాడుకనుంచి పోవడానికి కారణం లావుపాటివారి సంఖ్య తగ్గిపోవడం కాదు, ఇడ్లీలు క్రమంగా చిక్కిపోవడమే

పూర్వపు ప్రబంధ కవులు స్త్రీ కటిని వర్ణించడానికి ఒకరితో ఒకరు పోటీపడేవారు స్త్రీకి పర్యాయపదాలుగా కృశోదరి, తనుమధ్య, సింహేంద్రమధ్య మొదలైన ప్రయోగాలెన్నో వాడుకలోకి తెచ్చారు ఆధునిక కవులలో పెక్కుమందికి పద లాలిత్యంతో అంతగా పనిలేదు కనుక, ఇప్పుడీ పట్టికకు "ఇడ్లీ కటి"వంటి మిశ్ర సమాసాన్ని చేర్చినా చేర్చవచ్చు ముఖ్యంగా మద్రాసు హోటళ్ళలో వడ్డించే ఇడ్లీలు ఏ చట్నీనో బరువు పెడితేతప్ప ఫ్యాను గాలికే ఎగిరిపోయేంతగా, కళ్ళు రెండు చిట్లించి చూస్తేగాని కనిపించనంతగా, శ్రీనాధుడు "నైషధం"లో అన్నట్టు అస్తి నాస్తి విచికిత్సా హేతువులుగా కృశించిపోవడం భోజనైకవేద్యం

ఇడ్లీ తెలుగువారి వంటకమా, తమిళులదా అనే విషయమై చరిత్ర పరిశోధకులలో భిన్నాభిప్రాయా లున్నాయి ఇడ్డెన అనే దేశ్య విశేషమే ఇడ్లీ అయిందని కొందరి మతం అయినా, అది తమిళజాతి చేతిలోనే రుచికరమైన వంటకంగా రూపొంది, కీర్తి పొందింది అటువంటిది తమిళ రాజధాని మద్రాసులోనే అది వికార రూపం పొంది, పార్లమెంటరీ సంప్రదాయాలకు విరుద్ధంగా శాసన సభలో ప్రదర్శించబడవలసిన స్థితికి దిగజారడం విచారకరం

# ఒకపూట భోజనం

**సాధారణ పౌరులకంటె మంత్రులకు బాధ్యత ఎక్కువ ప్రజలకంటె వారు రెండడుగులు ముందుండి ఆదర్శప్రాయులు కావాలి**

ఆడంబర జీవితంలో మంత్రులెప్పుడూ ప్రజలకంటె ముందుంటున్నారని కిట్టనివారు ఆరోపిస్తూనే వున్నారనుకోండి అది వేరే విషయం

స్వర్గీయ లాల్‌బహదూర్ శాస్త్రి సూచన ప్రకారం ప్రతి పౌరుడు వారాని కొకపూట ఉపవాసం వుండి ఆహార ధాన్యాలను ఆదా చేయవలసి వస్తే, మంత్రులైనవారు వారానికి రెండు పూటలు ఉపవాసం వుండాలి దీన్ని ప్రజలుగాని, ఇతర మంత్రులుగాని ఎంతవరకు పాటిస్తున్నారో మనకు తెలియదు గాని, ఆహారమంత్రి కనుక శ్రీ ఎ సి సుబ్బారెడ్డిగారు ఈ ఆదర్శానికి చాలా ముందుంటున్నారు ప్రతి దినం ఒకపూటే తాము భోజనం చేస్తున్నట్లు వారే స్వయంగా శాసనసభలో చెప్పుకున్నారు

ఉపవాసాలు మన దేశానికి కొత్తకాదు పూర్వం రుక్మాంగదుడనే రాజు తన రాజ్యంలో ప్రజలు ఏకాదశీ వ్రతానుసారం ఉపవాసం చేయాలని శాసించాడట దాన్ని చాలా కఠినంగా అమలు జరిపేవాడట మన మత సంప్రదాయాలన్నిటికి పారమార్థికంతోపాటు లౌకిక ప్రయోజనాలను కూడా కొందరు యుక్తిగా ప్రతిపాదిస్తూ వుంటారు కనుక, రుక్మాంగదుడుకూడా తన రాజ్యంలో ఆహారం కొరతవల్లనే ఈ వ్రతాన్ని శాసనం చేశాడేమో

ఉపవాస నియమాలు మొదట ఎలా ప్రారంభమైనా, ఆ తరువాత సహజంగానే వాటిలో కొన్ని సౌకర్యాలు ఏర్పడ్డాయి శరీరాన్ని నీరస పెట్టడం ఇష్టంలేక, ఉపవాసం అంటే వరి అన్నం మానివేయడంగానే భావించి, దానిబదులు ఇతర ఆహారపదార్థాలను సుష్టుగా ఆరగించడంగా ఈ నియమం మారిపోయింది అయితే, దీనివల్లకూడా ఈ రోజులలో కొరతగా వున్న బియ్యం ఆదా అవుతుంది కనుక మంచిదే మన ఆహార మంత్రి ఏకభుక్త నియమం ఈ విధమైనదని మా తాత్పర్యం కాదు, వారి నియమం కొనియాడదగినదని మాత్రమే.

# కోర్టు పక్షులు

అస్తమానం న్యాయస్థానాల చుట్టూ తిరిగే వారిని కోర్టు పక్షు లంటారు. వారు ప్రతి చిన్నదానికి కోర్టు కెక్కుతారు ప్రతిదానికి లా పాయింట్లు లాగుతారు. వారి కదొక వ్యసనం వంటిది

అట్టి వారికి జీవితమంతా కోర్టులు, దావాలు, అర్జీలు, సాక్ష్యాలు—వీటితోనే గడిచి పోతుంది చివరికి చేతికి చిప్ప వచ్చినా సరే, గెలిచామన్న సంతృప్తి చాలు వారికి అందుకే కాబోలు, ఓడినవాడు కోర్టులో ఏడిస్తే, గెలిచినవాడు ఇంటికివచ్చి ఏడ్చాడంటారు

అలహాబాదు హైకోర్టు మొన్న నొక సివిల్ కేసులో తీర్పు చెప్పిందట అది 40 ఏళ్ళ క్రిందటి కేసు దానికి ఇప్పటికి విమోచనం జరిగింది ఈలోగా అది నలభై ఇద్దరు జడ్జీల చేతులు మారిందట, రెండు డజన్ల మంది లాయర్లు వాదించారట

రామ్‌పూర్ సంస్థానం ఉపముఖ్యమంత్రి వారసుల ఆస్తి తగాదాకు సంబంధించిన కేసు అది ఇన్నేళ్ళ తర్వాత ఎవరు గెలిచినా, అనుభవించడానికి ఏ కాస్తయినా ఆస్తి మిగిలిందో లేదో "జస్టిస్ డిలేడ్ ఈజ్ జస్టిస్ డినైడ్" (ఆలస్యంగా జరిగిన న్యాయం జరగనట్టే లెక్క) అని ఆంగ్లంలో లోకోక్తి రావడానికి ఇటువంటి ఉదంతాలే కారణం

# మిరపకాయల ఖరీదు

రూపాయిని నూరు పైసలు చేసిన కొత్తలో ఏమోగాని ఆ తర్వాత పైసకు విలువేపోయింది ఇప్పుడు దానివిలువ సున్నతో సమానం లత, వనిత ఆశ్రయం లేనిదే శోభించ వన్నారు అలాగే మరే అంకెతో నైనా చేర్చి నప్పుడే సున్నకు విలువ అదే విధంగా మరే నాణెంతోనో చేర్చి వాడితేనే పైసకు విలువ

మొన్న విజయవాడలో 400 మంది మహిళలు తాసిల్దారు వద్దకు ఊరేగింపుగా వెళ్ళి ఒక పైసకు ఒక మిరపకాయైనా రావడంలేదని ఫిర్యాదు చేశారట ఆయన మటుకు ఏం చెస్తాడు పైసా పెడితే వక్క పలుకు వొక్క పలుకైనా రావడం లేదు ఇక మిరపకాయ వస్తుందా?

మిరపకాయలూ పైసా వంటివే మరిదేనితో నైనా చేర్చివాడితేనే వాటి రుచి విడిగా తినడానికి పనికిరావు మిరపకాయ చిన్నదని మేలమాడ రాదని సామెత నోట పెట్టుకుంటే నాలుక మండి పోతుంది కంటిలో పడితే మంట వంటికి రాచుకున్నా మంటే అందుకేనేమో వాటి ధరలూ అలాగే మండి పోతున్నాయి. కొనబోయిన వారికి వళ్ళు మండి పోవడంకూడా అందుకేనేమో

ఏమైనా అన్ని వస్తువుల ధరలూ అలాగే వున్నప్పుడు. మిరప కాయల ధరలు మండిపోతున్నాయని ఎంతగా హాహాకారాలూ మిరియాలూ నూరినా ఏం లాభం?

# తిరుక్షవరం

డబ్బంటే మానవుడికి ఎంతాశ? కష్టపడి సంపాదించే డబ్బుకాదు, దాని మీద ఆశ సహజమే, సమంజసమే, దాని సంగతికాదు, ఊరికే కాలు మీద కాలేసుకుని కూచుంటే గాలిలో తేలివచ్చే డబ్బుమీద ఆశ!

చిన్న పిల్లలు పుస్తకాలలో నెమలి కన్నులు దాస్తారు, కొన్నాళ్ళకు అవి పిల్లలు పెడతాయని వారి ఆశ,

నెమలి కన్నులు అపురూపం కనక, పిల్లలకు అవే కొండంత ఆస్తి, పెద్దలకో? నిజమైన డబ్బు కావాలి, అది మంత్రంతోనో, మాయ తోనో పిల్లలు పెట్టాలి

ఈ పేరాసతోనే మద్రాసు బట్టల వర్తకు డొకాయన బుట్టలో పడ్డాడట డబ్బును రెట్టింపు చేస్తానంటున్న ఒక కాశ్మీరీ బాబా తిరుపతి కొండలమీద వున్నాడంటే వెళ్ళాడట బాబా రివాల్వరు చూపి బెదిరించి, వర్తకునివద్ద ఇరవైవేల రూపాయలు కాజేసి, పరారీ అయ్యాడట

ఇప్పటికే దేశంలో నోట్ల ముమ్మరం హెచ్చుగా వుంది దీనికి తోడు దొంగనోట్ల ముద్రణ బయలుదేరింది గారడీవల్ల నిజమైన నోట్లు సృష్టించడం సాధ్యంకాకపోబట్టి బ్రతికి పోతున్నాముగాని, అవికూడా బయలుదేరితే ఇక చెప్పాలా?

ఇంతకీ మనం రెట్టింపు చేయవలసింది నోట్లను గాదు వాటికి నిజమైన విలువనిచ్చే సరుకులు, మనం కోరుకోవలసింది సునాయాసంగా వచ్చే డబ్బును కాదు, కష్టానికి తగిన ప్రతిఫలాన్ని, దాని రుచి మరి దేనికీరాదు

# నిరాడంబరత

"క్షౌపీన సంరక్షణార్థం అయం పటాటోపః" అన్నాడట వెనకటికొక సన్యాసి పుణ్యానికి పోతే పాపమెదురైనట్టు, భారత ప్రభుత్వం కూడా పొదుపు చేయబోతే మరింత ఖర్చు తగులుతున్నదట

మంత్రులు పెద్దకార్లను వాడరాదని చిన్నవాటినే వాడాలని ప్రధాని ఇందిరాగాంధి సలహా ఇచ్చారు తన సలహా తానే ముందుగా పాటించారు కూడా.

కాని, దీనివల్ల ఒక చిక్కు వచ్చింది ఇప్పుడు మంత్రు లందరికి చిన్నకార్లు కొనవలసి వస్తుంది దీనికోసం మళ్ళీ ఎంతో ఖర్చు.

పోతే, ఇంతవరకు మంత్రులు ఉపయోగిస్తున్న పెద్దకార్లను ఏమి చేయడం? వాటిని ఆయా శాఖల సెక్రటరీలు, వారి సిబ్బంది వాడుతున్నారట; మంత్రులు చిన్నకార్లలో వెడుతుండగా, వారి వెనక పెద్ద కార్లలో అట్టహాసంగా వారి సెక్రటరీలు వెడుతున్న దృశ్యం నిజంగానే విడ్డూరంగా వుంటుంది

ఈ విడ్డూరాన్ని తొలగించడానికి, రేపటి నుంచి మంత్రులుగాని, వారి సిబ్బంది గాని అసలు కార్లే ఉపయోగించరాదని ప్రధాని సలహా ఇస్తారేమో!

"పెన్నీ వైజ్ అండ్ పౌండ్ ఫూలిష్" అని ఇంగ్లీషులో సామెత అంటే చిన్న మొత్తాలను పొదుపుచేసి, పెద్దమొత్తాలను మంచినీళ్ళవలె ఖర్చు చేయడం; భారత ప్రభుత్వపు పొదుపు ఆలోచనలు ఇలాంటివే

# అందమైన పేర్లు

గులాబీని మరే పేరుతో పిలిచినా, అది సువాసనలే వెదజల్లుతుందన్నాడు షేక్‌స్పియర్. అలాగే ఉమ్మెత్త పువ్వును ఏ పేరుతో పిలిచినా అది నిర్గంధ కుసుమమే.

అనాకారి మనిషి ఎంత మంచిపేరు పెట్టుకున్నా, అనాకారితనం పోతుందా? "పేరు కమలాక్షి, చూపులు కాకి చూపులు" అని తెలుగులో సామెత "ఇంటిపేరు కస్తూరివారు, ఇంటిలో గబ్బిలాల కంపు" అని మరొక సామెత అందుకే పేరులో ఏమున్నదనికూడా అన్నాడు షేక్‌స్పియర్

అయినా, ఈ సూక్తిలో నమ్మకం లేకనే కాబోలు, బొంబాయిలోని కొన్ని మురికిపేటలలో నివసించేవారు తమ వాడలకు చాలా అందమైన పేర్లు పెట్టుకున్నారట ఒక మురికి పేట పేరు ప్రేమ్ నగర్, మరొక దానిపేరు సుందర్ నగర్, ఇంకొక దానిపేరు కళానగర్ ఇలాగే మరి కొన్ని

"మాంసం తింటామని ఎముకలు మెడకు కట్టుకుని తిరుగుతామా?" అంటారు మురికి పేటలలో నివసించవలసి రావడమే ఒక దురదృష్టం కాగా, వాటికి పేర్లుకూడా మురికివే పెట్టుకోవాలా?

అందువల్లనే బొంబాయి మురికివాడల వాసులు తమ పేటలకు చక్కని పేర్లు పెట్టుకుని వుంటారు కొందరు రచయితలను చూడరాదా? పుస్తకంలో సరుకేమీ లేకపోయినా, దానికి పేరుమాత్రం బ్రహ్మాండంగా పెడతారు

అయినా, బొంబాయి మురికిపేటలవారు వాటికి మంచి పేర్లు పెట్టుకొనడంతోనే తృప్తిపడరాదు పేర్లకు తగ్గట్టు వాటిని అందంగా, అమలినంగా తీర్చి దిద్దుకోవాలి తమ వాడలకు కనీసపు పౌర సౌకర్యాలను కలుగజేయాలని మునిసిపాలిటీపై ఒత్తిడి తేవాలి లేకపోతే వాటిపట్ల "పేరు గొప్ప, ఊరు దిబ్బ" అనే సామెత సార్థకమై ఊరుకుంటుంది

# అనావృష్టికి కారణం

ఈ యేడాది ఆంధ్రప్రదేశ్‌లో నేమి, మొత్తం దేశంలో నేమి వర్షాభావం తీవ్రంగా ఏర్పడింది పొరుగునవున్న మద్రాసు రాష్ట్రంలో ఆలస్యంగానైనా ఇప్పుడిప్పుడు భారి వర్షాలు పడుతున్నాయి మన రాష్ట్రంలో అదీ లేదు ఈ ప్రకృతి వైపరీత్యానికి అసలు కారణాన్ని డాక్టర్ టి వి ఎస్ చలపతిరావు గారు మొన్న రాష్ట్ర శాసనసభలో బయటపెట్టారు

దేవునికి పత్రం, పుష్పం, ఫలం, తోయం-భక్తితో ఏది చ్చినా స్వీకరిస్తాడని చెబుతారు గాని, నిజానికి వీటిలోకూడా విలువ కలిగినవే ఆయన కిష్టమైనట్టు తోస్తుంది ఈ లెక్కన ఎంత విలువైనవైతే అంత ఇష్టమన్నమాట

కొబ్బరికాయ ఇప్పుడు 75 పైసలు అమ్ముతున్నది అందుచేత ప్రజలు ఇదివరకటివలె దేవునికి కొబ్బరికాయలు సమర్పించుకో లేక పోతున్నారు. మరి ఆయనకు కోపం రాదా? అందుచేతనే వర్షాలు పడలేదు, అందుచేతనే పంటలు సరిగా పండకపోవడం, దుర్భిక్ష ప్రమాదం ఏర్పడడం జరిగింది ఇది డాక్టర్ చలపతిరావుగారి "థీసిస్"

అయితే, కొబ్బరికాయలధర పెరగడానికి ఏమి కారణమో? వ్యాపారస్థుల లాభాపేక్ష వల్లనా? ధరలను ప్రభుత్వం అరికట్టలేక పోవడం వల్లనా? లేక కాయలు సరిగా కాయకపోవడం చేతనా? చలపతిరావుగారు వివరించలేదుగాని, మా అనుమానం—దేవునికి ప్రజలు విరివిగా కొబ్బరి కాయలు సమర్పించుకోవడంతో, వాటికి గిరాకీ ఎక్కువై ధరలు పెరిగి వుండవచ్చు కనీసం ఇదొక కారణం కావచ్చు

ఏమైనా, ధర లెక్కువై కొబ్బరికాయ లిచ్చుకోలేని పేద ప్రజల పట్ల దేవుని కింత కాఠిన్యం తగునా? కొబ్బరికాయలు కొట్టడం బొత్తిగా అలవాటులేని అమెరికావంటి అభివృద్ధి చెందిన దేశాలలో పంటలు పుష్కలంగా పండించి, అక్కడినుంచి యాచించి తెచ్చుకోమనడం ఏమి సబబు?

# కవిత్వం, రాజకీయాలు

సాధారణంగా రాజకీయ మహాసభలలోనికి కవిత్వం చొరబడ్డానికి వీలు లేదు అదంతా వచన ప్రపంచం.

అయితే స్త్రీలున్నచోటికి కవిత్వం రాకుండా వుంటుందా? వారెక్కడ వుంటే అక్కడికి సౌందర్యం, సౌకుమార్యం, లాలిత్యం వాటంతట అవే వచ్చేస్తాయి, వాటితోపాటు కవిత్వం కూడా వస్తుంది

అన్ని వాఙ్మయాలలోను ఆదికవులుగా పురుషులే ప్రసిద్ధికెక్కినా, అసలు కవిత్వమనేది స్త్రీలతోనే, వారి లాలిపాటలతోనే, ప్రారంభమై వుండవచ్చు

రాజకీయాలలో ఎంతగా మునిగి తేలుతున్నదైనా, బొంబాయి ఎ ఐ సి సి సమావేశంలోనికి కూడా కవిత్వం తొంగి చూడకుండా పోలేదు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తాను నెహ్రూ విధానాలనుంచి వైదొలగుతున్నట్టుగా కొందరు చేసిన ఆరోపణలను ఖండిస్తూ, నెహ్రూ బ్రతికి వుండగా ఆయన విధానాలను నిరసించినవారే ఇప్పుడు వాటిని పట్టుకుని ఊరేగుతున్నారని ఎదురుదెబ్బతీశారు ఈ సందర్భంలో ఆమె గ్రీక్ కవి హోమర్‌ను గురించి ప్రచారంలో వున్న ఒక ఇంగ్లీషు పద్యం ఉదహరించారు

మరణించిన కవిసింహుడు హోమర్
మా వాడన్నవి తొమ్మిది వాడలు
బ్రతికి వుండగా తిరిపెమెత్తుతూ
ఆయన తిరిగిన వా వూళ్ళే

ఇలాగే శ్రీమతి తారకేశ్వరిసిన్హా ఒకఉర్దూ పద్యాన్ని ఉదహరించారు ఆ పద్యమేదో వార్తలలోకి రాలేదుగాని, శ్రోతలు హర్షధ్వానాలు చేశారు కనుక అది ఆమె వలెనే అందమైనదే అయివుండాలి

ప్రజల సమస్యలను, దేశ సమస్యలను చర్చించవలసిన రాజకీయ మహాసభలు కవితా గోష్ఠులుగా, ముషాయిరాలుగా మారిపోవాలని మా తాత్పర్యం కాదు కాని, ఈ విధంగా అప్పుడప్పుడు కవితావీచికలు వీస్తుంటే ఎంత నిస్సారమైన చర్చలైనా రక్తికడతాయి

# నిరుద్యోగ ఫలితం

ఉద్యోగం పురుష లక్షణమని లోకోక్తి. స్త్రీకి ఏవిధమైన స్వాతంత్ర్యం లేని కాలంలో ఈ లోకోక్తి పుట్టింది. కుటుంబానికి యజమాని పురుషుడేనని, అందుచేత దాన్ని పోషించే భారంకూడా అతడే వహించాలని పూర్వులు శాసించారు. ఎక్కడో అక్కడ రెక్కలు ముక్కలు చేసుకుని, ధనం సంపాదించి అతడు కుటుంబాన్ని పోషించాలి. ఇప్పుడు రోజులు మారి ఉద్యోగం స్త్రీ ధర్మంగా కూడా మారుతున్నది.

అయితే, ఉద్యోగం పురుషలక్షణ మన్నది శరీరశాస్త్ర దృష్టితో చూసినా నిజమేనని ఒక బ్రిటిష్ శాస్త్రవేత్త చెబుతున్నాడు. నిరుద్యోగం వల్ల పురుషుడు లైంగికంగా కూడా అసమర్థుడవుతాడట. అతని దాంపత్య జీవితం భగ్నమై, అన్ని విషయాలమీద నిర్లిప్తత, సోమరితనం కూడా ఎక్కువ అవుతాయట.

ఈ చివరి విషయం సాధారణంగా అనుభవంలోకి వచ్చేదే. నిర్వ్యాపారత కాపురుష లక్షణమని నీతిచంద్రికా కారుని సూక్తి. దానివల్ల సోమరి తనం తప్పకుండా పెరుగుతుంది. కుటుంబ పోషణభారం వహించకుండాపోతే స్త్రీకి కూడా అతనిపై ఏవగింపు కలుగుతుంది. సంసారం విచ్ఛిన్నమైనా కావచ్చును.

కాని, లైంగికమైన సమర్థత నిరుద్యోగం వల్ల నశిస్తుందనడానికి శాస్త్రరీత్యా ఏ ఆధారాలున్నాయోగాని, లౌకికంగా మటుకులేవు. నిరుద్యోగం ప్రబలంగావున్న ఆసియా, లాటిన్ అమెరికాలవంటి చోట్లనే జన సంఖ్య అమితంగా పెరిగిపోతున్నది. బహుశా నిరుద్యోగంవల్లనే పెరిగిపోతున్నదేమో కూడా.

# ఆలుమగల పోటీ

కీచులాటలు లేనిదే భార్యా భర్తలే కారు. ప్రళయ కలహాలుగా పరిణమించకపోతే ప్రణయ కలహాలు చూడముచ్చటగానే వుంటాయి. ఎన్నికల కలహాలైతే మరీని

మధ్యప్రదేశ్‌లో ఒక నియోజకవర్గానికి ఖైరాఘర్ రాజా కోరిన టిక్కెట్టును నిరాకరించి, ఆయన భార్య రాణి పద్మావతీ దేవికి కాంగ్రెస్ కేంద్ర ఎన్నికల సంఘం టిక్కెట్టు ఇచ్చిందట తాను ఇండిపెండెంట్‌గా నిలబడి తన భార్యతోనే పోటీ చేయవలసి వస్తుందని కనుక నిర్ణయాన్ని మార్చుకో వలసిందని, రాజాగారు శ్రీ కామరాజ్‌కు విజ్ఞప్తి చేశాడట

ముఖాముఖిపోటీలో పాల్గొనకపోయినా, దగ్గిరి బంధువైన వారు ఒకరొక పార్టీలో చేరితే, రెండవవారు మరొక పార్టీలో చేరిన సందర్భాలెన్నో లేకపోలేదు మణిబెన్ పటేల్ (కాంగ్రెస్) దయాభాయిపటేల్(స్వతంత్ర) సోదరీ, సోదరులు ఆచార్య కృపలాని (ఇండిపెండెంట్), శ్రీమతి సుచేత (కాంగ్రెసు), దంపతులు శ్రీ సుబ్బరాయన్ (కాంగ్రెసు), శ్రీమతి పార్వతీకృష్ణన్ (కమ్యూనిస్టు) తండ్రి, కూతుళ్ళు ఇలాగే ఎన్నో ఉదాహరణ లున్నాయి

కాని, ఆలుమగలు ఒకే నియోజక వర్గంనుంచి లోకసభకు పోటీ చేయనున్న సందర్భం పైన పేర్కొన్నది ఒక్కటేనేమో శ్రీ కామరాజ్‌కు పెళ్ళి కాలేదు కనుక, భార్యా భర్తల కలహాల విషయం ఏమీ తెలిసి వుండక పోవచ్చు. లేకపోతే, ఆలుమగల మధ్య పోటీ తప్పని పరిస్థితి రావడానికి ఆయన అంగీకరించేవారా ?

# దొంగతనానికి విరుగుడు

మద్యపానం చెడ్డదేగాని, ఆ చెడువల్ల మంచి కూడా ఒక్కొక్కసారి జరగవచ్చు

పారిస్‌లో ఒక మద్యశాలలోకి దొంగ ప్రవేశించాడట అక్కడి సీసాలు చూసేసరికి వాడికి నోరూరి, ఒకదాని తర్వాత ఒకటి ఖాళీ చేసే శాడు ఆ మత్తులో ఏకంగా ఇనప్పెట్టెనే ఎత్తుకుపోవాలని చూసి, ఎత్త లేక కింద పడ్డాడు. తెల్లవారి పోలీసులు వచ్చి పట్టుకునే వరకు వాడు ఆ మత్తులోనే పడివున్నాడట

దీన్నిబట్టి సారాను సర్వ చౌర్య నివారిణిగా వాడవచ్చునేమో ధన వంతులు తమ ఇనప్పెట్టెల సమీపంలో సారాసీసాలను, వీలైతే పీపాలను వుంచాలి సాధారణంగా దొంగలలో సారాదాసులు కాని వారుండరు సారా చూడగానే, వచ్చినపని మరచిపోయి, చిత్తుగా తాగి మత్తుగా పడి పోతారు

దొంగతనానికి వచ్చినవారు అంత తెలివి తక్కువగా ప్రవర్తి స్తారా అని ప్రశ్న రావచ్చు తెలివితక్కువగా ప్రవర్తింపచేస్తుంది కనుకనే, మద్యం అంత చెడ్డదైంది దాని ఆకర్షణ అంత బలమైంది కనకనే, దానికి ఇందరు దాసులైపోతున్నారు అందుకే దాన్ని పని కట్టు కుని మనదేశంలో నిషేధించవలసి వచ్చింది దీని వల్లనే దాని ఆకర్షణ మరింత పెరిగిపోయింది కనుక, ఇనప్పెట్టెలకు కాపుగా సారా వుంచితే దొంగతనాలు తగ్గిపోవచ్చు అప్పుడది అక్షరాలా "కాపుసారా" కాగలదు.

# ఉపన్యాస వ్యసనం

మన పూర్వులు సప్త వ్యసనాలను పేర్కొన్నారు మరి. వాటికి ఉపన్యాస కండూతిని ఎందుకు చేర్చలేదో?

కొందరికి వేదిక దొరికితే, కోతికి కొబ్బరి కాయ దొరికినట్టే. గంటలతరబడి శ్రోతలను ఊదరగొట్టిగాని, వారు వేదిక దిగరు అమాయకత్వం కావచ్చు మొండితనం కావచ్చు అట్టివారు సభికులు ప్రసంగం వినకుండా తమలో తాము మాట్లాడుకుంటున్నా, పట్టించుకోరు చివరి వరసలోని వారు వేదిక దిగవలసిందిగా చప్పట్లు కొట్టినా, కేకలు వేసినా, తమను హర్షిస్తున్నట్టే భావించి రెట్టించిన ఉత్సాహంతో ఉపన్యాసం కొనసాగిస్తారు

ఈ ఉపన్యాసకేసరులకు పరెంగిత జ్ఞానమేకాదు, కాలజ్ఞానంకూడా నశిస్తుంది ఇట్టి వాడే ఒకడు తన ఉపన్యాసాన్ని మధ్యలో ఆపి "టైమెంత?" అని అడిగాడట "తమ వెనుక క్యాలెండరు చూడండి" అని ఒక సభికుడు సమాధాన మిచ్చాడట

ఇట్టివారికోసమే కావచ్చు-లండన్‌లోని కార్పొరేషన్ మందిరంలో ఒక క్రొత్తరకం గడియారాన్ని ఏర్పాటు చేశారట ఉపన్యాసకుడు తనకు నిర్ణయించిన వ్యవధిని మించి ఒక నిమిషం ఎక్కువ మాట్లాడితే, వెంటనే దానిలో ఒక ఎర్రలైటు వెలుగుతుందట

మనదేశంలోకూడా సభాస్థలాలలో ఇట్టి గడియారాలు నెలకొల్పడం మంచిది కాని, కొందరు మొండివాడు ఎర్రలైటును ఖాతరు చేయకపోవచ్చు అట్టివారిని వేదికనుంచి ఆటోమేటిక్‌గా దింపివేసె యంత్రసాధనాలను కూడా అమర్చడం మంచిది

# నిత్య యవ్వనం

వృద్ధాప్యం ఒక వ్యాధి మాత్రమేనా? దానికి చికిత్సచేయడం సాధ్యమేనా?

బ్రిటిష్ జీవశాస్త్రవేత్త ప్రొఫెసర్ రాబర్ట్ సిమ్స్ అవుననే సమాధానం చెబుతున్నాడు వృద్ధాప్యం ఒక రకమైన "వైరస్" వల్ల కలుగుతుందట దాన్ని నిర్మూలించడమో, అనుక్షణం జరిగే జీవకణ నష్టాన్ని నివారించడమో చేయగలిగితే వృద్ధాప్యం రాకుండా చెయవచ్చునట ఇది ఈ శతాబ్దం ఆఖరునాటికి సాధ్యం కాగలదట కూడా.

అంటే ఆ చికిత్సను జయప్రదంగా చేయడం సాధ్యపడినప్పుడు మానవులకిక వృద్ధాప్యం రానేరా దన్నమాట, వారు నిత్య యౌవనులైపోతారన్నమాట అంతేకాదు, దేవతలను త్రిదశు లంటారు కనుక మానవులు దేవతలైపోవచ్చు నన్నమాట

బ్రిటిష్ శాస్త్రవేత్త కనిపెట్టినది కొత్త విషయమని మన వాళ్ళు ఒప్పుకొనకపోవచ్చు కాయకల్ప చికిత్సతో వృద్ధాప్యాన్ని వారించవచ్చునని మనవారు కూడా నమ్ముతారు. ఇదీ అదీ ఒకటేనేమో

అది అటుంచి, సహజంగా వచ్చే వృద్ధాప్యాన్ని మానవుడు నిర్వికారంగానే స్వీకరిస్తాడు అకాల వృద్ధాప్యం, అకాలమరణమే బాధ కలిగించేవి. వాటిని వారించడానికి ఈ శాస్త్రవేత్తలు ప్రయత్నించరాదా?

# ప్రేమ వివాహాలు

వేదన పూర్వులు ఎనిమిది రకాల వివాహాలను పేర్కొన్నారు వీటిలో కొన్ని ప్రేమ వివాహాలుకూడా వుండేవి శకుంతల గాంధర్వ వివాహం చేసుకున్నది రుక్మిణీ కల్యాణం రాక్షస పద్ధతిలో జరిగింది దమయంతి స్వయంగా తన వరుడిని ఎంచుకున్నది

మరి, ఈ వివాహ స్వేచ్ఛ వధూవరుల కెప్పుడు పోయిందోగాని, తల్లిదండ్రులు నిర్ణయించడమే ఎక్కువగా అమలులోకి వచ్చింది కొన్ని శతాబ్దాలుగా ఈ పద్ధతి కొనసాగింది ఇప్పు డిప్పుడు ఇది తగ్గిపోతూ ప్రేమ వివాహాలు మళ్ళీ వస్తున్నాయి

అయినా, గుయానా (లోగడ బ్రిటిష్ గయానా) దేశానికి వలస వెళ్ళిన భారతీయులలో ఇంకా పాత పద్ధతే అమలులో వున్నదట కాని, ఇప్పుడు అక్కడకూడా యువతీ యువకులు వివాహ విషయంలో తల్లి దండ్రులను ఎదిరించడం ప్రారంభిస్తున్నారట.

తమ మాతృదేశంలోనే క్రమంగా తగ్గిపోతున్న పాత కాలపు వివాహ పద్ధతిని గుయానా భారతీయులు ఇంకా పట్టుకుని వేళ్ళాడడం దేనికో? ఇటీవల ఒక పదిహేనేళ్ళ యువతి తల్లిదండ్రులు నిశ్చయించిన సంబంధం ఇష్టం లేక ఆత్మహత్య చేసుకున్నదట ఇటువంటి మరికొన్ని జరిగితేగాని, అక్కడివారు పాత పద్ధతికి స్వస్తి చెప్పకపోవచ్చు

# పఠనాసక్తి

నిరుపహతిస్థలం, రమణీ ప్రియదూతిక తెచ్చి ఇచ్చు కప్పుర విడెం మొదలైన హంగు ఉంటేగాని కావ్య రచన సాగదన్నారు పెద్దనగారు కావ్య రచన సంగతి ఏమోగాని, కావ్య పఠనానికి వీటిలో ఒకటి - నిరుపహతి స్థలం-కావాలి లేకపోతే చదువు సాగదు

కాని, ఒక్కొక్కరికి ఒక్కొక్క చిత్రమైన అలవాటు వుంటుంది కొందరు క్రిక్కిరిసిన బస్సులలో, రైళ్ళలో పుస్తకాలు చదువుతూ వుంటాయి కొందరు సినిమాలవద్ద క్యూలో నిలబడి చదివేస్తూ వుంటారు మరికొందరు ఏకంగా రోడ్లమీద నడుస్తూ వచ్చే పోయే జనసమ్మర్దాన్ని మోటాయి శకటాలను లెక్కచేయకుండా చదువుతూ పోతుంటారు మనిషి కొక పిచ్చి కదా?

బ్రిటన్‌లో ఒక డ్రయివరు లారీ తోల్తూనే స్టరింగ్ చక్రంమీద నవల పెట్టుకుని చదువుతున్నందుకు జుల్మానా పడిందట అతను చదువుతున్నది-హంతకుడెవరో తెలితేగాని ఊరుకోనివ్వని ఏ డిటెక్టివ్ నవలో కావచ్చు ఏదైనా అతడు చదవవలసింది రోడ్డును రోడ్డుమీద జనాన్ని కాని, పుస్తకం కాదుకదా? అదృష్టవశాత్తు అతడు ఎవరిమీద లారిని ఎక్కించలేదట ఏక కాలంలో లారీ నడపడానికి పుస్తకం చదవడానికి అతడు ఏదైనా అవధానం సాధన చేసి వుండవచ్చు

మన దేశంలో డ్రయివర్లకు ఇంత సాహిత్య పిపాస లేకపోవడం మన అదృష్టమే పుస్తకాలు చదవకుండానే ప్రమాదాలు జరిపిస్తూ వుంటారు, పుస్తకాలు చదవడం మొదలిడితే ఇక చెప్పాలా?

# అభినవ కాన్యూట్లు

వెనకటికి ఇంగ్లండు రాజు కాన్యూట్ అలలను నిలిపివెయ వలసిందిగా సముద్రాన్ని శాసించాడట అయిన ఎంత గొప్పరాజైనా, సముద్రం ఆయన మాటలను మన్నించలే దనుకోండి

ఈ కాలంలో కూడా కాన్యూట్లకు కొరతలేదు ఫ్రాన్సులో ఒక పట్టణం మునిసిపాలిటీవారు కోళ్ళు రాత్రిళ్ళు కూయరాదని డిక్రీ జారీ చేశారు అవి పౌరులకు నిద్రాభంగం కలుగ జేస్తున్నాయట నవంబరు ఒకటవ తేదీ నుంచి అవి రాత్రిళ్ళు కూస్తే, చట్ట బద్ధమైన చర్యలు తీసుకొంటామని హెచ్చరించారట

నవ్వడం మానవులకే సాధ్యమైన విద్య కాబట్టిగాని, లేకపోతే ఈ డిక్రీ వింటే కోళ్ళు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుకోవా?

నవ్వడం చేతకాక పోయినా కోళ్ళకు మానవులవలెనే కోపించడం చెతనౌను మానవజాతికి తాము చేసిన మహోపకారానికి ఇదా ప్రతిఫల మని అవి ప్రశ్నించవచ్చు ఇప్పుడైతే అలారం గడియారాలు వచ్చాయి కాని, అవి లెనప్పుడు కొన్ని వేల సంవత్సరాలుగా మానవులను తెల్లవారుఝామునే నిద్రనుంచి మేల్కొల్పినవి కోళ్ళేకావా? దీనికి ఉదాహరణగా "ముసలమ్మ కోడి, కుంపటి" కధను పేర్కొన వచ్చు

మానవుల కృతఘ్నతకు ప్రతీకారంగా కోళ్ళు గుడ్లు పెట్టడం మానివెయవచ్చు, ఇంతెందుకు? "కోడి ముందా, గుడ్డు ముందా?" అని అవి ప్రశ్నిస్తె, ఎంత కొమ్ములు తిరిగిన వేదాంతి అయినా నిరుత్తరుడు కావలసిందే కదా?

మొరిగే కుక్క కరవదని సామెత కాని ఈ సామెత తెలిస్తె కదా, మొరిగే కుక్క కరవకుండా పోయేది? అలాగే, ఫ్రెంచి మునిసిపాలిటీ డిక్రీ కోళ్ళకు అర్థం కావాలి కదా, దాన్ని పాటించడానికి? అర్థమే అయితే, మానవుల శాసనాలను మానవులే మన్నించడం లేదే ఇక మేమెందుకు మన్నించాలని అవి తప్పక ఎదురు ప్రశ్న వేస్తాయి.

# ప్రేక్షకులకు సబ్సిడీ

మన దేశంలో సినిమా ప్రేక్షకులపై ప్రభుత్వం వినోదం పన్ను విధిస్తే, చెకొస్లొవాకియాలో ప్రభుత్వం ప్రేక్షకులకు ఎదురు డబ్బిస్తుందట సినిమా పరిశ్రమను ప్రోత్సహించడానికి అక్కడ ఈ సబ్సిడీ పద్ధతి ఒక మార్గమట ఈ విషయాన్ని మొన్న ఒక చెకొస్లొవాక్ మంత్రి న్యూఢిల్లీలో వెల్లడించారు

చెకొస్లొవాకియా కొన్ని చక్కని చిత్రాలను నిర్మించినమాట నిజమే కళాఖండాల నిర్మాణంలో అది ఏ యూరోపియన్ దేశానికి తీసిపోదు కాని ఎక్కువ చిత్రాలు ప్రేక్షకులకు సబ్సిడీ ఇస్తేగాని చూడవలసినంతటి నిరుత్సాహకరంగా వుంటాయేమో సోషలిస్టు వాస్తవికత పేరుతో చాలా చప్పగా, నిర్జీవంగా వుండే చిత్రాలు తీయడం కమ్యూనిస్టు దేశాలలో మామూలే.

మన దేశంలో ప్రజలకు సినిమాలే ప్రధాన వినోదసాధనాలు వాటికి సబ్సిడీ లివ్వడం మొదలుపెడితే దానికిక అంతువుండదు కాని, కనీసం ఉత్తమ చలన చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించడానికి వాటి ప్రేక్షకులకు సబ్సిడి లివ్వడం మంచిదేమో చలనచిత్రాల ప్రమాణాన్ని పెంచడానికి ఇదొక మార్గంగా ప్రభుత్వం ఎందుకు అనుసరించకూడదు?

# మావో దేవో భవ

ఏదుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రమా? అని సామెత ఇతర దేశాలలో కాకపోవచ్చు గాని చైనాలో మాత్రం అన్నిటికీ ఒకటే మంత్రం. అది సర్వసందేహ నివారణ మంత్రం. మావో మంత్రం!

కమ్యూనిజానికి ఆద్య గురువులైన మార్క్సు, ఎంగెల్సులు, అనంతర గురువులైన లెనిన్ స్టాలిన్లు సయితం తమ సిద్ధాంతాలకు సర్వ వ్యాపకత్వాన్ని ఆపాదించుకోలేదుగాని, చైనాలో మావో సిద్ధాంతాలను మాత్రం మానవ జీవితంలోని సమస్త విషయాలకు వర్తింపజేస్తున్నారట.

మీరు పింగ్-పాంగ్ ఆట చేత కావడం లేదా? మావో సిద్ధాంతాలను మననం చేయండి నేల దున్నుతుంటే నాగలిచాలు తిన్నగా రావడం లేదా? మావో సూత్రాలు పఠించండి కర్బూజాపళ్ళు అమ్ముడుపోవడం లేదా? మావో ఏమన్నాడో చూడండి. ప్రేమలో విఫలు లయ్యారా? మావోను స్మరించండి తలనొప్పిగా వుందా? మావో

ఈ ధోరణిలో కడచిన ఆరు నెలలుగా చైనాలో ప్రచారం జరుగుతున్నదట కమ్యూనిజంలో పాతదేవుళ్ళకు, మతాలకు, మూఢ విశ్వాసాలకు తావులేకపోవచ్చుగాని, వాటి స్థానంలో కొత్తవి బయలుదేరాయి నిత్యజీవితాన్ని మావో మయంగా గడుపుతున్న చైనా ప్రజలను చూసి జాలిపడవలసిందే

# సాహిత్యంలో కొత్త శిల్పం

రాజకీయ వేత్తలవలెనే రచయితలది కూడా దయనీయస్థితి రాజకీయ వేత్త ఏ పని చేసినా తెగనాడే వారుంటారు, అలాగే రచయిత ఏ పుస్తకం వ్రాసినా విమర్శించే వారుంటారు

భవభూతి తన నాటకాలను విమర్శించిన వారి నుద్దేశించి "కాలం నిరవధికమైంది, పృథ్వి విపులమైంది." అని, తన రచనను మెచ్చుకునే సహృదయులు ఎప్పుడో, ఎక్కడో వుండకపో రన్నాడు!

కాళిదాసువంటి మహాకవికూడా భాస, సౌమిల్ల కాదులవంటి మహా మహుల నాటకాలను ఎరిగిన రసజ్ఞుల ముందు తన కొత్త నాటకాలను ప్రదర్శించడానికి జంకుతున్నట్టు చెప్పుకున్నాడు

షేక్‌స్పియర్ నాటకాలను అతని కాలం నాటి కవి, పండిత లోకం అనాదరించగా అతను పోయిన చాల ఏళ్ళ తర్వాతగాని వాటి ప్రాశస్త్యాన్ని ప్రపంచం గుర్తించలేదన్న విషయం సుప్రసిద్ధమైనదే

తరుణ వయస్కుడుగానే మరణించిన కీట్సు కూడా అంతే, తన "ఎండీమియన్" కావ్యాన్ని విమర్శకులు హేళన చేశారనే మనోవ్యాధి తోనే అతడు మంచం పట్టి మరణించాడని, ఈ ఉదంతాన్ని ఆధారం చేసుకునే మరొక మహాకవి షెల్లీ "ఎడొనీస్" అనే పద్యాన్ని కీట్సుపై వ్రాశాడని ఒక కధ వున్నది అందుకే, ఎలా వ్రాసినా సమకాలికులు మెచ్చరుగదా అని రామరాజ భూషణుడు వాపోయాడు

విమర్శకులతో, పాఠకులతో ఈ బాధపడలేకనే ఒక స్వీడిష్ రచయిత (?) గ్రంధ రచనలలో కొత్త శిల్పాన్ని అనుసరించాడు నూరు పేజీల పుస్తకాన్ని అచ్చువేసి మొన్న స్టాక్‌హోం పుస్తకశాల లన్నిటిలోను అతడు అమ్మకానికి పెట్టాడు, ఆ పుస్తకంలో వివాదాస్పదం

కాగల ఒక్క అక్షరం ముక్క కూడా లేదట అసలు అక్షరాలే లేవట, ఫుల్ స్టాపులు, కామాలు, కోలన్లు మొదలైన గుర్తులతో మొత్తం పుస్తకం నింపివేశాడట దానికి "నోబెల్ ప్రైజు" అని పేరు పెట్టాడు.

పేపీ లేని పని చాలా మంది రచయితలు తమ విమర్శకులకు మూలైన సమాధాన మిచ్చిన వారున్నారు గాని, ఇంత దెబ్బతీసిన వారెవ్వరు లేరు

కొన్నేళ్ళ క్రిందట ఏవేవో మనస్తత్వ సిద్ధాంతా లాధారం చేసుకుని కొందరు కవులు వ్రాసిన కవిత "సర్రియలిజం" పేరుతో ప్రచారంలో వుండేది అది వ్రాసిన వారికే తప్ప మరెవ్వరికీ బోధపడేదికాదు ఇప్పుడు ఈ స్వీడిష్ రచయిత వ్రాసినది వచనమో, కవిత్వమో తెలియదు గాని, అతనికి కూడా బోధపడదు కనుక, దానికి "వెర్రియలిజం" అని పేరు పెట్టవచ్చు

# యాంత్రిక కవులు

కవిత్వం వ్రాయగల యంత్రం వచ్చిందట దీన్ని ఆస్ట్రేలియాకు చెందిన ఒక బాలుడు కొత్తగా కనిపెట్టాడట.

షేక్స్పియర్ స్థాయిలో, షెల్లీ స్థాయిలో కవిత్వాన్ని చెప్పలేక పోయినా, మొత్తంపై "ప్యాస్ మార్కు"ల కవిత్వాన్ని ఇది వ్రాయ గలదట ఒక బాలుడు ఈ యంత్రాన్ని కనిపెట్టినందున బాలకవి స్థాయిలో దీని కవిత్వం బహుశా వుండవచ్చు

యంత్రాలంటే లేనిపోని మోజుకాని, నిజానికి కవిత్వం వ్రాసే యంత్రంతో ఎంతమాత్రం పనిలేదు. దేశదేశాలలో యంత్రాలవలె కవిత్వం చెప్పగలవారు లక్షోపలక్ష లుండగా, అనవసర వ్యయ ప్రయాసలతో అందుకు విడిగా ఒక యంత్రం దేనికి?

వేళాపాళా లేకుండా ఎప్పుడుపడితే అప్పుడు పనిచెయడం యంత్ర లక్షణం లోపలినుంచి వెల్లువవలె పెల్లుబికి రాక పోయినా, "కవిత్వం చెప్పండి." అనగానే చెప్పుకుపోవడం యాంత్రిక కవుల లక్షణం.

శుభాశుభ కార్యా లన్నింటివద్ద యాంత్రిక కవులు ప్రత్యక్ష మౌతారు అది ఏ మంత్రిగారి గృహంలోనో,ఏశ్రీమంతునిభవనంలోనో జరుగుతున్న శుభాశుభకార్యమైతే, అక్కడికి మరింతగా వారు విరగబడ తారు. ఒకరిపై పోటిగా మరొకరు గుక్కతిప్పుకోకుండా పద్యాలపై పద్యాలను గుప్పిస్తారు.

# శాఖా చంక్రమణం

"క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్" అని పెద్దనగారి సూక్తి రాజకియ వెత్తల చిత్తవృత్తి ఇందుకు భిన్నమైంది కాదు

శాఖాచంక్రమణం చేయడంలో కోతులు అందెవేసిన చేతులు ఏ ఒక కొమ్మమీద వాటికి కాలునిలువదు ఈ కొమ్మ నుంచి ఆ కొమ్మకు, దాని నుంచి దీనికి దూకుతూనే వుంటాయి వానర జాతి నుంచి నరజాతి ఉద్భవించిన మాట నిజమైనా కాకపోయినా, రాజకీయ వేత్తలు శాఖా చంక్రమణానికి సంబంధించినంత వరకు వానర లక్షణాలను పుణికి పుచ్చుకున్నవారే

వారిని గోడమీద పిల్లులతో కూడా పోల్చవచ్చు ఎటు వాటంగా వుంటే అటు దూరుతారు. ఏ ఒక్కనాడు ఫలానా వ్యక్తిని ఫలానా పార్టీ సభ్యుడని వర్ణించడానికి వీలు లేదు. పార్టీలోనే గ్రూపు లుంటే ఫలానా గ్రూపువాడనడానికి వీలులేదు ఈ వేళ ఒక పార్టీ, మర్నాడు మరొక పార్టీ ఈవేళ ఈగ్రూపు రెపు మరొక గ్రూపు రంగు మార్చనిదే, కోటు తిరగేయనిదె, ప్లేటు ఫిరాయించనిదే రాజకీయ వేత్త కాలెడు

రాజస్థాన్‌లో నలుగురు శాసన సభ్యులు కాంగ్రెసు పార్టీకి రాజీనామా పెట్టడానికి నిశ్చయించుకున్నారట ఇంతలోనే తిరిగి మనసు మార్చుకుని కాంగ్రెసులోనే వుండగలమని తెలియజేశారట

రెపు తిరిగి రాజీనామా చెయ్యడానికి వారు నిశ్చయిస్తే ఆశ్చర్యం లేదు. పాదరస మైనా నిలకడగా వుంటుందేమోగాని, రాజకీయవేత్తల నిర్ణయాలకు నిలకడలేదు గిరీశం భాషలో చెప్పాలంటే అదంతా పాలిటిక్స్ మహత్యం.

# మిశ్ర సంగీతం

పాశ్చాత్య సంగీతంలో నీగ్రో, ఆరబిక్, చైనీస్, జాపనీస్, సంగీత ధోరణులు ప్రవేశించి చాలాకాలమైంది, ఇప్పుడిప్పుడు భారతీయ రాగాలు, వాద్యాలుకూడా దానిలో ప్రవేశిస్తున్నవట

లండన్‌తో కుర్రకారును కడచిన వారం అపారంగా ఆకర్షించిన ఒక పాట బాణీ ఒక భారతీయ రాగంపై ఆధారపడినదేనట, దానికి ఉపయోగించిన వాద్యాలలో సితార్‌కూడా వున్నది

"బీటిల్స్" పేరుతో ప్రసిద్ధులైన నలుగురు యువగాయకుల మరొక పాటకు కూడా ప్రధానంగా సితార్ వాద్యమే ఉపయోగింపబడింది

భారతీయ సంగీతానికి, పాశ్చాత్య సంగీతానికి ప్రధానమైన కొన్ని విభేదా లున్నప్పటికి ప్రతిభాశాలుర చేతిలో అవి సమ్మిళితమై శ్రవణపేయంగా అలరారగల అవకాశం లేకపోలేదు సినిమాల ధర్మమా అని మన సంగీతంలోనికి పాశ్చాత్య బాణీలు చొచ్చుకు వస్తున్నాయి త్యాగరాజ కృతులలో సయితం కొన్నిటిలో పాశ్చాత్యపు పోకడలు కనిపిస్తాయని అనుభవజ్ఞులు చెబుతారు జాగ్రత్తగా, మోతాదుగా ఉపయోగించుకోవాలె గాని ఈ సంగీత సమ్మేళనం కొత్త రుచు లీనకపోదు

పండిట్ రవిశంకర్ వంటి సితార్ విద్వాంసుల కృషి ఫలితంగా యూరప్, అమెరికాలలో భారతీయ సంగీతంపట్ల అభిరుచి ఇప్పుడిప్పుడే కలుగుతున్నది అయితే ఈ ఆసక్తి కేవలం శాస్త్రీయసంగీతాభిమానులతోనే ఆగిపోకుండా యువతరానికి, ముఖ్యంగా "పాప్ మ్యూజిక్" అనబడే "ప్రజా సంగీతం" లోనికికూడా వ్యాపించడం చెప్పుకోదగు విశేషం ఈ ధోరణి మరింత ప్రబలితే ఉభయ సంగీత సంప్రదాయాల మధ్య చక్కని వారధి ఏర్పడినట్టే

# జైలు పక్షి

"ఎందుకైతే వుంచీనావో, బంది ఖానాలో " అని రామదాసు గారి వలె వాపోయేటట్టు చేయకపోతే ఇకజైలు దేనికి? నేరస్తులకు శిక్షలు దేనికి?

ఆస్ట్రేలియాలో ఒక గజదొంగ జైలు వదలి పోనంటున్నాడట వాడికి బయటకంటె జైలె బాగున్నదట. అసలు జైలులో పడడం కోసమే దొంగతనం చేశానని వదిలేస్తే మళ్ళీ నేరంచేసి మళ్ళీ జైలుకు రాగలనని బెదిరిస్తున్నాడట వాడిని వదిలించుకోవడం అధికారులకు పెద్ద సమస్య అయిపోయింది

వాడికి బయట ప్రపంచమే జైలుగాను, జైలె బయటి ప్రపంచమంత స్వేచ్ఛగాను కనిపిస్తున్నదేమో. వాడు వుంటున్న జైలులో కడుపు నిండా తిండి, చేతినిండా పని, గాలి, వెలుతురు, విశ్రాంతి, ఒక పద్ధతి, క్రమం - ఇన్ని వుంటే అలా కనిపించదా మరి?

టాల్‌స్టాయ్ కథలో ఒక చిన్న రాజ్యంలో ఒక నేరస్తుడికి యావజ్జీవితం శిక్ష వేస్తారు తీరా వాడిని యావజ్జీవితం పోషించడానికయే ఖర్చు అంచనా వేస్తే, ఆ రాజ్యానికి వచ్చే ఆదాయం చాలదు ఇదంతా దేనికని వాడిని వదిలిపెడతారు వాడు జైలునుంచి పోకుండా శిక్షే అనుభవిస్తానంటాడు చివరికి ఎదురు డబ్బిచ్చి వాడిని వదిలించుకుంటారు ఆస్ట్రేలియన్ అధికారులు కూడా ఇలాగే చేయవలసి రావచ్చు.

అందుకే, జైళ్ళను మరీ ఆదర్శప్రాయంగా వుంచినా చిక్కే మరి బయటకంటె జైలు హాయిగా వుంటే నేరాలు బలిసి పోయినా పోవచ్చు నరకాన్ని మనవాళ్ళు దేనికంత భయంకరంగా వర్ణించారు? అదంతే భయం పుట్టించి పాపాలు తగ్గించడానికేగా? అంతగా కాకపోయినా తగు మాత్రంగానైనా ఇబ్బందులు ఏర్పాటుచేయకపోతే చెరసాలన్నే చిరకాలంగా కోరుకోరా నేరస్తులు?

# సోఫియా లోరెన్ చిట్కాలు

పురుషుడిని స్త్రీ వశపరుచుకోవడ మెలా? ఏమిచేస్తే పురుషుడు స్త్రీకి దాసుడై పోతాడు ఇవి యుగయుగాలుగా స్త్రీలను వేధిస్తున్న ప్రశ్నలు ఇందుకోసం వశీకరణ తంత్రాల పేరుతో జుగుప్సాకరమైన పద్ధతులెన్నో పూర్వకాలంలో వుండేవటకూడా

ప్రసిద్ధ చలనచిత్రతార సోఫియా లోరెన్ మొన్న న్యూయార్కులో తనకేదో సన్మానం జరిగిన సందర్భంలో ఇదే విషయంపై తాను కను గొన్న ఐదు సూత్రాలను ప్రకటించింది వీటిని స్త్రీలపాలిటి "పంచ శీల"గా పేర్కొనవచ్చు వీటి సారాంశం క్లుప్తంగా ఇది

స్త్రీ తన శారీరక, తదితర ఆకర్షణలను ఒక్కసారిగా పురుషుని ముందు వ్యక్తం చేయరాదు అతని భావనాశక్తికి పని కలిగేట్టు చేయాలి తనపట్ల ఆసక్తిని పెంపొందించాలి తన అసలు వ్యక్తిత్వం ఇంకెంత మహత్తరమైనదో అనే ఉత్కంఠను ప్రేరేపించాలి అప్పుడామెపై పురుషుని మోజు తగ్గదు

స్త్రీలకు "ఫెయిర్ సెక్స్" అని ఇంగ్లీషులో బిరుదున్నా అది సర్వత్రా నిజంకాదు పురుషుని అనురక్తికి స్త్రీ వాహ్య సౌందర్యమే కారణం కానక్కరలేదు కూడా దాన్ని మించిన ఆకర్షణశక్తి ఏదో ఆమెలో వుండవచ్చు దాన్ని సరైన విధంలో ఉపయోగించినప్పుడు పురుషుడామెకు వశుడై పోక తప్పదు

ప్రఖ్యాత పారసిక కావ్యం "లైలా మజ్నూ"లోని లైలా అంద గత్తె కానే కాదట అయినా, ఆమెను ఎందుకు అంత గాఢంగా ప్రేమి స్తున్నావని ఎవరో అడగ్గా "నా కళ్ళతో చూస్తే ఆమె సౌందర్యం కనబడు తుంది" అని మజ్నూ సమాధానం చెప్పాడట అందుకే "తా వలచింది రంభ తా మునిగింది గంగ" అనే లోకోక్తి వచ్చింది

హాలీవుడ్ చలనచిత్రసీమ విడాకులకు ప్రసిద్ధి కెక్కింది బహుశా అక్కడి స్త్రీ తారలకు సోఫియా లోరెన్ చిట్కాలు తెలియకపోవడం ఇందుకు కారణమేమో! లేదా, అక్కడి అసలు సమస్య పురుషులపై స్త్రీల మోజు తగ్గకుండా చేయడ మెలాగన్నది కావచ్చు. ఇందుకోసం ఏ ప్రసిద్ధ నటుడో పురుషులకు ప్రత్యేకించి వేరొక "పంచశీల"ను ప్రక టించడం మంచిదేమో

# కొత్తరకం విమర్శ

విమర్శ చాలా రకాలుగా వుండవచ్చు చాలా రూపాలలో వ్యక్తం కావచ్చు

ఆస్ట్రేలియాలో వారం, పదిరోజుల క్రిందటినుంచి కొత్త ద్రవ్యమానం అమలులోకి వచ్చింది పౌనులు, షిల్లింగులు, పెన్నీల స్థానంలో డలర్లు, సెంట్లు వచ్చాయి ఇంగ్లండువంటి కొద్ది దేశాలను మినహాయిస్తే ఒకటొకటిగా పెక్కు ఇతర దేశాలు క్రమంగా దశాంశ పద్ధతికి మారుతున్నాయి పాత పద్ధతులలోకంటె దీనిలో ఎక్కువ సౌలభ్యం వుండడం వల్లనే ఈ మార్పు జరుగుతున్నది.

అయితే, కిమ్ టేలర్ అనే ఆరేళ్ళ ఆస్ట్రేలియన్ బాలికకు ఈ మార్పు సుతరామూ గిట్టలేదు ఒక కొత్త నాణాన్ని—అది చెలామణిలోకి వచ్చిన కొద్ది గంటలలోనే—ఆ పిల్ల మింగివేసిందట ఆ విధంగా ఆమె తన అసమ్మతిని వ్యక్తంచేసింది

ఇండియాలో కూడా దశాంశ ద్రవ్యమానం వచ్చి పదేళ్ళయినా, ఇప్పటికీ దానితో రాజీ పడలేనివారు అడపా తడపా తారసిల్లుతూనే వుంటారు అప్పటిలో దాన్ని తీవ్రంగా గర్హించినవారిలో రాజాజీ ఒకరు ఆ పద్ధతి మనకు తగదని నిరూపించడానికి ఆయన చాలా శ్రమపడ్డారు

రాజాజీ మేధాశక్తి అతి నిశితమైనది అది రెండువైపుల పదునుగల కత్తివంటిది ఎటొచ్చీ, నాణాలకు కూడా రెండువైపు లుంటాయి ఆయన ఒకవైపే చూసి విమర్శిస్తారు అందుకే ఆయన ఏమి విమర్శించినా, ఇండియాలో దశాంశ పద్ధతి మానాలు వాడుకలోకి రావడం, వాటికి దేశం అలవాటు పడడం జరుగుతున్నది

ఆస్ట్రేలియన్ బాలిక రాజాజీకంటె మాటుగా సూటిగా తన విమర్శను వెల్లడించినా, ఆ దేశ ప్రభుత్వం అభ్యుదయకరమైన ఈ కొత్త మార్పును విడనాడబోదనే అనుకోవచ్చు

# రజ్జు సర్ప భ్రాంతి!

వర్తమాన కాలాన్ని ఏ దృష్టితో చూస్తే ఆ యుగంగా వర్ణించవచ్చు కొందరు ఇది ప్రజాస్వామిక యుగమంటారు, కొందరు పారిశ్రామిక యుగమంటారు మరికొందరు అణుశక్తి యుగమంటారు. ఈ మధ్యనే రోదసీ యుగంగా వర్ణించడం కూడా ప్రారంభమైంది

మనదేశానికి సంబంధించినంత వరకు ఈ కాలాన్ని కల్తీ యుగమనికూడా అనవచ్చు సాధారణంగా కల్తీ జరగని పదార్థమంటూ దొరకడం కష్టమవుతున్నది పాలలో కల్తీ, నేతిలో కల్తీ, నూనెలో కల్తీ, బియ్యంలో కల్తీ,మందులలో కల్తీ,ఎరువులలో కల్తీ ఇలాగ ఈ జాబితాను ఎంతైనా పొడిగించవచ్చు

ఎరువుల కల్తీ సాధారణంగా జరుగుతున్నదే కాని, లారీలకు లారీల ఎరువులె మొత్తంగా మాయమవడం విడ్డూరం. నెల్లూరు జిల్లాలో ఒక చెక్‌పోస్టు వద్ద ఎరువులతో వెడుతున్న నాలుగు లారీలను తనిఖీ చేయగోరిన వ్యవసాయశాఖ విస్తరణాధికారి వాణిజ్యం పన్ను అధికారి నుంచి లిఖిత పూర్వకమైన అనుమతి పొంది వచ్చేలోగా ఆ ఎరువులు ఉప్పుగా మారిపోయినవట మొన్న అసెంబ్లీలో వెల్లడైన ఈ ఉదంతం శాసన సభ్యులకే కాక ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది

కాని నిజంగా ఆశ్చర్యపడ వలసిందేమీ లేదేమో చీకటిలో త్రాడును చూసి పాముగా భ్రమించవచ్చు, పామును త్రాడుగా భ్రమించవచ్చు దీనినే రజ్జు సర్ప భ్రాంతి అంటారు దీన్ని ఆధారం చేసుకునే శంకరుడు తన వేదాంత శాస్త్రమంతా నిర్మించాడు

ఇలాగే "ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు" అనే నానుడి వుంది కాని ఉప్పుపోలికలోకర్పూరమేకాదు అమ్మోనియంసల్ఫేట్ కూడా వుండవచ్చు ఈ పోలిక మూలంగా ఎంత గందరగోళమైనా జరగవచ్చు

బస్తాలలో నిజంగా ఉప్పేవున్నా ఎరువులని భ్రమించి తనిఖీ చేస్తే ఉప్పుగా తేలవచ్చు నిజంగా ఎరువులే వున్నా ఉప్పుగా భ్రమించి ఉప్పేనని తేల్చవచ్చు లేక ఉప్పు, ఎరువులు కలిసి వుంటే ఒకసారి ఎరువులుగా, మరొకసారి ఉప్పుగా భ్రమించవచ్చు. ఇదేదీ కాక వ్యవసాయశాఖ అధికారి వాణిజ్యం పన్ను అధికారి కోసం వెళ్ళి వచ్చేలోగా ఎరువుల బస్తాలు ఉప్పు బస్తాలుగా నిజంగానే మారిపోయి వుండవచ్చు ఇంత కంటె విడ్డూరాలు ఈరోజులలో ఎన్ని జరగడంలేదు

# అమాత్యాల అర్హతలు

మంత్రికి కావలసిన అర్హత లేవి? ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డి ఈ ప్రశ్న వేసుకుని తామే సమాధానం చెప్పారు.

ఎవరైతే ఏ సభలోనైనా, దేనిపైనైనా సాధికారంగా ప్రసంగించ గలరో వారే ఉత్తమ మంత్రులు సరిగా ఈ మాటలలో కాదుగాని, ఈ తాత్పర్యం వచ్చే విధంగా ఆయన నిర్వచించారు

దీనికి ఉదాహరణగా—మరాఠీ సాహిత్య సమ్మేళనంలో పాల్గొన డానికి వచ్చిన తమనే ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

ఆయన ఛలోక్తిగానే ఈ నిర్వచనం చెప్పి వుండవచ్చు. కాని, చాల మంది దీన్ని నిజంగానే నమ్ముతున్నా రనిపిస్తుంది

లేకపోతే, రాజకీయ సభ కానివ్వండి, సాహిత్య సమ్మేళనం కానివ్వండి, సంగీత సదస్సు, నాటక ప్రదర్శన, చలన చిత్ర శత దినోత్సవం, ఫలానావారి జన్మదినం, ఫలానా హోటల్ ప్రారంభం, ఫలానా భవన శంకుస్థాపన ఏదైనా కానివ్వండి-ప్రతి సందర్భానికి మంత్రులను లేదా ఇతర పదవులలో వున్న రాజకీయ వేత్తలను ఇంత తరచుగా ఆహ్వానించడం జరగదు

చిత్రమేమిటంటే, ఈ ఆహ్వానాలను అంతే తరచుగా, మంత్రులు కూడా మన్నించడం తమకు సర్వజ్ఞత్వాన్ని ఆపాదించే వారుండగా అంగీకరించడానికి మొగమాటం దేనికి? ఎటొచ్చీ, సర్వజ్ఞులు కారు కనుక, అది రాజకీయ సమావేశమైనా సాహిత్య సభ అయినా మరేదైనా వారు తమకు తెలిసిన విషయాలపైనే ప్రసంగిస్తారు అవి సాధారణంగా రాజ కీయాలే అయివుంటాయి ఒకవేళ అసలు విషయంపై మాట్లాడినా దానికి వారి పదవితో సంక్రమించే విలువ తప్ప సాధారణంగా మరొకటి వుండదు ఈ విషయాన్ని ధ్వనిప్రాయంగా నైనా ముఖ్యమంత్రి ఒప్పు కొనడం వారి సరసతకు, సహృదయతకు నిదర్శనం

# "పాలకోసం నీళ్ళమోత"

రాజకీయ నాయకులకు మరేమి ఉన్నా, లేకపోయినా ఆత్మ విశ్వాసం మట్టుకు పుష్కలంగా వుంటుంది ముఖ్యంగా తాము వేదికల నాక్రమించి తరుచుగా, గంటల తరబడి చేసే ప్రసంగాలు శ్రోతలను ముగ్ధులను చేస్తున్నవనే భావిస్తారు ఈ భ్రమ లేకపోతే వారు అంత సుదీర్ఘంగా, చర్విత చర్వణంగా ఉపన్యాసా లివ్వలేరేమో!

అయితే, జెరాడ్ వెర్మెత్ అనే కెనేడియన్ రాజకీయ నాయకునికి అట్టి నమ్మకం లేకపోయినట్టుంది కన్సర్వేటివ్ పార్టీ అభ్యర్థిగా తాను ఎన్నికలకు నిలబడుతున్న సందర్భంలో ఆయన మాంట్రియల్ సమీపంలోని ఒక పట్టణంలో ఒక సభను ఏర్పాటు చేశాడు, సభికులను ఆకర్షించడంకోసం బ్రిజిత్ బార్డో అనే ఫ్రెంచి తార నటించిన ఒక చలనచిత్రాన్ని ఉచితంగా చూపిస్తామని ప్రకటించాడు ఫ్రాన్సు దేశపు మేరిలిన్ మన్రోగా ప్రఖ్యాతిపొందిన ఆమె చిత్రం చూడ్డానికి జనం బాగా వచ్చారు

తీరా వచ్చిన తరువాత ప్రదర్శనను మధ్యలో రెండుసార్లు ఆపి రెండు సుదీర్ఘ రాజకీయ ప్రసంగాలను ఆయన వినిపించాడట సినిమా తరువాయి భాగం కోసం సభికులు ఆ ఉపన్యాసాలను విసుగుతోనైనా భరించక తప్పలేదు.

రాజకీయ సభలకు ప్రజలను ఆకర్షించడానికి ఇదొక పద్ధతి మన దేశంలోకూడా నాయకులు సభలకు రావడానికి కనీసం గంట, రెండు గంటలకు ముందునుంచీ గ్రామొఫోన్ రికార్డులను మైక్‌ల ద్వారా ప్రసారం చేసి ఊదరబెట్టడం అలవాటవుతున్నది అయితే, కెనేడియన్ అభ్యర్థి చేసినట్టు, ఉచితంగా చలనచిత్ర ప్రదర్శన, మధ్య మధ్యలో రాజకీయ ప్రసంగాలవరకు మనం "పురోగమించలేదు—" బహుశా మన నాయకులకు మేము పైన పేర్కొన్న ఆత్మ విశ్వాసం ఎక్కువ కావడం వల్లనేమో!

# ముస్తాబుపై నిషేధం

స్త్రీలకు సౌందర్యపోషణ వాంఛ స్వభావసిద్ధమైనది లేని అందాన్ని తెచ్చిపెట్టుకొనడానికి కొందరు యత్నిస్తే, ఉన్న అందాన్ని ఇనుమడింపజేసుకొనడానికి మరికొందరు యత్నిస్తారు దీనికోసం వారు రోజుకు అరగంట నుంచి ఎన్ని గంటలైనా వినియోగించుకోవచ్చు

ముస్తాబుపై మోజు ఏ కొన్ని దేశాలకో, కొన్ని కాలాలకో పరిమితమైంది కాదు మానవజాతి అనాగరిక దశలోవున్న ఆదిమ కాలం నుంచి నేటివరకు అన్ని కాలాలలో, అన్ని దేశాలలో వున్నదే వెండి బంగారాలు, రత్న మాణిక్యాలు లేకపోయినా, కనీసం పువ్వులతోనైనా అలంకరించుకొనడం జరిగేది అలకాపురిలోని అంగనలు హస్తాలలో లీలా కమలాలు, ముంగురులపై కుందకుసుమాలు, ఇలాగ శరీరమంతా పూలతో అలంకరించుకొనడంతో పాటు, లోధ్ర పుష్పాల పొడిని ఫేస్ పౌడరుగా వాడుకొనేవారని కాళిదాసు వ్రాశాడు

ఆ కాలం వేరు, ఇప్పుడు అసూర్యంపశ్యలైన స్త్రీలు వుండడానికే వీలులేదు అన్ని ఉద్యోగ రంగాలలో వారు పురుషులతో సమానంగా పని చేస్తున్నారు అయితే, వారు తమ అలంకరణ ప్రియత్వాన్ని ఆఫీసులలోనికికూడా తీసుకుపోవడం ఈ మధ్య ఒక లండన్ కంపెనీ యజమానికి బాధ కలిగించిందట తన ఆఫీసులో పనిచేసే వనితలు మాటిమాటికి అద్దం చూచుకొనడం, మేకప్ సరిదిద్దుకొనడంతో కాలం వృధా చేస్తున్నారని గ్రహించి, పనివేళలో ముస్తాబును నిషేధించాడట దీనివల్ల ఉత్పత్తి పదిశాతం పెరుగుతుందని ఏడాదికి లక్ష పౌనుల రాబడి పెరుగుతుందని, వారికి అప్పుడు ఎక్కువ జీతాలివ్వడం సాధ్య మవుతుందని అతడు ఎరచూపాడట

అతని ఆఫీసులోని ముప్పయిమంది స్త్రీలే కాదు, మరెవరైనా అధిక వేతనాలపై ఆశతో అలంకరణ ప్రియత్వాన్ని విడనాడగలరనుకోవడం పొరపాటేనేమో అద్దం అబద్ధమాడుతుందా అని సామెత కాని ఎంత అతిలోక సౌందర్యవతి చేతి అద్దమైనా అబద్ధమే ఆడుతుంది అందుకే స్త్రీలు అన్నేసి గంటలు అద్దాలముందు గడపడం

# నిద్రకు పుస్తకాలు

నిద్ర పట్టకపోవడానికి చాలా కారణా లుండవచ్చు అజీర్తి చేస్తే నిద్ర పట్టదు పైత్యం ప్రకోపిస్తే నిద్రరాదు మానసి కాందోళనవల్ల నిద్ర పట్టకపోవచ్చు క్రోధం, భయం మొదలైన వాటివల్ల మనస్సు ఆందోళితమై నిద్ర చెడిపోతుంది

ప్రసిద్ధ శాస్త్రవేత్త డాక్టర్ సి వి రామన్ మొన్న బెంగుళూరులో నిద్రకు కొత్త రకం ఔషధాన్ని సూచించారు ఉత్తమ గ్రంధాలను చదవడంవల్ల నిద్ర బాగా పడుతుందని ఆయన సలహా

అయితే ఏవి ఉత్తమ గ్రంధాలనేది వివాదాస్పద విషయం కొందరికి ఉత్తమమైనవి మరికొందరికి కాకపోవచ్చు డాక్టర్ రామన్ సూచించినవి రామాయణం, మహాభారతం బుద్ధుని ప్రవచనాలు మొదలైనవి ఇటువంటి వాటిని చదవడంవల్ల మనస్సు తేలికపడి, ప్రశాంతమై సుఖనిద్ర పడుతుందని ఆయన భావం కావచ్చు

కాయకష్టం చేసేవారికి త్వరగా, గాఢంగా నిద్రపడుతుంది అదే విధంగా మానసిక శ్రమ చేసెవారికి కూడా త్వరగా నిద్రపడుతుంది అందుచేత రాత్రివేళ పుస్తక పఠనంవల్ల మెదడు అలసిపోయి నిద్రపట్టవచ్చు

ఈ సూత్రాన్ని బట్టి, చదివే పుస్తకాలు ఎంత బాగా మెదడును అలసిపోయేట్టు చేయగలిగితే అంత ఉపయోగిస్తాయన్నమాట చదివేది చప్పున బోధపడక, అడుగడుగున ఆలోచించ వలసిన అవసరం కలిగితే మెదడు అలసి పోతుంది లేదా, ఆసక్తి కలిగించని, విసుగు పుట్టించే పుస్తకమైతే మెదడు అలసిపోతుంది కొందరికి రామాయణ, భారతాలు చదివితే వెంటనే నిద్ర రావచ్చు కొందరి కేవైనా వైజ్ఞానిక గ్రంధాలు చదువుతుంటే తెలియకుండానే నిద్రపట్టవచ్చు విద్యార్థులు పాఠ్య పుస్తకాలు చదువుతూ కునికిపాట్లు పడడానికి ఇదే కారణమేమో ఎప్పుడూ తత్వ, గణిత శాస్త్రాల సమస్యలతో సతమతమయ్యే బెర్ట్రాండ్ రస్సెల్ వంటి విజ్ఞాని తాను నిద్రపట్టడానికి డిటెక్టివ్ నవలలు చదువుతానని చెప్పుకున్నాడు

లోకో భిన్న రుచిః ఏమైనా బాగా నిద్రపట్టనివారు నిద్రమాత్రలతో ఆరోగ్యాన్ని చెడగొట్టుకునే బదులు డాక్టర్ రామన్ సలహా పాటించడం మంచిది ముఖ్యంగా విసుగు పుట్టించే పుస్తకాలు ఎన్నుకుంటే ఇంకా మేలు

# బంగారం బాట

లోహాలకు రాణివంటిది బంగారం మణులలో గొప్పది సువర్ణభస్మం యుగాలలో గొప్పది స్వర్ణయుగం చరిత్రలో గొప్ప సంఘటనలు సువర్ణాక్షరాలతో లిఖించదగినవి

ప్రతి తల్లి తన బిడ్డను నా బంగారుతండ్రి, నా బంగారుకొండ అనే పిలుస్తుంది. ఇప్పటికీ పాతకాలపు వాళ్ళు ఓరి నీ కడుపు బంగారంగాను, అనే దీవిస్తారు పరుసవేది అనే శిలతో సాధారణ లోహాలను బంగారంగా మార్చవచ్చునని పూర్వకాలంలో నమ్మేవారు, సువర్ణ యోగులమని పేరు పెట్టుకుని కొందరు కపట సన్యాసులు ఇప్పటికీ జనాన్ని అక్కడక్కడ మోసగిస్తూనే వుంటారు

బంగారంపై ఇంత మోజు ఎప్పటి నుంచి మొదలైందో,ఎందుకు మొదలైందో, బహుశా అది మానవుని కంటపడిన తొలి దినాల నుంచి ఈ వ్యామోహం మొదలై వుండవచ్చు మెరిసేదంతా బంగారం కాక పోయినా, బంగారం మెరుస్తుంది కనుక దాని పట్ల మోజు బయలుదేరి వుండవచ్చు సువర్ణం అంటే మంచి రంగు అనే అర్థం అది ప్రకా శిస్తుంది కనుకనే కనకం, కాంచనం మొదలైన పేర్లు కూడా వచ్చాయి

మెరిసే లోహమే కాక, అపురూపమైనది కావడంవల్ల కూడా బంగారం ఇంత వ్యామోహజనకమై వుండవచ్చు ఎక్కడో చదివిన జ్ఞాపకం నేలంతా బంగారమై మట్టి బంగారమంత అపురూపమైతే పిడి కెడు మట్టి కోసం మానవులు కొట్టుకుచస్తారని

బంగారం మీద ఇంత మోజు వుంది కనుకనే, అమెరికా రాజధాని వాషింగ్టన్‌లోని ఒక రోడ్డు వార్తల కెక్కింది ఆ రోడ్డు బంగారపుదట అంతా బంగారమని కాదు, దానిపై వేసిన కంకరలో బంగారం ఎలాగో కలిసి, ధగధగ మెరిసిపోతున్నదట, ఒక ఘనపు టడుగు మేరను శుద్ధి చేస్తే ఒక డాలరు బంగారం కూడా రాదు కనుక, దాన్ని అలాగే వుంచి వేశారట ఏమైనా అది బంగారపు రోడ్డే అందుచేత అసలే భాగ్యవంతు లైన అమెరికావారు ఇకపై తమ రోడ్లు కూడా బంగారపు రోడ్లేనని గొప్పగా చెప్పుకోవచ్చు

# ఏకాగ్ర మనస్కత

జూలియస్ సీజరు, నెపోలియను ఒకే సమయంలో పెక్కు పనులు చేయ గలిగేవారని ప్రతీతి ఇది కేవలం అపోహ మాత్రమేనని రష్యన్ డాక్టర్లు ప్రకటించారు.

మానవుని మనస్సు ఒకసారి ఒక్క విషయం మీదనే లగ్నం కాగలదట ఏక కాలంలో అనేక విషయాలలో అది మగ్నం కాలేదట ఎంత మేధావికైనా అది సాధ్యం కాదని వారి పరిశోధనలలో తేలిందట

కాని, దీని కోసం లేబరేటరీలలో పరిశోధన చేయాలా? విద్యార్థులకు ఇది అనుభవంలోకి వచ్చే విషయమే కాదా? పుస్తకం ముందు కూర్చుంటే పేజీలు తిరిగిపోతూనే వుంటాయి మనస్సు మాత్రం పరిపరివిధాల- ఆ క్రిందటి రోజున చూసిన సినిమా మీదికో, కాలేజీ జూలియట్ మీదికో, ఉక్కు ఫ్యాక్టరీ సమస్య మీదికో పోతూవుంటుంది ఒక్క సారిగా ఇన్ని విషయాలను ఆలోచిస్తూనే పాఠాన్ని అవగాహన కూడా చేసుకోగలిగితే ఉత్తీర్ణులయ్యే విద్యార్థుల సంఖ్య ఎంతైనా పెరిగిపోదా ?

కాని, రష్యను డాక్టర్ల పరిశోధనా ఫలితాన్ని మనవాళ్ళు అంగీకరించక పోవచ్చు మనకు అష్టావధానులు, శతావధానులు, సహస్రావధానులు కూడా వున్నారు అష్టావధానులు ఏకకాలంలో చదరంగం ఆడతారు, పద్యం పూరిస్తారు పువ్వులో, గంటలో లెక్క పెడతారు, ఇంకేవేవో చేస్తారు అదొక అద్భుత ప్రక్రియే అటువంటి వారి మనస్సులను కూడా పరిశోధించి రష్యన్ డాక్టర్లు ఒక నిర్ణయనికి రావడం మంచిది!

చైనావారు కూడా అంగీకరించక పోవచ్చు వారిదృష్టిలో సీజరు, నెపోలియన్‌ల కంటె, ప్రపంచంలో ఇప్పటివరకూ పుట్టిన మహామహు లందరి కంటె మావో గొప్పవాడు కదా? ఆయనకు సాధ్యం కాని పని వుంటుందా? అందుచేత రష్యన్ డాక్టర్ల పరిశోధన కేవలం "రివిజనిష్టు" ధోరణిలో వున్నదని వారొక ప్రకటన చేసినా అబ్బురం లేదు

# చైనాలో షేక్స్పియర్

సాంస్కృతిక విప్లవం పేరిట చైనాలో రెడ్ గార్డులు షేక్స్పియర్, హ్యూగో మొదలైన ప్రసిద్ధ రచయితల గ్రంథాల ప్రతులను వేలాదిగా దగ్ధం చేశారట ఇది ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన "సాహిత్య దహనం"గా శ్రీ కె పి ఎస్ మీనన్ మొన్న న్యూఢిల్లీ సభలో వర్ణించారు

షేక్స్పియర్‌ను విమర్శల కతీతుడుగా మాథ్యూ ఆర్నాల్డ్ కీర్తించాడుగాని ఆయనను టాల్‌స్టాయ్, బెర్నార్డ్ షాల వంటి వారు కొందరు విమర్శించక పోలేదు నైతిక దృష్టినుంచి చూస్తే షేక్స్పియర్ రచనకు విలువ లేదని వారి విమర్శ అయితే చైనీస్ రెడ్ గార్డుల దృష్టిలో షేక్స్పియర్ కేవలం బూర్జువా రచయిత,

మరి ఈ బూర్జువా రచయితనే కమ్యూనిజం ప్రవక్త మార్క్స్ అమితంగా అభిమానించేవాడు ఇంగ్లండు చరిత్రను షేక్స్పియర్ నాటకాలనుంచే తాను ఎక్కువగా తెలుసు కొన్నానని ఆయన అనేవాడట తన పరిశోధనలతో అలసి సొలసి పోయిన తర్వాత ప్రతి సాయంకాలం కాలక్షేపానికి తన కుమార్తెలతో "షేక్స్పియర్ ఆట" (ఏ వాక్యం ఏ నాటకంలోనిదో కనిపెట్టడం) ఆడుకునేవాడట

మరి మార్క్స్ అనుయాయులమని చెప్పుకుంటున్న రెడ్‌గార్డులకు షేక్స్పియర్ ఎందుకు పనికి రాలేదో? మరి కొన్నాళ్ళు పోతే వారు మార్క్స్ రచనలనే తగలబెట్టినా ఆశ్చర్యం లేదు.

సూర్యుని మీద దుమ్ము చల్లితే, చల్లిన వారి కళ్ళలోనే పడుతుంది షేక్స్పియర్ రచనలను దగ్ధంచేస్తే షేక్స్పియర్ కేమీ నష్టంలేదు ప్రపంచంలో సాహితి ప్రియులున్నంత కాలం ఆయన రచనలు నిత్య నూతనంగా భాసిస్తూనే వుంటాయి వాటిని నిషేధించడం వల్ల ఆ మేరకు నష్టపడేది చైనావారే

# కళా ప్రతిభ

ఏ కళలోనైనా ప్రతిభ నైపుణ్యం జన్మతః రావలసిందే తప్ప ప్రయత్నించి నేర్చుకుంటే వచ్చేది కాదని చాలమంది నమ్ముతారు కాని, సోవియట్ డాక్టరొకాయన చెబుతున్న పద్ధతిని అనుసరిస్తే ఎందరినైనా ఉత్తమ కళాకారులను తయారుచేయడం సాధ్యపడేట్టు కనబడుతున్నది

ఆయన పద్ధతి ఇది చిత్రలేఖనంలో అభిరుచివున్న వ్యక్తిని హిప్నొటైజ్ చేసి, ఆ వ్యక్తికి అభిమానపాత్రుడైన ఏ పూర్వ చిత్రకారుడో ఆవేశించేట్టు చేయాలి అప్పుడు ఆ వ్యక్తి అద్భుతంగా చిత్రరచన చేయడం సాధ్యం కాగలదట

అలాగే సంగీతంలో అభిరుచివున్న వ్యక్తిని ఏ గొప్ప పూర్వ గాయకుడో ఆవేశించేట్టు హిప్నొటైజ్ చేస్తే ఆవ్యక్తి అద్భుతంగా పాడడం సాధ్యం కాగలదట ఇలాగే ఏ కళలోనైనా ఫలితాలు సాధించవచ్చునట ఇలా కొన్నాళ్ళు హిప్నొటైజ్ చేస్తూ పోతే ఆయా కళలలో వారికి ప్రావీణ్యం స్థిరపడి పోతుందట

ఇది సులువైన పద్ధతే హిప్నొటైజ్ చేయగలవారిని సంపాదించాలే గాని, ఉత్తమ కళాకారులను కర్మాగారాలలో వస్తువులను భారీయెత్తున ఉత్పత్తి చేసినట్టు తయారు చేయవచ్చు

చాలమంది తల్లిదండ్రులు తమ ఆడపిల్లలకు సంగీతం వచ్చే యోగ్యత లేకపోయినా, మేష్టరునుపెట్టి సంగీతం సాధన చేయిస్తూవుంటారు ఇంటిలోని వారిని, ఇరుగు పొరుగుల వారిని నానా బాధ పెడుతూ వుంటారు అటువంటివారు సోవియట్ డాక్టరు సూచిస్తున్న హిప్నొటిజం పద్ధతిని అనుసరిస్తే ఇట్టే తమ పిల్లలను సంగీత పండితులుగా తయారు చేయవచ్చు

# దాచినా దాగని నిజం

బిచ్చగాళ్ళకు మాత్రం ప్రాథమిక స్వత్వాలుండవా? ఢిల్లీ మేయరు ఛలోక్తిగా ఈ ప్రశ్న వేశారు

ఢిల్లీలో వచ్చే మార్చిలో జరుగనున్న టూరిస్టు వారోత్సవ సందర్భంలో చారిత్రకమైన కట్టడాలవద్ద బిచ్చగాళ్ళు లేకుండా చేయాలని ఒక సూచన రాగా ఆయన ఈ ప్రశ్న వేశారట

నిజమే మన దేశంలో, పదిమంది చేరే ప్రతిచోట బిచ్చగాళ్ళు తయారవుతారు పుణ్యక్షేత్రాలవద్ద వీరి సంఖ్య మరీ అధికమైనా హోటళ్ళు, బస్సు స్టాండులు, సంతలు మొదలైనచోట్ల కూడా తక్కువ కాదు

ఇంతగా విచ్చలవిడిగా, గుంపులు గుంపులుగా బిచ్చగాళ్లు విహరించె దేశం ఇండియా తప్ప మరొకటి లేదేమో నానాటికి వీరి సంఖ్య ఎక్కువైపోతున్నదికూడా మనకు ప్రతి దినం కనబడే దృశ్యం కనుక వీరిపై మన దృష్టి పోవడం లేదుగాని, కొత్తగా మన దేశం వచ్చిన ప్రతివారికి ముందుగా ఎదురయ్యేది, జుగుప్స కలిగించేది బిచ్చగాళ్ళ దృశ్యమే

ఇండియాలో బిచ్చమెత్తడం ఒక కులవృత్తిగా, కళగా, శాస్త్రంగా కొన్నికొన్ని చోట్ల లాభసాటి పరిశ్రమగా కొన్ని శతాబ్దాలుగా వర్ధిల్లుతున్నది దాన్ని సమూలంగా నిర్మూలించడానికి ప్రయత్నాలు జరగాలిగాని, విదేశీయుల కంటపడకుండా దాచివేసినంత మాత్రాన ఇండియాలో బిచ్చగాళ్ళు లేరన్న భ్రమ కలిగించడం సాధ్యమా?

# వృథా వ్యయం

"రాజుల సొమ్ము రాళ్ళ పాలు" అని సామెత ఈనాడు రాజులు లేరు కనుక. "ప్రజల సొమ్ము ఫైళ్ళ పాలు" అని ఈ సామెతను మార్చాలి

పూర్వం రాజుల సొమ్ము కనీసం రాళ్ళ పాలైనా అయ్యేది. ఆ రాళ్ళు గుడుల రూపంలో, గోపురాల రూపంలో శత్రు దుర్భేద్యమైన కోటల రూపంలోనైనా పదికాలాలపాటు నిలిచేవి ఆ సొమ్ము కళాపోషణ కైనా సద్వినియోగ మయ్యేది

ఈనాడు అలా కాదు ప్రజల సొమ్ము ఎందుకూ పనికిరాని చిత్తు కాగితాల పాలైపోతున్నది

దీనికి ఉదాహరణగా కోర్బా ఎరువుల కర్మాగారాన్ని చూడవచ్చు కేంద్ర ప్రభుత్వం ఈ ఫ్యాక్టరీని అనుమతించక పోతుందా అనే ధీమాతో ఫెర్టిలైజర్ కార్పొరేషన్ దానిపై పని ప్రారంభించింది ఇప్పటికి కోటి రూపాయల ఖర్చుతో కొంత పనికూడా జరిగింది ఇప్పుడది లాభసాటి కాదనే సాకుతో ఆర్థిక మంత్రిత్వ శాఖ దాన్ని తిరస్కరించాలని ఆలోచిస్తున్నదట

ఈవిధంగా ఎన్ని స్కీములు, ప్రాజెక్టులపై వృథా వ్యయం జరుగుతున్నదో? ప్రాజెక్టుల మంచి చెడ్డల పరిశీలనకు నిపుణులను నియమించడం, వారి నివేదిక అందిన తరువాత దాన్ని బుట్ట దాఖలు చేయడమో, లేక ఏళ్ళ తరబడి ఫైల్స్‌లో భద్రపరచడమో—ఈ విధంగా ఎన్ని కమిటీలు, సబ్ కమిటీలు,కమిషన్‌లపై ఇప్పటివరకు ఎంత ధనం వృథా అయినదో లెక్కలు వేయడం ఎవరి తరం?

# జ్ఞాపకశక్తి

ఒక ఆస్ట్రేలియన్ పోలీసు అధికారి పందొమ్మిదేళ్ళుగా తాము వెదకుతున్న ఒక దొంగను మొన్న మెల్బోర్న్‌లో చూసి గుర్తుపట్టి అరెస్టు చేశాడట.

ఇది అసాధారణమైన జ్ఞాపకశక్తే ముఖ్యంగా పోలీసు లందరికి ఇట్టి శక్తే వుంటే పాత దొంగలు మళ్ళీ మళ్ళీ దొంగతనాలు చేయడానికి జంకుతారు విద్యార్థులు ఒక్కసారి చదివినంతనే పాఠాలను జ్ఞాపకం వుంచుకుని అవలీలగా పరీక్షలు ప్యాసైపోతారు

రాజకీయ నాయకులకు కూడా ఇంతటి జ్ఞాపకశక్తి వుంటే ఎంత బాగుండును. ఎన్నికల ముందుచేసిన వాగ్దానాలను ఎన్నికల తరువాత వారు మరచిపోయే వీలుండదుకదా.

గాంధీజీ జ్ఞాపకశక్తి అద్భుతమైనదని చెబుతారు ఒకసారి చూసిన ముఖాన్ని, ఒకసారి విన్న పేరును ఆయన ఎంతకాలమైనా జ్ఞాపకం పెట్టుకునేవారట నెహ్రూ మాత్రం తరచుగా చూసేవారినైనా మరచిపోయి, మరొకరి పేరుతో పిలిచేవారట అయినా ఆయన జ్ఞాపకశక్తి కూడా తక్కువది కాదు, జైలులో వుండగా వ్రాసిన "గ్లిమ్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ"ని అన్ని పేర్లు తేదీలతో సహా ఒక రిఫరెన్సు గ్రంథమైనా లేకుండా కేవలం జ్ఞాపకంపై ఆధారపడే ఆయన వ్రాశారట

అయినా, మరీ మితిమీరిన జ్ఞాపకశక్తి వుండడం కూడా మంచిది కాదేమో. జీవితంలో మరచిపోదగిన సంఘటనలు చాలా వుంటాయి. ముఖ్యంగా మనస్సును రంపపు కోత కోసే కొన్ని జ్ఞాపకాలు జీవితాంతం మనలను వెన్నాడే పరిస్థితి దుర్భరమైనది

మానవులు కోరుకోదగింది అసాధారణ జ్ఞాపకశక్తిని కాదు కావలసిన వాటినన్నిటిని జ్ఞప్తిలో వుంచుకోగలిగి అక్కరలేని వాటి నన్నిటిని మరచిపోగలిగిన శక్తి.

# జేబు దొంగలుగా స్త్రీలు

జేబు దొంగతనాలు స్త్రీలకు అసాధ్యమైన విద్యగా ఎవరన్నా పొరబడు తున్నారా? ఈ భ్రమను పటాపంచలు చేయడానికి ఆంధ్రప్రదేశ్ రాజ ధానిలో ఆడ జేబుదొంగల ముఠా బయలుదేరిందట

ఈ దొంగలు ఉత్తర ప్రాంతంనుంచి వచ్చినవారట. తమ అంద చందాలతో హావభావ విలాసాలతో పౌరులను మభ్యపెట్టి, పరధ్యానంగా వున్న సమయంలో జేబులు కత్తిరించి సొమ్ము తస్కరిస్తున్నారట

నిజానికి పురుషుల హృదయాలను సయితం దొంగిలించడం చేత నైన స్త్రీలు జేబులు కత్తిరించడం, తస్కరించడం అసాధ్య విద్య కాన క్కరలేదు. ఈ విద్యను ప్రయోగించే, మొదటి ప్రపంచయుద్ధ కాలంలో మాతహారీ అని మారుపేరు పెట్టుకున్న ఒక డచ్ సుందరి జర్మన్ గూఢ చారిణిగాపనిచేస్తూ మిత్రరాజ్యాలసైనికాధికారులనుంచి మిలిటరీ రహస్యా లనేకం సంగ్రహించేదట

జంట నగరాలో తిరుగుతున్న ఆడ దొంగలు చరిత్ర ప్రసిద్ధురా లైన మాతహారీ వలె, లేదా ఆమె పాత్రను హాలీవుడ్ ఫిలిమ్‌లో అపూ ర్వంగా నటించిన గ్రేటా గార్బోవలె అందగత్తె లవునో కాదో తెలియదు గాని, అయితే మాత్రం వారిని పట్టుకోవడం కష్టమే కనుక నగరవాసులకు వారి బెడద తొలగించే బాధ్యతను మగ పోలీసులకంటె స్త్రీ పోలీసులకు అప్పగించడం అధిక ప్రయోజనకరమేమో అధికారులు ఆలోచించాలి

# ఫ్లయింగ్ సాసర్ల రహస్యం

ఫ్లయింగ్ సాసర్లు నిజంగా వున్నాయా? ఉంటే అవి ఏమిటి? ఎక్కడి నుంచి వచ్చాయి?

ఈ ప్రశ్నలు 1950 ప్రాంతాలనుంచి వినబడుతూనే వున్నాయి ఇంతవరకు వాటికి సరియైన సమాధానాలు లభించనే లేదు

ఆకాశంలో తళ తళ మెరుస్తూ, అతివేగంగా కదులుతూ ఏ వస్తువు కనబడినా దాన్ని ఫ్లయింగ్ సాసర్‌గానే జనం భావించడం పరిపాటి అయింది దానిపై రకరకాల ఊహా గానాలు జరిగాయి అది నిజంగా ఏ యితర గ్రహంనుంచో వచ్చి వుండాలని కొందరంటే కాదు రష్యనులో, అమెరికనులో వేస్తున్న రహస్య వైజ్ఞానిక ప్రయోగాలని మరి కొందరు

ఫ్లయింగ్ సాసర్‌ను తాము కళ్ళారా చూడడమే కాదు, అది భూమికి దిగడం, దానిలోనుంచి విచిత్రాకారులైన వ్యక్తులు రావడం, తాము సమీపించగానే వారు తిరిగి పారిపోవడం చూశామని చెప్పేవారు కూడా లేకపోలేదు ఇటువంటి వార్తలు అడపా తడపా పత్రికల కెక్కడం కూడా పరిపాటే

ఈ వార్తలను పురస్కరించుకుని పరిశోధనలు కూడా జరగక పోలేదు అయితే ఇంతవరకు ఏదీ నిర్ధారణ కాలేదు విమానాల రెక్కలపై ప్రతిఫలించిన సూర్యకిరణాలు ఆ విధమైన భ్రమ కలిగించి వుండవచ్చునని కొందరు, వాతావరణ పరిశోధనచేసే బెలూన్లు కావచ్చునని కొందరు, ఉల్కలు కావచ్చునని మరికొందరు—ఇలా రకరకాల సిద్ధాంతాలు

ఇప్పుడు మరొక శాస్త్రవేత్త—బ్రిటన్‌లోని జోడ్రెల్ బ్యాంక్ ఖగోళ పరిశోధనశాలకు చెందిన బెర్నార్డ్ లోవెల్-అవి ఫ్లయింగ్‌సాసర్లు కావని, మండుతూ పడిపోయే ఉల్కలేనని అభిప్రాయం ప్రకటించారు ఆయన రోదసీ విజ్ఞానంలో నిష్ణాతుడైన శాస్త్రవేత్త కనుక ఆయన అభిప్రాయాన్ని తీసివెయ్యడానికి వీలులేదు

అయినా, ఫ్లయింగ్ సాసర్ల విషయమై ఇదే ఆఖరిమాట అని చెప్పడానికి కూడా వీలులేదు ఇదుగో పులి—అదుగో తోక అనే స్వభావం మానవులలో వున్నంతకాలం ఈ విషయమై ఆఖరు మాటకు తావేలేదు.

# కన్యాశుల్కం

ఇదివరలో మన దేశంలోని కొన్ని ప్రాంతాలలో "కన్యాశుల్క" దురాచారం విస్తృతంగా వుండేదట దీని ధర్మమా అని ఆంధ్ర సాహిత్యానికి ఒక అమూల్య నాటకంకూడా లభించింది ఈ సమస్యను గురించి పరిశోధన చేసిన శ్రీ గురుజాడ అప్పారావు దాన్ని ఖండిస్తూ "కన్యాశుల్కం" అనే నాటకం వ్రాశారు ఆ నాటకం వల్లనేనని చెప్పలేము గాని, ఎలాగైతేనేం ఈ దురాచారం ఇప్పుడు దాదాపుగా సమసిపోయింది

ఇండియావంటి నాగరిక దేశంలోనే ఇటువంటి దురాచారం ఇటివలివరకు వుండగా, న్యూగినీలోని పాపువన్ అనే ఆటవిక జాతిలో ఇంకా వుండడంలో ఆశ్చర్యంలేదు ఆ జాతి వారు డబ్బుపోసి వధువులను తెచ్చుకుంటారట బహుశా ఆ జాతి స్త్రీల సంఖ్య తక్కువేమో వధువుల ఖరీదు విపరీతంగా పెరిగిపోతున్నదట వధువు కులీనురాలైతే, లేక స్వయంగా ఆర్జనపరురాలైతే, లేదా చక్కనిదైతే మామూలుకంటె ధర ఎక్కువ వుంటుందట గరిష్ఠ ధర 24 వేలరూపాయలవరకు వుండవచ్చు ఈ ధరల పెరుగుదలను అరికట్టడానికి పాపువన్ జాతి ప్రతినిధులు కొంద రిటీవల సమావేశమై, ఒక మొత్తాన్ని మించి వధువు తండ్రికి సొమ్ము చెల్లించడాన్ని నేరంగా పరిగణిస్తూ శాసనం చేశారట

ఇంకా ఆటవిక స్థాయిలోనే వున్న పాపువన్‌లలో ఇటువంటి దురాచారం వున్నందుకు మనం విస్తుపోనక్కరలేదు ఈ మాదిరివి నాగరిక సమాజంగా చెల్లుతున్న మన దేశంలో మాత్రం లేవా? కన్యాశుల్కం సమసిపోయినా వరశుల్కం ఇంకా వదలలేదు వరుడు ఎన్ని వేలు, లక్షలు కట్నంగా గడించ గలిగితే అంత ఘన విషయంగా లెక్క

పాపువన్ జాతివారి శాసనం ఎంతవరకు విజయవంత మవుతుందో చెప్పలేముగాని, మన "వరకట్న" దురాచారాన్ని మాత్రం ఏ శాసనాలు సమయించలేక పోయాయి సంఘ వ్యవస్థలో, ముఖ్యంగా స్త్రీల ఆర్థిక స్థాయిలో మార్పులు వచ్చేవరకు ఈ అవినీతి ఇలా కొనసాగవలసిందేనేమో

# దోమల బాధకు కొత్త విరుగుడు

ఏమైన ఆంధ్ర పట్టణాలలో వున్నంతగా దోమల బాధ మరే రాష్ట్రాల లోను వుండదేమో ఒక తీరు, తెన్ను లేకుండా పట్టణాలు పెరగడం, దానితో పాటు ఇరుకు వీధులు, మురికి సందులు పెరగడం-ఇది జరిగిన కొద్దీ దోమలబాధ కూడా హెచ్చుతున్నది పట్టణాలకు సంబంధించిన బృహత్పథకాలు ఇంకా ఎన్ని దశాబ్దాలకు అమలు జరుగుతాయో తెలియదు కనుక, ఈ లోగా దోమల నిర్మూలనకు అమెరికాలో కనుగొన్న కొత్త పద్ధతిని మనం కూడా అనుసరించ వచ్చునేమో.

“న్యూయార్క్ టైమ్స్” పత్రికకు ఉపయోగించే న్యూస్‌ప్రింట్ నుంచి లభించే ఒక కొత్త రకం హార్మోన్‌తో దోమలను సంహరించ వచ్చునట ఈ సంగతిని హార్వర్డ్ విశ్వ విద్యాలయంలోని పరిశోధనా విభాగంవారు కనుగొన్నారు

అమెరికన్ పత్రికలలో “న్యూయార్క్ టైమ్స్” దే అగ్ర తాంబూలం సర్క్యులేషన్ లోనేకాక పేజీల సంఖ్యలో కూడా అది పెద్దది దాదాపు రెండు వందల యాభై పేజీలతో వెలువడే దాని ఆది వారం సంచిక ఒక కాపీతో కొన్ని వేల కోట్ల దోమలను నిర్మూలించ వచ్చునట మానవమాత్రు డెవడూ ఒక రోజులో అన్ని పేజీలు చదవలేడు కనుక వాటిని ఈ విధంగా సద్వినియోగం చేసినట్టు కూడా కాగలదని హార్వర్డ్ ప్రొఫెసర్ కరోల్ విలియమ్స్ అభిప్రాయం

దోమలకు “టైమ్స్” ఒకటే శత్రువు కాదు “వాల్ స్ట్రీట్ జర్నల్” “బోస్టన్ గ్లోబ్” వంటి పత్రికలు కూడా మశక నిర్మూలనకు ఉత్తమ సాధనాలని హార్వర్డ్ శాస్త్రజ్ఞులు కనుగొన్నారట

మన దేశంలో ఏయే పత్రిక లిందుకు పనికి వస్తాయో తెలియదు ఈ విషయమై మన విశ్వవిద్యాలయాలు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ లోని యూనివర్శిటీలు పరిశోధన చేయిస్తే బావుండును అవేవీ పనికి రాకపోతే అమెరికాలో కంటే ఇక్కడ దోమల బెడద ఎక్కువ కనుక-అక్కడి నుంచి పాత పత్రికల ప్రతులను (రాజకీయపు షరతులేవీ లేకుండా చూసి మరీ) దిగుమతి చేసుకొనడం మంచిదేమో

# అతి రాతగాడం

కొందరు ఎంత అతిగా మాట్లాడతారో, కొందరు అంత మితంగా మాట్లాడతారు అలాగే కొందరు రచయితలు విరివిగా, విపరీతంగా వ్రాసేస్తారు మరికొందరు ముక్తసరిగా, చెప్పదలచుకున్నది కాస్తా నాలుగు ముక్కలలో వ్రాస్తారు వ్రాత ఎక్కువ తక్కువలనుబట్టే వారి ప్రతిభను నిర్ణయించడానికి వీలు లేదనుకోండి అయినా, అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని స్ఫురింపజేయడం ఒక విశేషమే

నోబెల్ బహుమతి గ్రహీత, కీర్తిశేషుడు ఎర్నెస్ట్ హెమింగ్వే కొద్ది మాటలలో, అతి శక్తిమంతంగా వ్రాయడంలో అసమానుడనే ప్రఖ్యాతి పొందాడు అతని శైలి ప్రభావం అమెరికన్ సాహిత్యంపై చాలా వుంది అతడు సాహిత్య వ్యాసంగానికి దిగేముందు పత్రికలలో చాలకాలం పనిచేశాడు రచయితలకు జర్నలిజం చక్కని క్రమశిక్షణ ఇస్తుందని, తన ముక్తసరి శైలికి పత్రికానుభవమే కారణమని హెమింగ్వే చెప్పుకున్నాడు కూడా

బహుశా, క్లుప్తంగా చెప్పడంలో నమ్మకం లేకపోబట్టే కావచ్చు ఒక అర్జెంటైన్ పత్రికా విలేకరి లండన్‌లో ప్రపంచపు ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొంటున్న తన దేశపు జట్టు ప్రతిభావిశేషాలను వర్ణిస్తూ వార్త పంపడానికి 20 246 మాటలు వాడాడట వ్రాయడానికి అతనికి ఆరు గంటలు పట్టగా, దక్షిణ అమెరికాకు దాన్ని టెలిగ్రాఫ్ చేయడానికి పోస్టల్ ఉద్యోగులకు దాదాపు అంతేసేపు పట్టింది ఆ వార్తను పూర్తిగా ప్రచురిస్తే అతని పత్రికలో 32 పేజీలు నిండుతుందట

సంఘటన ప్రాముఖ్యాన్నిబట్టి తన వార్తను యథాతథంగా ప్రచురిస్తారనే ఆ విలేకరి నమ్ముతున్నాడు అతని నమ్మకం వృధా కాకపోవచ్చుగాని, ఒక్క విషయం మీద అంత వార్తను పూర్తిగా చదివే వారుంటారా అన్నదే సందేహం

# మాస్కోలో మద్రాసీ

రోమ్‌లో వున్నప్పుడు రోమన్‌వలె వుండమన్నారు కాని, శ్రీ కామరాజ్ మాస్కో వెళ్ళినా మద్రాసీ వలెనే వుండదలచుకున్నారు

మోకాళ్ళ దిగువ వరకు గూడకట్టు, మోచేతుల క్రిందివరకు చొక్కా, ఒక పైపంచె-ఇవే ఆయన దుస్తులు ముఖ్యమంత్రిగా వున్నా, ఒక పెద్ద జాతీయ సంస్థకు అధ్యక్షుడుగా వున్నా, మరే పదవిలోవున్నా ఆయన కింత కంటె దుస్తు లక్కరలేదు ఆయన వేషం ఎంత నిరాడంబరమో, అలవాట్లు అంత నిరాడంబరమైనవి మాస్కో వెడితేమాత్రం ఇందుకు భిన్నంగా ఎందు కుండాలి?

గాంధిజీ లండన్ వెళ్ళినా అంగవస్త్రాన్నే ధరించారు జవహర్లాల్ ప్రధాని అయిన తొలినాళ్ళలో కాకపోయినా ఆ తర్వాత ఎప్పుడు విదేశాలకు వెళ్ళినా తన మామూలు దుస్తులతోనే వెళ్ళేవారు లాల్ బహదూర్ శాస్త్రి కూడా అంతే అందుచేత వారి అడుగుజాడలనే శ్రీ కామరాజ్ కూడా అనుసరిస్తున్నా రన్నమాట

రష్యన్ శీత ఋతువు జగత్ప్రసిద్ధమైనది నెపోలియన్ అంతటి వాడిని అది బెదరగొట్టింది అయితే శ్రీ కామరాజ్ శీతాకాలం సమాప్తమయిన తర్వాత వెళ్ళారు కనుక పరవాలేదు అంతగా చలివేస్తే శాలువ కప్పుకుంటారట,

రోమ్‌లో రోమన్ వలె వుండమన్నారు గదా అని ఆయనను ఏ రష్యన్ అయినా అడిగితే "ఇది రోమ్ కాదు గదా!" అని ఆయన సమాధానం చెప్పవచ్చు

పూర్వకాలపు రోమన్‌ల వేషధారణ ఇంచుమించు మన దుస్తుల వలెనే వుండేది అందుచేత శ్రీ కామరాజ్ శాలువను వల్లెవాటుగా వేసుకుని "నేను రోమన్ సెనెటర్ వలె లేనా!" అని ఎదురు ప్రశ్న వేయవచ్చు

# ప్రేమానలం

ప్రేమికులు, కవులు ఒక రకంగా ఉన్మత్తులేనని షేక్‌స్పియర్ సూక్తి. ఇది నిజమే అయివుండాలి

లేకపోతే, ఫ్రాన్సులో ఒక సైనికుడు కొత్తగా పెళ్ళి చేసుకోబోతూ, తానెప్పుడో మరొక ప్రేయసికి వ్రాసిన ప్రేమలేఖలను తగలబెట్టడానికి ఊరవతల అడవికి వెడతాడా? అక్కడ తగులబడుతున్న తన ప్రేమ లేఖలు గాలికెగిరిపోయి, వనమంతా దగ్ధం కావడానికి కారకుడవుతాడా?

ఈ పిచ్చిపని అతడెందుకు చేశాడో? మొదటి ప్రేయసి అతన్ని దగా చేసిందేమో? ఆ నిరాశతో, నిశ్పృహతో లేఖలను తగులబెట్టినా, ఆమె స్మృతులను దగ్ధం చేయగలడా?

లేక, తాను పెళ్ళి చేసుకోబోతున్న రెండవ యువతి కంటబడగలవనే భయంతో ఈ దహనకాండ జరిపి వుండవచ్చు ఇదే నిజమైతే లేఖలతోపాటు వనదహనానికి కూడా కారకుడై వార్తలలోకి ఎక్కడంతో, అతని గుట్టు కాస్తా బయటపడింది ఇప్పు డతడు తన వివాహానికి బదులు కోర్టుకు హాజరు కావలసి వచ్చిందట ఇక అతని పరిస్థితి రెంటికి చెడిన రేవడ చందం కావచ్చు.

అతడు తగులబెట్టిన ప్రేమలేఖలు ఒక పెద్ద పెట్టెడు వున్నాయట కొన్నాళ్ళాగి, వాటిని, తాను వ్రాసిన వాటిని కలిపి, ఎలిజబెత్, రాబర్ట్ బ్రౌనింగ్ దంపతులవలె ప్రచురించివుంటే, అతనికి ఇంకా మంచి పేరు వచ్చి వుండేది కాదా? ప్రేమ లేఖలను సారస్వతంగా అధ్యయనం చేసే వారుమాత్రం లోకంలో తక్కువ వున్నారా?

# విశ్వామిత్ర సృష్టి

విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేశాడంటారు నిజంగా చేశాడో లేదో గాని, ఈ రోజులలో శాస్త్రజ్ఞులు మాత్రం చేసి చూపిస్తున్నారు

అయితే, చీకటి రాత్రులలో కూడా సూర్యుడు ప్రకాశించేట్టు చేయడ మన్నది ఇంతవరకు ఏ శాస్త్రజ్ఞుడు ఊహించని విషయం అమెరికాలో ఇప్పుడిందుకు పరిశోధనలు జరగనున్నాయట ఒక పెద్ద కృత్రిమ ఉపగ్రహాన్ని రోదసిలోకి ప్రయోగించి, దానిపై ప్రతిఫలించే సూర్యరశ్మి భూమిమీద చీకటిగావున్న భాగంమీద పడేట్టు చేయగలిగితే రాత్రికూడా పగలై పోతుంది

ఎన్నటికైనా ఇది సాధ్యమైతే, ఆకాశంలో మరొక చంద్రుడు ఉంటా డన్నమాట ఒకడు శుక్లపక్ష చంద్రుడు, మరొకడు కృష్ణపక్ష చంద్రుడు.

కాని, ఈ రెండవ చంద్రుడు వెలుగు నిస్తాడుగాని వెన్నెల నిస్తాడా? అతడిని చూసి కలువలు వికసిస్తాయా? కమలాలు ముకుళిస్తాయా? పిల్లలు దాయిదాయి అని పిలుస్తారా? కవులు ప్రియాముఖంతో పోలుస్తారా? విరహిణులు ఉపాలంభిస్తారా? ఉహూ అవన్నీ అసలు చంద్రుడికే చెల్లు, రెండవవాడు నకలు చంద్రుడుగా, అసలు చంద్రుడికి ఫోర్జరీలాగా, పౌండ్రక వాసుదేవుడివలె మిగిలిపోతాడు

సృష్టికి ప్రతిసృష్టి చేయవచ్చుగాని, నిసర్గమైన హృదయానుభూతులకు నకళ్ళను సృష్టించడం శాస్త్రజ్ఞులవల్ల అవుతుందా?

# పులి మనిషి

బర్మాలో ఒక బాలుడు కావాలను కున్నప్పుడల్లా పులిగా మారిపోతున్నా డట కనీసం అలాగని వాడు నివసించే "ఫలాం" గ్రామంలోని ప్రజలు నమ్ముతున్నారు.

వాడిని పరీక్షించిన ప్రభుత్వాధికారులు అదేమీ లేదని అదంతా వాడి భ్రమ అని కొట్టేశారు కాని, గ్రామస్థులు అప్పుడప్పుడు ఆ బాలుని వంటి మీద పులి చారలు కనిపిస్తున్నట్టు, చేతులు పంజాలవలె మారిపోతున్నట్టు. ఉండుండి వాడు అడవిలోకిపోయి జంతువులను వేటాడి తింటున్నట్టు చెబుతున్నారు ఆ బాలుడు కూడా తనకు పులివలె బలశాలి కావాలనే కోర్కె కలిగిందని, ఒక భారతీయ యోగి ఇచ్చిన మూలిక మహాత్యం వల్ల పులిగా మారి పోతున్నానని చెబుతున్నాడు.

దేహ బలం కావాలని కోరుకొనక, పులి వంటి క్రూరజంతువుగా మారిపోవాలని వాడెందుకు కోరుకున్నాడో ? రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ వ్రాసిన నవలలోవలె డాక్టర్ జెకిల్ వంటి పరమ సజ్జనులకు కూడా మిస్టర్ హైడ్ వలె పరమ దుర్జనులుగా మారిపోతే బాగుండుననే అజ్ఞాత వాంఛ మనసులో మెదులుతూనే వుంటుందేమో !

అయినా, మానవులు మృగాలుగా మారిపోవాలని ప్రత్యేకించి కోరుకోవాలా? ఎన్ని జంతు లక్షణాలు మానవులలో లేవు? కొందరు గోవులవలె సాధువులు, కొందరు సాక్షాత్తు గోముఖ వ్యాఘ్రాలే కొందరు సింహంవలె రీవి ఒలక బోస్తే, మరి కొందరు అచ్చం గ్రామసింహాలే కొందరిది మేకపోతు గాంభీర్యం కొందరు గాడిద చాకిరీ చేస్తారు కొందరు గడ్డి తింటారు కొందరి జిత్తులు నక్కల కైనా అంతుపట్టవు కొందరు వన పిట్టవలె వాగుతారు, కొందరు బక ధ్యానంలో నిష్ణాతులు, కొందరు మహాకవి కీట్సువలె కవితా పక్షాలపై (On the wings of poesy) పక్షులవలె భావాంబర వీధులలో ఎగిరిపోతారు.

జగన్నాటకంలో మానవునిది అద్వితీయమైన పాత్ర. అతడు ధరించ లేని రూపం ఏముంది ?

# ఉభయతారకం

లోకంలో ఉపయోగకరం కానిదేదీ వుండదు ఎందుకూ పనికిరాదని మనం తీసిపారవేసే వాటినికూడా, కిటుకు తెలుసుకోవాలేగాని, దేని కోదానికి ఉపయోగించవచ్చు

సంగీతాన్నే తీసుకోండి ఇది అన్ని కళలలోకి అత్యుత్తమ మైందని అంటారు దాన్ని "శిశుర్వేత్తి, పశుర్వేత్తి " అని మనవారు స్తుతించారు మధురమైన సంగీతం వినడంవల్ల జననాంతర సౌహృదాలు మేలుకుంటాయని కాళిదాసు కీర్తించాడు, సంగీతం ప్రేమను ఉద్దీపింప జేస్తుందని షేక్‌స్పియర్ శ్లాఘించాడు అయితే, ఇవన్నీ శ్రావ్యమైన సంగీతం గురించి

మరి శ్రావ్యం కాని సంగీతం సంగతో? పద్ధతి తెలుసుకుంటే, దానికీ ఏదో ఉపయోగం వుండకపోదు

కొందరి కంఠాలు కర్ణకఠోరంగా వుంటాయి అపశ్రుతులు తప్ప పలకవు, కొత్త గాయకులను ప్రోత్సహించే సదుద్దేశంతో ఇట్టివారికి రేడియో కార్యక్రమాలలో స్థానం కల్పించడం కూడా కద్దు శ్రోతలను ఈ విధంగా బాధపెట్టే బదులు ఇట్టివారిని మరొక విధంగా ఉపయోగించ వచ్చు

ఆస్ట్రేలియాలో ఒక రైతు తన అరటి తోటకు పదిహేను నెలల పాటు సంగీతం వినిపించాడట అది మానవులకు శ్రావ్యంగా వుండక పోవచ్చుగాని, అరటితోట మాత్రం పరవశించి విరగకాచిందట

మొక్కలపై సంగీత ప్రభావాన్ని గురించి అప్పుడప్పుడు ఇట్టి వార్తలు వస్తూవుంటాయి మొక్కలకు ఏ సంగీతమైనా ఫరవాలేని పక్షంలో మధుర గాయకులను మానవ మాత్రులకు విడిచిపెట్టి, ఇతర గాయకులను వాటికి కేటాయిస్తే సరి మనకు పనికిరాని గాయకులను ఉపయోగించు కున్నట్టూ వుంటుంది, కాయగూరలను సమృద్ధిగా పండించుకున్నట్టూ వుంటుంది

# కృపలానీ ఫిర్యాదు

చాటున పొంచివుండి ఇతరుల సంభాషణను వినడంవలెనే ఒకరి ఉత్త రాలను మరొకరు చదవడం కూడా సభ్యతకు విరుద్ధమైనదని కొడుకు వ్రాసే ఉత్తరాలపై తండ్రికి ఆసక్తి కలుగుతుంది స్నేహితులు ఒకరికి వచ్చిన ఉత్తరాలను మరొకరు చింపి మళ్ళీ జాగ్రత్తగా అంటించి అందజేస్తారు. భార్యకు వచ్చిన ఉత్తరాలను భర్త, భర్తకు వచ్చిన ఉత్త రాలను భార్య చాటుగా చదవడం తరచుగా జరిగేదే దీనివల్ల అప్పు డప్పుడు కలిగే అపోహలు కథా రచయితలకు కావలసినన్ని ఇతివృత్తా లను సప్లయి చేస్తాయి

వీటన్నిటి కంటె అసభ్యమైంది భార్యా భర్తలు ఒకరికొకరు వ్రాసు కున్న ఉత్తరాలను ఇతరులు చదవడం దంపతులు అన్యోన్య ప్రేమను వెళ్ళబోసుకోవచ్చు, విరహాన్ని వెల్లడించుకోవచ్చు. లేదా ఇంటి సంగ తులే వ్రాసుకోవచ్చు ఏవైనా, వాటిని ఇతరులు చూడడం మర్యాదకు విరుద్ధం

మన పోలీసు శాఖవారు ఈ అసభ్యతకు అతీతులు కారని ఆచార్య కృపలాని ఈ మధ్య లోక్‌సభలో చేసిన ఫిర్యాదును బట్టి తెలుస్తున్నది ఆయన హాంకాంగ్ నుంచి తన భార్య శ్రీమతి సుచేతకు వ్రాసిన ఉత్త రాన్ని పోలీసులు చదివి మరీ ఆమెకు ఇచ్చారట

శ్రీ కృపలానీ ప్రతిపక్షానికి చెందిన రాజకీయవాదే కావచ్చు కాని ఆయన భార్య యు పి, ముఖ్యమంత్రిణి ఆమెకు లేఖవ్రాస్తూ పోలీసుల కంటపడరాని విషయాలు ఆయన వ్రాస్తారని ఎందు కనుకోవాలి? పోనీ భర్తగా శ్రీ కృపలానీ తనభార్యకు ఏమి వ్రాసివుంటారోననే కుతూ హలం హోంశాఖలో వారికి కలగడానికైనా, దంపతులిద్దరూ వయో వృద్ధులే. ఈ వయస్సులో వారిమధ్య ఇతరులకు ఆసక్తి కలిగించే రహస్యాలేమి వుంటాయి?

# చలికాలం

హేమంతం వచ్చింది చలి విపరీతంగా హెచ్చింది వేసవిలో భయం కరమైన గ్రీష్మతాపాలకి గురియైన విజయవాడ పౌరులకు హేమంతం ఎప్పుడూ రెండు చేతులా ఆహ్వానించ దగినదిగానే కనిపిస్తుంది విజయ వాడ వారికే కాదు, ఉష్ణమండలానికి చెందిన దక్షిణాపథంలోని వారందరికి చలికాలం ఆప్యాయంగా ఆహ్వానించ దగినదే

చలిదేశాలలో నివసించేవారు శీతఋతువును జీవితపు దుర్దినాలతో పోలుస్తారు వారి దేశాలలో మంచు కురిసి నేలంతా హిమావృతమై నిప్పచ్చరంగా వుంటుంది మనకు ఆ బాధలేదు అన్ని ఋతువులలోకి హేమంత, శిశిర ఋతువులే ఆహ్లాద కరమైనవి అందుకేనేమో మన పెద్ద పండగలన్నీ ఎండలు, వానలు వెనకబట్టిన తర్వాతనే వరసగా వస్తాయి

వేసవిలో ఎండలోకి రావడమే భయం కాని, చలి రోజులలో సూర్యుడు నిజంగానే లోక బాంధవుడుగా కనిపిస్తాడు నాలుగు గోడల మధ్యనుంచి బయటికి వెడితే ఎండ ఆప్తమిత్రునివలె వెచ్చగా పలక రిస్తుంది.

ఒక్కటే చిక్కు రాత్రులప్పుడు చలితోపాటు దోమలు కూడా కరుస్తాయి ఎంతగా కప్పుకుని పడుకున్నా విజయవాడవంటి మురికి పట్ట ణాలలో దోమలదాడి తప్పదు ఈగలంత పెద్ద సైజులలో ముట్టడించి నెత్తురు పీల్చేస్తాయి ప్రసిద్ధ రచయిత ఇ వి లూకాస్ ఒకచోట వ్రాసి నట్టు, వాటిని ముట్టడి ప్రారంభ దశలో చంపడానికి యత్నించడం వృథా ప్రయాస మన రక్తం వాటికి మద్యం వంటిది దాన్ని కడుపునిండా పీల్చిన తర్వాత కైపెక్కి కదలలేక పడుకుంటాయి అప్పుడు వాటిని వరసగా మట్టుపెట్టాలి

అయినా, ఎన్నాళ్ళుంటుంది చలికాలం? మహా అయితే నెలా పది హేనురోజులో, రెండు నెలలో! ఆంగ్లకవి షెల్లీ అన్నట్టు హేమంతం తర్వాత వసంతం రాకుండా పోతుందా? **(If winter comes can spring be far behind?)** ఫిబ్రవరి నుంచి మళ్ళీ ఎండలు క్రమంగా ముదరడం మొదలు పెడతాయి ఈ సారి ఎన్నికల వేడి కూడా తోడైతే ఇంకెక్కడి చలి?

# ఉపన్యాస కళ

బహిరంగ సభలలో ప్రసంగించవలసిన విధానాలను గురించి ఒక అమెరికన్ నిపుణురాలు ఈ నెల 21వ తేదీ నుంచి సికిందరాబాదులో శిక్షణ తరగతులు నిర్వహిస్తారట ఆమెనుగాని, ఆమె వద్ద శిక్షణ పొంద గోరేవారిని గాని నిరుత్సాహపరచడం మా అభిమతం కాదు కాని, ఒకటి అనిపించక మానదు ఉపన్యాస విద్యలో భారతీయులకు అమెరికనులు గాని, మరొకరుగాని శిక్షణ గరపబూనడం సాహసమే!

ఒక జాతిగా భారతీయులకు ఉపన్యాసా లివ్వడం ఉగ్గుపాలతో నేర్పిన విద్య కాదు, ఉగ్గుపాలతో నేర్పకపోయినా వచ్చే సహజ విద్య సాధారణంగా పాశ్చాత్యులు, తదితర దేశాలవారు ప్రసంగాన్ని ముందుగా, శాఖాచంక్రమణాలు లేకుండా క్లుప్తంగా వ్రాసుకుని చదవడం పరిపాటి మన వక్తల అలవాటు వేరు పిపీలికాది బ్రహ్మపర్యంతం ఏ విషయం మీదనైనా, ఆశువుగా, అనర్గళంగా, ఎన్ని గంటలసేపైనా ఉపన్యసించ గలగడం మనవారి ప్రజ్ఞ ఇంతగా వాక్శూరత్వం వున్న జాతి మరొకటి లేదని కూడా చెప్పవచ్చు

ముఖ్యంగా మన దేశంలో ఉపన్యాస చాతుర్యం రాజకీయ నాయకులకు ప్రధాన లక్షణం, అర్హత కూడా అయినట్లు తోస్తుంది స్వాతంత్ర్యోద్యమకాలంలో ప్రజలను ప్రబోధించడానికి ఇది అవసరమై వుండవచ్చు కాని, ఈ నాడు కూడా, మన నాయకులు దేశభక్తిని గురించి, (తాము తమ పనులు మానుకుని) ప్రజలు కష్టపడి పని చేయవలసిన ఆవశ్యకత గురించి, వేళా పాళా లేకుండా ఉపన్యాసా లిస్తూపోవడం విచిత్రమే

ఉపన్యాసాలు ఎలా చేయవలెనో కాక, ఎలా చేయరాదో మన నాయకులకు అమెరికన్ నిపుణురాలు శిక్షణ తరగతులు నిర్వహించడం మంచిది.

# దిగంబర కవులు

పూర్వ కవులు తమ కృతులను సాధారణంగా రాజులకు అంకిత మిచ్చే వారు బహుశా, రాజులే తమ కొలువు కూటాలలో వాటిని ఆవిష్కరించేవారు అందుచేత ఆ కావ్యాలకు పబ్లిసిటీకి ఢోకా వుండేదికాదు.

ఇవి రాజుల రోజులుకావు కనుక, మంత్రులకో, పెద్ద హోదాలు గల ఉద్యోగస్థులకో రచనలను అంకితమివ్వడం, వారిచేత ఆవిష్కరణ జరిపించడం ఒక ఆచారమైంది పబ్లిసిటీ సంపాదించడానికి ఇదీ మార్గమే

బహుశా అధికారంలోవున్న వారి సాహిత్యాభిరుచికి, ఒక రిక్షావాలా సాహిత్యపరిజ్ఞానానికి అంతగా తేడా లేదని విశ్వసిస్తూ వుండడం వల్లనేమో తెలుగు దేశంలో ఇటీవల తల ఎత్తిన దిగంబర కవులు తమ మొదటి కవితా సంపుటిని హైదరాబాదులో ఒక రిక్షావాలా చేత ఆవిష్కరింప జేశారు రెండవ సంపుటి ఆవిష్కరణ మొన్న విజయవాడలో అర్థరాత్రి వేళ నడివీధిలో ఒక హోటల్ క్లీనర్ చేత చేయించారు వారుఆశించినది పబ్లిసిటీయే అయితే, వారుకృతకత్యులైనారనే చెప్పవచ్చు.

1916 ప్రాంతాలలో యూరప్‌లో కొందరు చిత్రకారులు డాడాయిజం అనే కొత్తపద్ధతిలో చిత్రలేఖనం ప్రారంభించి ప్రజలను షాక్ చేయడానికి యత్నించారు అది యుద్ధ కాలం, యుద్ధపు తాకిడివల్ల రాటు తేలిన ప్రజలు షాక్ కాకపోవడం వల్లనేమో డాడాయిజం 1920 ప్రాంతాలకే అంతరించింది

అలాగే దిగంబర కవిత పేరుతో కొందరు యువకులు చెస్తున్న కృషి కూడా ప్రజలను షాక్ చేయడానికేనా ? దాని మంచిచెడులను పరిశీలించడానికి ఇది స్థలం కాదుగాని, ఒక్క విషయం చెప్పాలి దిగంబర కవిత అని పేరు పెట్టినా, మరే పేరు పెట్టినా కవిత్వం కవిత్వంగానే వుంటుంది. దాని మౌలిక లక్షణం ఏ కాలంలోనైనా ఒకటిగానే వుంటుంది

పాత విలువలను తలక్రిందులుగా బోర్లించినంత మాత్రానే కొత్త విలువలు పుట్టుకురావు పాతవాటి నుంచి స్వచ్ఛంద పరిణామంగా కొత్త విలువలు వికసించాలి తెలుగులో ఆధునిక కవిత్వం కూడా ఈ పరిణామాన్నే సాధించవలసి వుంది

# మాట్లాడే మైనా—1

ఏ గూటి చిలుక ఆ గూటి పలుకులే పలుకుతుందట మన స్వభావాలపై అలవాట్లపై పరిసరాలకు, పెంపకానికి గల ప్రభావాన్ని తెలపడానికి ఈ సామెత చెబుతారు

వాషింగ్టన్ జంతు ప్రదర్శనశాలలో మాట్లాడే మైనా ఒకటి వున్న దట, చూడ వచ్చిన వారిని అది ముందు కుశల ప్రశ్నలు వేస్తుంది, తరు వాత ఇంగ్లీషులోని ఒక అశ్లీల పదంతో సంబోధిస్తుంది ప్రదర్శనశాలకు వచ్చే ప్రేక్షకులు చాలమంది ఫిర్యాదులు చేయగా చేయగా, చివరకు అధి కారులు ఆ మైనాను అక్కడ నుంచి తొలగించి వేశారట

మానవ భాషను అనుకరించే పక్షి ఉండడం అబ్బురం కాదు పూర్వకాలంలో హంసలు ప్రణయ రాయబారాలు నడిపేవి, చిలుకలు శృంగార కథలు చెప్పేవి, కోయిలలు పంచమ స్వరంలో గీతాలకు గీతాలే పాడేవి ఇవన్నీ కవుల కల్పనలైనా మొత్తంపై పక్షులకు, ముఖ్యంగా చిలుకలు, గోరువంకల వంటి వాటికి— మానవ భాషను నేర్పడం, అవి చక్కగా మాట లాడడం విడ్డూరం కాదు

వాషింగ్టన్ జంతు ప్రదర్శనశాలలో మాట్లాడే పక్షుల పంజరం వున్నదట అయితే వాటన్నిటిలోకి పైన పేర్కొన్న మైనా ఒక్కటే అశ్లీల పదాన్ని ఉచ్చరించింది దానికి కొంటెవాడెవడో నేర్పివుండాలి, లేదా, "కళా పూర్ణోదయం" లోని చిలుక వలె తనను చూడ వచ్చేవారి మాటల నుంచి తనంతట తానే సంగ్రహించి వుండవచ్చు

ఏమైనా, ఆ మైనా అసాధ్యురాలు దాన్ని చూసి మిగతా పక్షులు కూడా చెడిపోకుండా అక్కడి నుంచి తొలగించి, ఎన్నికలు దగ్గిరపడు తున్నకొద్దీ రాజకీయ నాయకులు చేసే శుష్క వాగ్దానాలు, పరస్పర నిందా రోపణల వలె అర్థంలేని రణగొణ ధ్వనులు చేసే పక్షుల మూకలో చేర్చి వేశారట, అక్కడైతే ఆ కోలాహలంలో దాని అశ్లీలాలు మునిగి పోతాయి, పైగా క్రమంగా దానికి ఆ అలవాటు పోయి, తోటి నాటివలె, తాను కూడా రణగొణ ధ్వని మొదలుపెట్టవచ్చు ఏ గూటి చిలుకకు ఆ గూటి పలుకులేనని వూరికే వచ్చిందా సామెత?

# మాట్లాడే మైనా—2

ఇదే శీర్షికతో మొన్నటి బుధవారం సంచికలో మేము వ్రాసిన వ్యాఖ్యానికు గుర్తుండే వుంటుంది ఆ వ్యాఖ్యలో మేము పేర్కొన్న వాషింగ్టన్ మైనా మరొకసారి వార్తలలో కెక్కింది అది తాను నిర్దోషినని రుజువు చేసుకున్నదట

ఆ మైనా తనను చూడ వచ్చేవారితో అశ్లీలాలు పలుకుతున్నదని కొందరు ఫిర్యాదులు చేయడం దానిపై వాషింగ్టన్ జంతు ప్రదర్శనశాల అధికారులు దాన్ని తోటి పక్షుల నుంచి వేరు చేయడం జరిగింది ఆ తరువాత అధికారులు దాన్ని, ఇదేఫిర్యాదుకు లోనైన మరొక పక్షిని విడివిడిగా వుంచి ఇరవై నాలుగు గంటల సేపు పరీక్ష చేశారట చివరకు అవి పలుకుతున్నవి అశ్లీలాలు కావని ఆ విధంగా భ్రమపడినవారి మనస్సులలోనే అశ్లీలం వుండివుండాలని వారు తీర్మానించుకున్నారట

అశ్లీలమనేది అసలు వస్తువులోకాక, చూసేవారిలోనే వుంటుందని ఇంగ్లీషులో ఒక నానుడి అశ్లీలం కోసం వెదకడం మొదలు పెడితే మన సంస్కృతాంధ్ర కావ్యాలేవీ ముట్టడానికైనా వీలుపడదు మన ప్రాచీన శిల్ప, చిత్రకళాఖండాలుగాని, పాశ్చాత్య దేశాల ప్రాచీనాధునిక కళాఖండాలుగాని ఏవీ నిలవవు

వెనుకటికి డాక్టర్ జాన్సన్ తన నిఘంటువులో అసభ్య పదాలున్నవని నిందించిన వారిని "ఇంత పెద్ద గ్రంథంలో వాటినే మీ రెందుకు వెదకవలసి వచ్చింది?" అని అడిగాడట వాషింగ్టన్ మైనా మరిన్ని మాటలు నేర్చి వుంటే "నా పలుకులు అశ్లీలంగానే మీ కెందుకు వినిపించాయి?" అని ఎదురు ప్రశ్న వేసివుండేది

లేదా, ఆ మైనా తనను ప్రదర్శన శాలాధికారులు పరీక్ష చేస్తున్నట్టు గ్రహించి ప్లేటు ఫిరాయించి వుండవచ్చు చాలా అమాయకంగా సభ్యపదాలే పలికి వుండవచ్చు ఏమైనా (క్రిందటి సంపాదకీయంలో మేము పేర్కొన్నట్టు) ఆ మైనా చాలా అసాధ్యురాలే

# రాబిన్ హుడ్

రాబిన్ హుడ్ నిజంగా వుండే వాడా? అతని బందిపోటు ముఠాలో సాటి లేని విలుకాండ్రు లిటిల్ జాన్, ఫ్రయర్ టక్ ఇంకా మరెందరో వుండేవారా? రాబిన్ హుడ్ ప్రేయసి మెయిడ్ మేరియన్ నిజంగా వుండేదా? వారి నవ్వులతో, కేరింతలతో మధ్యయుగాలనాటి మధ్య ఇంగ్లండులోని షెర్వుడ్ అరణ్యం మారు మ్రోగిపోయేదా?

ఏమో ఎవరికి తెలుసు? కొంత చారిత్ర కాధారం లేకపోలేదు గాని, దాన్నిమించి అతని కథలు మాత్రం చిలవలు పలవలుగా పెరిగి పోయి, ఇంగ్లీషు ప్రజా జీవితంలో, సాహిత్యం లోనేకాదు, దేశదేశాల బాలబాలికల ఊహా స్వప్నాలతో పెనవేసుకుపోయాయి

చిక్కని, చక్కని షెర్వుడ్ అరణ్యంలో, చల్లని చెట్ల నీడలలో, సెలయేళ్ళ ఒడ్డున ఏ చీకు చింతా లేకుండా కబుర్లాడుతూ కూరోచ్చవాలని రాత్రిళ్ళు ఆరుబయట నెగళ్ళుచుట్టూ చలికాగుతూ, ఆటలు, పాటలు విందులు, వినోదాలతో స్వేచ్ఛా విహంగాలవలె జీవితాలు గడపాలని కలలు కనని పిల్లలెంద రుంటారు? రాబిన్ హుడ్ వలె టోపీలో "రాబిన్" పక్షి ఈక, చేతిలో విల్లంబులు ధరించి, దార్లుకాచి, ధనవంతులను దోచి, పేద లకు పంచి పెట్టాలని, క్రూరమైన చట్టానికి బలి అయ్యే అమాయకులను రక్షించాలని కోరుకోని వా రెంద రుంటారు?

ఇంగ్లండును నార్మన్లు జయించి (1066) ఇప్పటికి తొమ్మిది శతాబ్దాలైంది వారికి ఎదురుతిరిగి పోరాడిన ఆఖరి శాక్సన్ వీరుడే రాబిన్ హుడ్ అని చెబుతారు అతని తీయని స్మృతికి చిహ్నంగానే కావచ్చు, మొన్న నాటింగ్ హామ్ న్యాయమూర్తి ఒకాయన షెర్వుడ్ అడవిలోనికి వెళ్ళి రాబిన్ హుడ్ పై ఆనాటి నార్మన్లు తెచ్చిన అభి యోగాలన్నీ రద్దుచేస్తూ, క్షమాభిక్షను ప్రకటించాడట

ఈ క్షమాభిక్షను అందుకొనడానికి రాబిన్ హుడ్ ఈనాడు లేడు కాని, ఇన్ని శతాబ్దాలు ఆలస్యంగానైనా, తమ ఆదర్శ వీరునికి న్యాయం జరిగినందుకు దేశదేశాలలోని బాలబాలికలు ఎంతైనా సంతోషించవచ్చు

# టేక్‌చంద్ సూచన

మద్యపానానికి కొందరు ఎందుకంతగా దాసులైపోతారు? మద్యనిషేధ విధానాన్ని పరిశీలించి నివేదికను సమర్పించిన సంఘం అధ్యక్షుడు శ్రీ టేక్‌చంద్ అభిప్రాయం ప్రకారం, పై తరగతులవారు ఫ్యాషన్ కోసం అలవరచుకుంటారు క్రింది తరగతులవారు తమ కష్టాలను మరచిపోవడానికి అలవాటు చేసుకుంటారు

ఇంత ఖచ్చితంగా ఈ అలవాటును రెండు తరగతులుగా విభజించడానికి వీలులేదేమో క్రింది తరగతి వారిలోకూడా తమస్థాయికి తగిన మద్యాన్ని ఫ్యాషన్‌గా అలవరచుకొనే వారుండవచ్చు అలాగే పైతరగతి వారిలో కూడా తమ స్థాయికి తగినట్టు వచ్చే కష్టాలను మరచిపోవడానికి గాను మద్యానికి అలవాటు పడేవారు వుండవచ్చు.

మద్యపానం నుంచి ఏ ఫలితాలను జనం కోరుతారో అవే ఫలితాలను (హాని కలిగించని వాటిని) ఇచ్చే శాస్త్రీయ పద్ధతులను కనుగొంటే ఈ వ్యసనాన్ని తగ్గించి వేయవచ్చునని శ్రీ టేక్‌చంద్ సూచన.

ఈ సూచనపై శాస్త్రవేత్తలెందుకు పని మొదలు పెట్టరాదు? మద్యం ఇస్తుందనుకునే ఉత్తేజాన్ని హుషారును కలిగించే ప్రత్యామ్నాయా లెందుకు కనిపెట్టరాదు?

ఆల్డస్ హక్స్‌లీ తన "బ్రేవ్ న్యూ వరల్డ్" నవలలో "సోమ" అనే పదార్థాన్ని ప్రవేశపెట్టాడు టాబ్లెట్స్ రూపంలో వచ్చే ఈ పదార్థం పుచ్చుకుంటే మనిషికి కోపం, చిరాకు, విచారం మొదలైనవన్నీ వెంటనే ఉపశమిస్తాయి ఉల్లాసం కలుగుతుంది. అయితే, ఆ నవలలో కథాకాలం 25వ శతాబ్దం ఎన్నో అద్భుతాలు సాధిస్తున్న ఇరవయ్యో శతాబ్దపు శాస్త్రవేత్తలు అంతవరకు ఆగాలా? ఈ లోగానే ఆ "సోమ" వంటి దాన్నిదెన్నో కనిపెట్టి పుణ్యం కట్టుకోరాదూ?

# ఉన్నతికి కారణం

వైవాహిక జీవితంలో సుఖం పొందలేనివారు జీవితంలో ఏదో విధంగా ఉన్నతి సాధిస్తారా?

సాధించడానికి వీలున్నదనే బ్రిటిష్ జడ్జి సర్ జోస్‌లిన్ సైమన్ అభిప్రాయం దీనిపై ఆధారపడి ఆయన ఒక తీర్పు కూడా ఇచ్చాడు

ఒక వ్యక్తి ఇరవై ఏళ్ళ క్రిందట సంసార బాధపడలేక భార్యకు విడాకు లిచ్చాడట. అప్పటి నుంచి అతడు భార్యకు మనోవృత్తి ఇస్తూనే వున్నాడు. అయితే విడాకు లిచ్చిన తరువాత అతని స్థితి బాగుపడింది ఉన్నతికి వచ్చాడు రెండు చేతులా గడిస్తున్నాడు. అందుచేత తనకు మనోవృత్తిని ఎక్కువ చేయాలని భార్య అర్జీ పెట్టుకుంది భర్త ఇది అన్యాయమని, విడాకు లప్పుడు ఎంత నిర్ణయమైందో అంతే ఇస్తానని వాదించాడు జడ్జి జోస్‌లిన్ అతని వాదనను అంగీకరించలేదు వైవాహిక సుఖం లేకపోవడమే అతడు ఆర్థికంగా బాగుపడడానికి కారణమై వుండ వచ్చునని, అందుచేత ఇప్పటి రాబడినిబట్టే భరణ మివ్వాలని ఆయన తీర్పు

సర్ జోస్‌లిన్ తన తీర్పును సమర్థించు కొనడానికి చరిత్ర నుంచి, సాహిత్యం నుంచి చాలా ఉదాహరణ లిచ్చాడు గయ్యాళి భార్యలతో బాధలుపడినా, ఏదో విధంగా, ఏదో రంగంలో విజయాలు సాధించిన సోక్రటీజ్, ఫ్రాన్సులో ఏడవ లూయీ, ఇంగ్లండులో రెండవ హెన్రీ మొదలైన ప్రసిద్ధుల నెందరినో ఆయన ఉదహరించాడు

బ్రిటిష్ జడ్జి చెప్పినట్టు గయ్యాళి భార్య లున్నవారు, వైవాహిక సుఖం లేనివారు కొందరు ఉన్నతి సాధించి వుండవచ్చుగాని, పెక్కుమంది విషయంలో ఇందుకు విరుద్ధంగా జరుగుతుంది సంసార బాధలు పడలేక సన్యాసులలో కలిసిపోయే వారే ఎక్కువ

గ్రీకు వేదాంతి సోక్రటీజ్‌ను గురించి ఒక కథ వున్నది ఆయన నొక యువకుడు పెళ్ళి విషయమై సలహా అడిగాడట "తప్పకుండా పెళ్లి చేసుకో నీ భార్య మంచిదైతే సుఖిస్తావు కాకపోతే వేదాంతి వౌతావు" అని సోక్రటీజ్ సలహా ఇచ్చాడు ఆయన భార్య గయ్యాళిది బహుశా ఆమె బాధపడలేకనే, ఆమె బాధ విరగడ కాగలదనే—స్నేహితుల మాటలు పెడచెవినబెట్టి—సోక్రటీజ్ విష పాత్రను సంతోషంగా స్వీకరించాడేమో

రష్యన్ మహా రచయిత టాల్‌స్టాయ్ వృద్ధాప్యంలో ఇల్లు విడిచి దేశదిమ్మరి కాగోరడానికి భార్యతో వచ్చిన కలతలే కారణమట

ఏమైనా బ్రిటిష్ జడ్జి తీర్పు అన్యాయంగానే వున్నదని అనిపిస్తుంది

# ధూమపానం

మంచిగాని, చెడుగాని అలవాటు కావడం కష్టం అలవాటైన తర్వాత మానడం మరీ కష్టం

మంచి అలవాటైతే మానవలసిన పని లేదనుకోండి చెడు అలవాటుతోనే చిక్కు

సిగరెట్లను కొందరు ఫ్యాషన్ కోసం అలవాటు చేసుకుంటారు మరికొందరు స్నేహితులను కాదనలేక మొహమాటపడి, క్రమంగా ధూమానికి దాసులైపోతారు ఇంకా కొందరు కేవలం కుతూహలంతో మొదలుపెట్టి ధూమపానలోలు రవుతారు

రష్యాలో కొన్ని సీమకుందేళ్ళు ఇదేదీ కాకుండా, మరొక విధంగా ధూమానికి బానిస లైనాయట సిగరెట్లవల్ల వాటి శ్వాసకోశం మొదలైన అవయవాలలో ఎట్టి మార్పులు కలుగుతాయో పరిశోధించడానికి శాస్త్రజ్ఞులు వాటికి ధూమపానం అలవాటు చేశారట మొదట వాటిచేత బలవంతాన పొగ త్రాగించవలసి వచ్చిందట క్రమంగా అలవాటుపడి ఇప్పుడు కాసేపు ఆలస్యమైతే సిగరెట్టుకోసం తహతహ లాడిపోతున్నాయట

అయితే, ఇదీ ఒకందుకు మంచిదే ధూమపానంవల్ల ఏవేవో వ్యాధులు వస్తాయని వైద్య పరిశోధకు లందరు దాదాపు ఏకగ్రీవంగానే చెబుతున్నారు గనుక అది చెడ్డదే కావచ్చు ఇక దానిపై పరిశోధనలు కూడా వృధా ఇప్పుడు ప్రయోగాలు జరపవలసిందల్లా ఈ అలవాటును పోగొట్టడ మెలాగనే ఈ ప్రయోగాలేవో ముందు సీమ కుందేళ్ళ పైనే చేసి అవి జయప్రదమైతే మానవులకు కూడా వాటినే అవలంబించడం మంచిది

ప్రతి మతప్రవక్త "సత్యంవద, దర్మంచర" అనే చెబుతాడు దానికి సులభ మార్గాలు మాత్రం ఒక్కడూ చెప్పడు. అలాగే ధూమపానం చెడ్డదని, దాన్ని మానివేయాలని ప్రతి శాస్త్రజ్ఞుడు చెప్పేవాడే; సులభోపాయాలను అన్వేషించమనండి. అప్పుడు తేలుతుంది వైద్య శాస్త్రం పస!

# అచ్చు తప్పు

అచ్చు తప్పును ఇంగ్లీషులో "ప్రింటర్స్ డెవిల్" అంటారు ఇటీవల కలకత్తా కార్పొరేషన్ వారు తమ స్కూళ్ళలో ఒకటవ తరగతికి పెట్టిన పాఠ్యపుస్తకంలోని ఒక అచ్చుతప్పు నిజంగా ఈ సంకేత నామానికి తగిందే

"నిజం చెప్పవద్దు" (సచ్ మత్ కహో) అన్నది ఆ అచ్చుతప్పు కొన్నాళ్ళ తర్వాత ఈ తప్పు గుర్తించి కార్పొరేషన్ అధికారులు ఆ పుస్తకాన్ని ఉపసంహరించా రనుకోండి

క్రైస్తవుల విశ్వాసం ప్రకారం దేవుని విరోధి సైతాను ఇతన్ని "డెవిల్" (పిశాచం) అనికూడా అంటారు ఆది మానవులైన అదమ్, ఈవ్‌లు మొదటి సారిగా పాపం చేయడానికి ఇతడే కారకుడు మంచివారి అంతరాత్మలలో ప్రవేశించి, చెడు సలహాలిచ్చి ప్రలోభాలు చూపి, వారికే తెలియకుండా వారిని చెడుత్రోవన పెడతాడు ఆ విధంగా దేవునిపై పగ తీర్చు కుంటాడు

ముద్రణాలయాలలో ప్రమాదవశాత్తు జరిగే అచ్చు పొరపాట్లవల్ల ఆశించిన అర్థం తారుమారై పోతూ వుంటుంది అది సైతాను ఆకతాయి చర్యగా - ఛలోక్తి కోసమే ననుకోండి- మొదట ఎవరు వర్ణించారో తెలియదు గాని, "ప్రింటర్స్ డెవిల్" అనే నానుడి వాడుకలో స్థిరపడి పోయింది

"నిజము చెప్పవలెను" అనే వాక్యం"నిజం చెప్పవద్దు"అని మారి పోయిందంటే అది సైతాను పనికాక, మరి ఎవరిదై వుంటుంది?

# లోహియా ఉపమానం

ప్రమాదో ధీమతా మపి" అన్నారు ఇండియా ప్రభుత్వపు అలీన విధానాన్ని అవహేళన చేయడానికి డాక్టర్ లోహియా ఎంచుకున్న ఉపమానం ఆయన విమర్శకే బెడిసి కొట్టింది

ప్రధాని ఇందిరా గాంధి వాషింగ్టన్‌లో అమెరికాకు, మాస్కోలో రష్యాకు అనుకూలంగా ప్రకటనలు చేశారని, ఇది గంగలో మునుగుతూ గంగను, యమునలో మునుగుతూ యమునను స్తోత్రంచేసే భక్తుని పద్ధతిలో వున్నదని ఆయన మొన్న లోక్‌సభలో పోలిక తెచ్చారు

ఈ ఉపమానం మన అలీన విధానాన్ని సమర్థించేదిగానే వున్న దన్న స్వారస్యాన్ని తీసిన ఘనత ఒక కాంగ్రెస్ సభ్యునికి దక్కింది గంగ, యమున చాలదూరం వేర్వేరుగా ప్రవహించినా చివరకు సంగమిస్తాయి ఈ కలయిక కూడా ప్రధాని ఇందిరాగాంధి స్వస్థలమైన అలహాబాదు (ప్రయాగ) లోనే కావడం ఈ ఉపమానానికి మరింత సార్థకత కలిగిస్తున్నది

అమెరికా, రష్యాలు డాక్టర్ లోహియా పోల్చినట్టు గంగా, యమునలవంటివే. అయితే, అవి అంత అనివార్యంగాను ఎక్కడో ఒక చోట కలియక తప్పదు నిజానికి, ఇండియా వంటి పెక్కు దేశాల అలీన విధానం ఆ రెండు దేశాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధపు తీవ్రతను తగ్గించడానికి తోడ్పడిం దనడంలో సందేహం లేదు

ప్రయాగలో గంగా, యమునలే కాక, అంతర్వాహినిగా సరస్వతీ నదికూడా కలుస్తున్నదని చాలామంది విశ్వసిస్తారు ప్రాక్పశ్చిమ కూటాల మధ్య శాంతియుత సహజీవనానికి ప్రోది చేసిన అలీన విధానాన్ని ఈ అంతర్వాహినితో పోల్చవచ్చునేమో

# ప్రయాణాల వేగం

వైజ్ఞానికంగా, సాంకేతికంగా ప్రపంచం ఈనాడు అతి వేగంగా పురోగమిస్తున్నది కొన్నేళ్ళ క్రిందట కేవలం అసంభవాలుగా, సైన్సు నవలలు వ్రాసేవారి సుందర స్వప్నాలుగా భావించ బడిన అనేకాద్భుతాలు ఈనాడు మన కళ్ళెదుట నిజాలుగా రుజువౌతున్నాయి

వీటిలో ఒకటి మన ప్రయాణ సాధనాలలో వస్తున్న మార్పు అంతకంతకు అతివేగంగా ప్రయాణం చేసే సాధనా లిప్పుడు లభ్యమవుతున్నాయి ఒకప్పుడు రైలొక వింత, విమాన మొక విడ్డూరం ఈనాడు అవి సర్వ సామాన్య వాహనాలు

వీటి ప్రయాణ వేగాన్ని పెంచడానికి జరుగుతున్న ప్రయత్నాలు సంతోషించ దగినవే అయినా, వేగంతో పాటు భద్రతకూడా పెరిగితే ఎంత బాగుండును ! వేగాన్ని పెంచడంలో కృతకృత్యు లవుతున్న శాస్త్రజ్ఞులు భద్రతను పెంచడంలో ఎందుకు విఫలురవుతున్నారో ఈ వైఫల్యం వల్లనే కదా మొన్న మాంట్ బ్లాంక్ వద్ద ఎయిర్ ఇండియా విమానానికి జరిగిన ప్రమాదం వంటివి సంభవిస్తున్నాయి ·

మరొక పదేళ్ళలో శబ్దవేగానికి రెండు మూడు రెట్ల వేగంతో పయనించే విమానాలు వాడకంలోకి రానున్నవట లండన్‌లో ఫలహారం మాత్రమే తీసుకొని విమానమెక్కిన వ్యక్తి భోజనాలవేళకు న్యూయార్క్ చేరుకోవచ్చునట అంతేకాదు, మరొక 15 ఏళ్ళలో రాకెట్ విమానాలుకూడా రానున్నవట బొంబాయి నుంచి న్యూయార్క్‌కు 39 నిమిషాలలో, టోక్యోకు 29 నిమిషాలలో వెళ్ళవచ్చునట

నాలుగు రోజుల ప్రయాణంలో చంద్ర లోకానికే వెళ్ళిరావడానికి మానవుడు సన్నాహాలుచేస్తుండగా భూలోకంలో ఈ వేగాలను సాధించడం ఒక ఆశ్చర్యం కానక్కర లేదు కాని, నిజంగా ఇంతవేగపు ప్రయాణాలు అవసరమా ?

నానాటికి పెరుగుతున్న జీవన గమన వేగానికి, ఆధునిక మానవుడి అస్తిమిత మనస్తత్వానికి ఈ ప్రయాణ సాధనాల వేగం ఒక చిహ్నం వంటిది తీరా రాకెట్ విమానాలు వచ్చిన తరువాత, స్తిమితంగా రైళ్ళలోనో, ఓడల లోనో కూర్చుని, తీరుబడిగా పరిసర ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ప్రయాణం చేసే రోజులే ఎంతో హాయిగా తోచవచ్చు

# ఏది అసలు ఇంగ్లీషు ?

ఇండియాలో ఇంగ్లీషు మాట్లాడేవారి సంఖ్య పూర్వం కంటె ఎక్కువైనదని, దీనివల్ల "ఇండియన్ ఇంగ్లీషు" ఎక్కువైనదని బ్రిటిష్ కౌన్సిల్ డైరెక్టర్—జనరల్ సర్ పాల్ సింకర్ ఇటీవల వెల్లడించిన అభిప్రాయంతో ఎవరూ విభేదించవలసిన అవసరం లేదు

ఇది నిజమే ఆయన చెప్పినట్లు ఇంగ్లీషు మాతృభాష అయిన దేశాలలో కూడా ఉచ్చారణలో, వాక్య విన్యాసంలో ఎన్నో భేదాలున్నాయి ఉదాహరణకు ఇంగ్లీషువారి ఇంగ్లీషుకు, అమెరికా, ఆస్ట్రేలియాల వంటి దేశాలలో ఇంగ్లీషుకు కొన్ని భేదా లున్నాయి ఇంగ్లీషువారు "షెడ్యూల్" అని ఉచ్చరించినదాన్ని అమెరికనులు "స్కెజూల్" అని ఉచ్చరిస్తారు ఇటువంటి ఉదాహరణ లెన్నైనా చూపవచ్చు కాగా, ఇంగ్లీషు పరభాష అయిన ఇండియాలో ఉచ్చారణ భేదా లుండడం అబ్బురం కాదు

దీనివల్ల భాషా సౌందర్యం చెడుతున్నదని సర్ పాల్ అభిప్రాయం కావచ్చు, అందుచేతనే ఆయన ఈ విభేదాలను అరికట్టడానికి తమ సంస్థ ప్రయత్నిస్తున్నదని కూడా చెప్పారు వారి ప్రయత్నాలేవో తెలియదుకాని అవి ఫలించగల వనుకోవడం అడియాసే

ఎందుకంటే ఇండియాలో "ఇండియన్ ఇంగ్లీషే" కాదు, ఒక్కొక్క భాషాప్రాంతంలో ఒక్కొక్క ఇంగ్లీషు వినిపిస్తుంది తెలుగు ఇంగ్లీషు వేరు, తమిళ ఇంగ్లీషు వేరు, మహారాష్ట్ర ఇంగ్లీషు వేరు, బెంగాలీ ఇంగ్లీషు వేరు తెలుగు అజంత భాష కావడంతో తెలుగు వారు ఇంగ్లీషును కూడా అజంతంగానే మాట్లాడ్డం కద్దు మహారాష్ట్రులు వొత్తులను మరింత వొత్తి పలుకుతారు తమిళులు వాటిని పూర్తిగా వదిలివేస్తారు బెంగాలీలు "వ" కారా లన్నిటిని "బ" కారాలుగా మార్చివేస్తారు, లాఇ ఎన్ని రకాల ఇంగ్లీషైనా వుంది

ఉచ్చారణ భేదం పరభాషలకు మాత్రమే వర్తిస్తుందనుకో నక్కర లేదు మాతృభాషలో సయితం ఈ భేదా లుంటాయి లండన్‌లో పేట పేటకు, వీధి వీధికి ఇంగ్లీషు ఉచ్చారణ భేదాలను ఆధారం చేసుకునే బెర్నార్డ్‌షా "పిగ్మాలియన్" నాటకం వ్రాశాడు తెలుగులో సయితం రాయలసీమ, తెలంగాణా, సర్కార్ జిల్లాలవారి ఉచ్చారణలలో ఎన్ని భేదాలు లేవు? వీటిని తొలగించడం ఎవరి తరం?

మాతృభాషలో ఉచ్చారణ సంప్రదాయాన్ని బట్టే సాధారణంగా పరభాషోచ్చారణ కూడా వుంటుంది పరబాషను యథాతథంగా పలకాలనే ప్రయత్నం మరీ అతిగా వెడితే మాతృభాషోచ్చారణ కూడా అదే వర వడిలో భ్రష్టమై పోవచ్చు అందుకే తెలుగును ఇంగ్లీషువలె ఉచ్చరించే వారు అప్పుడప్పుడు తటస్థపడుతూ వుంటారు

ఒకరి అభిప్రాయం మరొకరికి సరిగా సరఫరా అయినంత కాలం ఈ తేడాలవల్ల వచ్చేనష్టం లేదు కనీసం వాటివల్ల అప్రయత్నంగా సిద్ధించే హాస్యం కోసమైనా అవి వుండవలసిందే.

# తొలి కాన్పులో తొమ్మండుం గురు

ఒకే కాన్పులో ఇద్దరో ముగ్గురో పుట్టడం విశేషం కాదు గాని, అంతకు మించి ఎందరు పుట్టినా అది వార్తే అటువంటిది తొమ్మిది మంది జన్మించడం మహా విచిత్రవార్త

తూర్పు పాకిస్తాన్‌లోని సిల్హెట్ జిల్లాలో ఒక స్త్రీ తొమ్మిది నెలలు మోసి తొలి కాన్పులోనే తొమ్మిది మంది పిల్లలను కన్నదట పాపం ఆ తల్లి ఎంత కష్టపడి వుండాలో, ఆమెకు పాకిస్తాన్ ప్రభుత్వం వీర వనిత అనో, మహామాత అనో బిరుదిచ్చినా ఇవ్వవచ్చు

ఒక జీవిత కాలంలో కనదగినంత మంది పిల్లలను పాతికేళ్ళకే కన్నందుకు ఆమె భర్త సిగ్గుపడుతున్నాడో, గర్వపడుతున్నాడో తెలియదు గాని, అతడు కుటుంబ నియంత్రణకు తక్షణం దీక్ష వహించవలసిన సందర్భమే ఇది

పిల్లలకు పేర్లు పెట్టడం దగ్గిరే అతనికి చిక్కంతా వస్తుంది ఎవరికైనా, పిల్లల సంఖ్య పెరుగుతున్నకొద్దీ, పేర్లు వెదకడం చెడ్డ బాధే మరి ఒక్కసారిగా తొమ్మిది పేర్లు ఆలోచించడం సామాన్యమా? నవరత్నాల పేర్లో, నవగ్రహాల పేర్లో పెట్టుకోవాలి అది కూడా ఇబ్బందైతే, ఒకటి, రెండు, మూడు అని నంబర్లు ఇవ్వొచ్చు

అప్పటికీ ఆ తల్లి దండ్రుల స్థితి దయనీయంగానే మిగిలిపోతుంది కవల పిల్లలలో సయితం ఎవరెవరో పోల్చుకోవడం తల్లిదండ్రులకు కూడా ఒక్కొక్కసారి సమస్యగా పరిణమిస్తుంది మరి తొమ్మిదిమందిలో ఒక్కొక్కరిని గుర్తుపట్టడం ప్రాణాంతకమే తొమ్మిదిమందికి తొమ్మిది గుర్తులు పెట్టుకుంటే తప్ప ఆ పిల్లలకైనా సమస్యే ఒకరు చేసిన తప్పుకు మరొకరిని దండించడంవంటి "కామెడీ ఆఫ్ ఎర్రర్స్" ప్రతి దినం జరిగిపోతూ వుంటుంది

# వర్షాల కోసం

మధ్యప్రదేశ్‌లో హర్దా అనేచోట మొన్న కొందరు గ్రామీణ స్త్రీలు పురుషవేషాలు ధరించి, హలాలు పట్టుకుని పొలాలు దున్నారట ఇలా చేస్తే మేఘాధినాధుడైన ఇంద్రుడు సంతోషించి వర్షాలు కురిపిస్తాడట

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క నమ్మకం. మనవైపున కూడా నిన్న మొన్నటి వరకు కప్ప తిరుణాళ్ళ చేయడం ఒక ఆచారం ఇప్పటికీ ఇది కొన్ని వూళ్ళలో వున్నదేమో కప్పలకు "పెళ్లి"చేసి ఒక పెద్ద పాత్రలో వుంచి, నీళ్ళు పోయడం, ఆ పాత్రను మోస్తున్న వారిపై పేడనీళ్ళు చల్లడం, ఊరేగింపుగా వెళ్లి కప్పలను చెరువులో కలపడం చేస్తారు ఇలా చేస్తే వానలు కురుస్తాయని నమ్మకం

వరుణ పూజ చేస్తే, దేవాలయాలలో ప్రార్ధనలు చేస్తే, యజ్ఞయాగాదులు చేస్తే వానలు కురుస్తాయని కొందరు నమ్మడం లేదా? అటువంటివే ఈ నమ్మకాలు కూడా

మన పురాణగాధల ప్రకారం ఇంద్రునికి మారు వేషాలపై ప్రీతి జాస్తి చాలా సందర్భాలలో అతడు స్వయంగా మారు వేషాలు వేశాడు హర్దా ప్రాంతంవారు నమ్ముతున్నట్టు స్త్రీలను పురుష వేషాలలో చూడడం అతనికి ఉత్సాహకరమేమో! అలాగే పురుషులు స్త్రీ వేషాలలో తనను కొలిస్తే అతడు ఇంకా ఎక్కువ సంతోషించవచ్చు

ఏమైనా, కడచిన రెండేళ్లగా ఇంద్రుడు ఎందుకోగాని మనపై అలిగాడు హర్దా స్త్రీల పుణ్యమా అని అతని అలకతీరి, వర్షాలు కురిస్తే మంచిదే!

# స్వర్గంలో సగం

మన పురాణాలు పేర్కొన్న స్వర్గం స్వర్గం ఎందుకైంది? మన పూర్వులు స్వర్గలోకాన్ని ఎందుకు ఊహించుకున్నారు?

భూలోకంలో అన్ని కోర్కెలు తీరవు కొందరికి సగమైనా తీరవు కొందరికి అసలే తీరవు అందుచేత. కోరినవన్నీ తీరే ఒక లోకాన్ని ఊహించుకోవలసి వచ్చింది కనీసం మరణానంతరమైనా అక్కడికి వెళ్ళే అవకాశాన్ని కల్పించుకోవలసి వచ్చింది

స్వర్గంలో మళ్ళీ మన కెట్టి ఇబ్బంది కలగకుండా, కోరిన వెంటనే అన్ని కోర్కెలను తీర్చే సాధనాలనుకూడా మనవారు ఏర్పాటు చేసి పెట్టారు ఒకటి కామధేనువు, మరొకటి కల్పవృక్షం, వేరొకటి చింతామణి ఇంకా ఏవేవో వున్నాయి

వీటిలో కనీసం ఒకదాన్ని భూలోకానికి లాక్కు రావాలన్న సంకల్పం మద్రాసు ప్రభుత్వానికి కలిగినట్టుంది. అందుకే కాబోలు మొనష్ మద్రాసులో ప్రారంభించిన సూపర్ మార్కెట్‌కు "కామధేను" అని పేరు పెట్టారు.

అయితే, అసలు కామధేనువు అడిగినవాటిని ఉచితంగా ఇస్తుంది. మద్రాసు కామధేనువు ఏదీ వూరికే ఇవ్వదు, కనీసం పాలైనా ఇవ్వదు అన్నీ డబ్బు పుచ్చుకునే మరీ ఇస్తుంది

అన్నీ అంటే సమస్తం అని కాదు అసలు కామధేనువు అన్ని కోర్కెలు తీరుస్తుంది కొండమీది కోతి నుంచి, ఒడిలోకి రంభ వరకు ఏ దడిగినా ఇస్తుంది మద్రాసు కామధేనువుకు ఆ శక్తి లేదు నిత్యావసర వస్తువులను మాత్రం వీలైనన్నిటిని సమకూర్చుతుంది

పోనీ, వాటినైనా సక్రమంగా అందజేస్తే చాలు, అవికూడా కరువుగా వున్నాయిగదా· పోనీ డబ్బు పుచ్చుకున్నా ఫరవాలేదు, చౌకగా ఇస్తే చాలు పూర్తి కామధేనువు కాకపోయినా సగం కామధేనువే చాలని, అదే సగం స్వర్గమని సంతోషిస్తారు ప్రజలు

కామధేనువును మద్రాసు వారు కట్టివేసుకున్నారు కనుక, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కూడా హైదరాబాదు, విశాఖపట్టణాల ప్రజలను ఇక ఆట్టే నోరూరించడం మానివేసి, కల్పలతను, చింతామణిని త్వరలో తీసుకు రావడం మంచిది

# డీ సికా

ప్రపంచ చలన చిత్ర రంగంలో ఒక తరాన్ని ప్రభావితం చేసిన ప్రతిభాశాలి మొన్న రోమ్‌లో శాశ్వతంగా కన్నుమూసిన విట్టోరియా డీ సికా రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇటలీలో, దానితోపాటు మరి పెక్కు దేశాలలో చలనచిత్ర కళను ఆయన ఒక కొత్త మలుపు తిప్పాడు

నిత్య జీవితంలో నుంచి ఆయన తన కథా వస్తువులను ఎన్నుకున్నాడు కార్మికులు, నిరుద్యోగులు, కూటికోసం పడుపువృత్తిని చేపట్టే అభాగ్య స్త్రీలు—ఇట్టివారిని ఆయన పాత్రలుగా తీసుకున్నాడు వారిపట్ల అపారమైన కారుణ్యభావంతో, మానవతా దృక్పథంతో, అదే సమయంలో ప్రస్తుత వ్యవస్థపట్ల నిశితమైన విమర్శతో ఆ కథా వస్తువులను ఆయన కళాత్మక దృష్టితో చిత్రించాడు దీనికి "నియో రియలిజం" (నవ్య వాస్తవికత) అని పేరు వచ్చింది ఈ ధోరణికి చెందిన చిత్రాలకు మరొక ఇటాలియన్ దర్శకుడు రాబర్టో రొజెలినీ ("ఓపెన్ సిటీ రోమ్") మార్గదర్శకుడైనా, 'బైసికిల్ తీవ్స్' 'షూషైన్' వంటి చిత్రాలతో డీ సికా గొప్ప కీర్తిని ఆర్జించాడు

డీ సికా ప్రభావం ఇండియాలో కూడా సుమారొక పాతికేళ్ళ క్రిందట కొన్నాళ్ళపాటు ప్రసరించింది డీ సికా చిత్రాలు సత్యజిత్ రాయ్‌ని ఉత్తేజితుడిని చేసిన వనడం అతిశయోక్తి కాకపోవచ్చు బిమల్ రాయ్‌ని పోలిన మరెందరో అభ్యుదయ వాదులకు సయితం ప్రేరణ డీ సికా చిత్రాలనుంచే వచ్చింది ఆఖరికి తెలుగు చిత్రసీమపై కూడా డీ సికా ప్రభావం పడింది, క్రమంగా ఇటలీలో వలె, తక్కిన దేశాల వలె ఇండియాలో కూడా ఈ ప్రభావం అంతరించింది

అయినా ప్రపంచ చలనచిత్ర చరిత్రలో ఒక ఉజ్వలాధ్యాయానికి దేశికాగ్రణిగా డీ సికా పేరు చిరస్థాయిగా నిలిచి వుంటుంది,

# పొడుగు పేర్లు

పిల్లలకు పేర్లు పెట్టడం దగ్గిర ఎన్ని పేచీలైనా వస్తాయి నాయనమ్మకొక పేరిష్టం తాతగారి కింకొక పేరిష్టం అత్తగా రొక పేరు చెబుతారు, మామగా రింకొకటి చెబుతారు, ఇంకా పినతండ్రులు, మేనమామలు, తోటికోడళ్ళు మరదలు తలొక పేరు చెబుతారు. తల్లికి, తండ్రికి ఒకరికి నచ్చిన పేరు మరొకరికి నచ్చదు పోతే, విధిగా చేర్చవలసిన ఇష్టదైవాల పేర్లుంటాయి ఇందరిని సంతృప్తిపరచడానికి ఇన్ని పేర్లు కలిపిపెడితే, అది కొండవీటి చాంతాడువలె తయారవుతుంది

ఇంగ్లండులో మొన్న నొక తాపీ పనివాడికి, అప్పుడే పుట్టిన తన కుమార్తెకు పేరేమి పెట్టాలని సమస్య రాలేదుగాని, మొత్తంపై ప్రపంచంలోకెల్లా పెద్ద పేరు పెట్టేశాడు అతనికి ఫుట్‌బాల్ పిచ్చి జాస్తి. అందుచేత తనకు మరీ ఇష్టమైన లివర్‌పూల్ ఫుట్‌బాల్ జట్టులోని ఆటగాళ్ళందరి పేర్లు కలిపాడట. ఇంకా రిజర్వు ఆటగాని పేరు, ఆ జట్టుకు చెందిన కార్యకర్తల పేర్లుకూడా చేర్చాడట గ్రంధ విస్తరణ భీతిచేత ఆ పేర్లన్నీ ఇక్కడ ఇవ్వలేకపోతున్నాము గాని, ఆ పాప పేరు "పాలా" అని మొదలై, ఏవేవో పదిహేనుపేర్ల తరువాత "ఓ సలివాన్" అనే ఇంటి పేరుతో అంతమవుతుంది.

పాపం, ఆ పిల్ల పెరిగి పెద్దదైన తరువాత చాలా ఇబ్బందిపడాలి ముందు తన పేరు తానే కంఠస్థం చేసుకుని వుండాలి ఒక వేళ బట్టీ పట్టినా, నీ పేరేమిటని ఎవరైనా అడిగితే, పేరు పూర్తిచేసేలోపల ఎదుటివారు విసుగుపుట్టి వెళ్ళిపోవచ్చు అందుకే గాబోలు తండ్రి ఆమె పేరు వ్రాసిన అట్టకు ఫ్రేము కట్టించి ఇంటిలో ఎదురుగా వ్రేలాడదీశాడట అన్ని పేర్లలో దేనితో పిలిచినా ఆ పిల్ల తననేనని గ్రహించి బదులు పలకాలి హాజరు పట్టీలో ఆమె పేరు చాలా పంక్తులు పడుతుంది కనుక అమెను ఏ స్కూలూ చేర్చుకోకపోవచ్చు తోటిపిల్లలు తలొక పేరుతో హేళన చేయవచ్చు

ఎవరి వెర్రి వారి కానందం కావచ్చుగాని, తమ పిల్లల పేర్లతో ఇలా చెలగాటమాడే హక్కు తండ్రుల కున్నదా? పెద్దయిన తరువాత ఆ పిల్ల తన తండ్రి తనపట్ల క్రూరంగా ప్రవర్తించినందుకు కేసు పెట్టినా తప్పులేదు

# నిలువు జీతం

ప్రతి పెద్ద పట్టణంలోను, నాలుగు రహదార్లు కలిసే ప్రతి కూడలిలోను అతడు తప్పక కనిపిస్తాడు ఎండనక, వాననక, చలి అనక అతడు ఏ ప్రొద్దు చూచినా కనిపిస్తాడు సాధారణ ప్రజ కంటె అతడు కొంత ఉన్నత వేదికపైనే నిలబడతాడు, కాని అతడు చేసేది మటుకు నిలువు జీతమే

ఒకసారి కుడిచేతితో, మరొకసారి ఎడమ చేతితో, వేరొకసారి రెండు చేతులతో అతడు రకరకాలుగా విన్యాసాలు చేస్తాడు తూర్పు పడమర, ఉత్తర దక్షిణం అన్ని దిశలకు తిరుగుతాడు అయినా ఉన్నచోటు నుంచి అంగుళమైనా కాలు కదల్చడు

మేము వ్రాస్తున్నది ట్రాఫిక్ పోలీసు గురించి అని పాఠకులీపాటికే గ్రహించి వుంటారు. అతడిని ప్రతివారు, ప్రతినిత్యం తప్పకొని వెడుతూ అతని ముఖమైనా ఎన్నడూ సరిగా చూడకపోయినా, అతని అంగ విన్యాసాలు అందరికి పరిచితమైనవే,

అతడు అలా నిలబడి నిలబడి అలసి పోవచ్చు, కాళ్ళు పీకవచ్చు, చేతులు నొప్పి పుట్టవచ్చు అయినా అతడు ఆ అలసటను ఏమాత్రం కనిపించనీయకుండా విధినిర్వహణను చేస్తూనే వుంటాడు అతడు ఏ మాత్రం ఏమరుపాటు చూపినా ఎన్ని ప్రమాదాలో జరగవచ్చు

మామూలు పోలీసులకంటె అతని బాధ్యతలు క్లిష్టమైనవి ట్రాఫిక్‌ను అదుపు చేయడం మాత్రమేకాదు పౌరులకు ఏ విధమైన సహాయం కావలసివచ్చినా చేయడం కూడా అతని విధిలో భాగం లండన్ ట్రాఫిక్ పోలీసుల స్నేహపాత్రత, సౌజన్యం జగత్ప్రసిద్ధమైనవి

అందుచేతనే న్యూఢిల్లీలో కేంద్ర సచివాలయం వద్ద విజయచౌక్‌లో నిలబడే ట్రాఫిక్ పోలీసులకు సరియైన గొడుగు ఏర్పాటుచేయడంపట్ల స్వర్గీయ నెహ్రూ కొన్ని సంవత్సరాలపాటు ఎంతో శ్రద్ధవహించారన్న వార్త ఆశ్చర్యం కలిగించింది, అందరికి రక్షణ కలిగించే ట్రాఫిక్ పోలీసులకు ఎండ నుంచి, వాననుంచి రక్షణ కల్పించే బాధ్యతను ఆయన గుర్తించడం న్యాయమేకాదా?

# నిజమైన మైత్రి

అరుదుగా తప్ప లభించని వాటికే ప్రపంచంలో విలువ బంగారం అరుదైనదే ప్లాటినం మరింత అరుదైనది యురేనియం ఇంకా అరుదు. అందుకే వాటికంత విలువ

కాని, జీవితంలో అన్నిటి కంటె అరుదైనవి కల్తీలేని చిరునవ్వు, కల్మషం లేని మాట, కష్ట కాలంలో చేయూత, కలకాలం నిలిచే మైత్రి! అవి ఎదురైనప్పుడు కలిగే సంతోషానికి ఖరీదు కట్టడం ఏ షరాబు తరం?

జీవితం గడుస్తున్న కొద్దీ, పాత మిత్రులు పోతూ వుంటారు, కాని, పాత మిత్రులను మరిచిపోకుండా, తమ అంతస్తు పెరిగినా ఆప్యాయత మాత్రం తరగకుండా నిలుపుకోగలిగిన వారెంద రుంటారు?

మొన్న శ్రీమతి ఇందిరా గాంధి డార్జిలింగ్ వెళ్ళినప్పుడు తాను చిన్ననాడు శాంతి నికేతన్‌లో విద్యాభ్యాసం చేస్తున్న కాలంలో తనకు తోడుగా వుండే మిత్రుని కలుసుకుని కుశల ప్రశ్నలు వేశారట ఆ మిత్రు డిప్పుడు ఎక్కడో నౌకరుగా పని చేస్తున్నాడట ఆమె ఇప్పుడు ఒక పెద్ద దేశానికి ప్రధాని ఆమె అతనికేమీ సహాయం చేయకపోవచ్చు, చేసినా అతడు స్వీకరించకపోవచ్చు కాని, తనను చూసి, చిన్ననాటి ముచ్చట్లు జ్ఞప్తికి తెచ్చుకొనడానికి అంగీకరించడమే అతనికి మహదానందం కలిగించిందట

కుచేలుడు, శ్రీకృష్ణుడువలె ద్రోణుడు, ద్రుపదుడు చిన్ననాటి సహాధ్యాయులే అయినా తన వద్దకు భిక్షార్థియై వచ్చిన కుచేలుడిని కృష్ణుడు ఆదరిస్తాడు, ద్రోణుడిని ద్రుపదుడు నిరాదరిస్తాడు జీవితంలో వారూ వుంటారు, వీరూ వుంటారు. ఎటొచ్చీ మొదటివారు అరుదుగా కనిపిస్తారు అందుకే వారికంత విలువ

# ఎన్ని నాల్కలు ?

మనిషి కొకటే నాల్క, పాములకు రెండు కాగా, తడవ కొక విధంగా మాట్లాడే మనుష్యులకు కూడా రెండేసి నాల్కలుంటాయని వాడుక

అయితే, కేంద్ర ప్రభుత్వానికి నాలుగునాల్కలున్నాయని మొన్న రాష్ట్ర శాసనసభలో శ్రీ తెన్నేటి విశ్వనాథం గారు చెప్పారు ప్రధాన మంత్రి దొక మాట, మంత్రిది మరొకమాట, ఆయన మంత్రిత్వ శాఖ వారిది వేరేమాట ప్లానింగ్ కమిషన్‌ది ఇంకొక మాట

అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ స్థలం సమస్య ప్రస్తావనకు వచ్చిన సందర్భంలో శ్రీ విశ్వనాథంగారు నాలుగు నాల్కలను పేర్కొన్నారు గాని, సాధారణంగా ప్రభుత్వాలకు నాలుగేమి ఖర్మ, నలభై నాల్కలుంటాయి మంత్రి స్థాయినుంచి క్రిందికి వస్తున్న కొద్దీ, నాల్కల సంఖ్య పెరుగుతూ వుంటుంది కార్యదర్శి దొకమాట, ఉప కార్యదర్శి దొకమాట, ఇంకా క్రింది అధికారి దింకొక మాట ఈ విధంగా గేటువద్ద బంట్రోతువరకు పోతే ఎన్ని నాల్కలైనా, ఎన్ని రకాలుగానైనా మాట్లాడ్డం వినిపిస్తుంది ఇన్ని రకాల మాటల పద్మ వ్యూహంలో, జరగవలసిన పని చిక్కుపడి గిలగిల కొట్టుకుంది, అభిమన్యుడివలె అది తరచుగా నిహతమై పోతుంది కూడా

వేర్వేరు నాల్కలతో మాట్లాడ్డంవల్ల ప్రభుత్వాలకు చాలా ప్రయోజనా లుంటాయి చేస్తామని చెప్పిన పని వెంటనే చేయనక్కరలేదు ఒకటి చెప్పి మరొకటి చేయవచ్చు చెయ్యగూడని పని చేస్తే బాధ్యతను మరొక నాల్క మీదికి తోసివేయవచ్చు నాల్కల సంఖ్యనుబట్టి ఇంకా ఎన్ని ప్రయోజనాలైనా సాధించవచ్చు

# మంత్రులు, సుమంత్రులు

ప్రతి మంత్రీ ఒక కంత్రీ అని ఒక అభిప్రాయం ఇటీవల స్వైర విహారం చేస్తున్నది మంత్రి అయిన ప్రతివాడికి బంధు, మిత్ర, పక్షపాతం పక్షవాతంవలె సంక్రమిస్తుందని ఒక పుకారు షికారు చేస్తున్నది

వీటికి కొందరు ప్రతిపక్ష నాయకులు పని కట్టుకుని మహారాజ పోషకులుగా వ్యవహరిస్తూ వుంటా రనుకోండి కాని, నిజానికి అవి రూపాయికి నూరు పైసల నిజాలు కావు జాగ్రత్తగా వెదకాలేగాని, మంత్రులలోకూడా సుమంత్రులు దొరక్కపోరు

కాశ్మీర్ పునరావాసశాఖ మంత్రి శ్రీ త్రిలోచన్ దత్‌ను ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు ఈ మధ్య ఆయన కుమారు లిద్దరిని పోలీసులు అరెస్టు చేశారు వారి తప్పు పెద్దదేమీ కాదు ఏదో చర్చిలో వారు అనుమతి లేకుండా ప్రవేశించారట వారివల్ల తప్పుంటే చర్య తీసుకోవలసిందిగా మంత్రి ఆదేశించారు దానిపై అరెస్టు జరిగింది

మంత్రు లందరూ ఇదే విధంగా ప్రవర్తిస్తే ఎంత బాగుండును! అప్పుడు పార్లమెంటులో లోహియా, లిమాయే, ముఖర్జీ వంటి నాయకులకు పెదవి విప్పే అవకాశం కూడా దక్కదు

మంత్రులు, వారి పుత్రులు, మిత్రులు ఆశ్రితులు అందరివంటి వారే గాని దేవలోకం నుంచి దిగివచ్చినవారు కారుగదా! ప్రజలందరికి వర్తించే చట్టాలు వారికీ వర్తిస్తాయి మంత్రుల చుట్టాలకు వేరే చట్టాలుండవుకదా!

వెనకటికి రాజుల రోజులలో కూడా, బెజవాడ నేలిన మాధవ వర్మ అజాగ్రత్తగా రథం తోలి ఒక పౌరుని మరణానికి కారకుడైన తన

కుమారునికి మారకశిక్ష విధించాడట ఆ మాధవవర్మపై దేవతలు కనక వర్షం కురిపించారట

బంగారంపై కంట్రోలు వున్న ఈ రోజులలో దేవతలకైనా ఆ పని సాధ్యం కాదుగాని, కనీసం వేమనగారైనా ఈనాడు బ్రతికి వుంటే, తన పద్యాన్ని కొద్దిగా మార్చి శ్రీ త్రిలోచన్ దత్‌ను ఇలా కీర్తించేవాడు

"ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
మంత్రులందు మంచి మంత్రులు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ!"

# ధరల పట్టిక

ప్రతి అంగడిలోను వస్తువులకు ధరలు వ్రాసి బహిరంగంగా ప్రదర్శిం చాలని ప్రభుత్వం కొత్త ఉత్తర్వు జారీ చేసింది ఇది నిజానికి కొత్త ఉత్తర్వుకాదు. 1963 నాటి ఉత్తర్వుకే కొత్త రంగు పూసి 1966 మోడల్ ఉత్తర్వుగా ప్రకటించింది

ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసినంత మాత్రానే పనులు జరిగి పోతే, ఈపాటికి దేశం సకల సుఖ సౌకర్యాలతో తులతూగుతూ వుండేది ప్రతి ఉత్తర్వును ఉల్లంఘించడానికి లక్ష మార్గాలుంటాయి ఉంటాయని ప్రభుత్వానికి తెలుసు అందుకే కన్నిటి తుడుపుగా ఇటువంటి ఉత్తర్వు లేవో జారీ చేస్తూ వుంటుంది.

కొత్త ఉత్తర్వువల్ల ఏంజరుగుతుంది? ధరలపట్టిక కట్టినవారు కడ తారు,లేనివారు లేదు ప్రతిదుకాణానికి వెళ్ళిఅన్నివస్తువులకు ధరలు వేశారో లేదో. అవి నిబంధనల ప్రకారం వున్నాయో లేదో చూసే దెవరు ? వాని కెంత సిబ్బంది కావాలి? ఆ సిబ్బందికి ఎంత నిజాయితీ కావాలి? ప్రకటించిన ధరకు సరుకు దొరుకుతుందని హామీ ఏమిటి? ప్రభుత్వం నిర్ణయించిన ధర వర్తకుల కెప్పుడూ లాభసాటిగా వుండదు అందుచేత ఆ వస్తువులు చల్లగా చీకటి బజారులోకి జారుకుంటూ వుంటాయి

మన దేశంలో మార్పు దేనిలో కనిపించినా, దేనిలో కనిపించక పోయినా ధరలలో మాత్రం కనిపిస్తుంది, అవి పాదరసం వంటివి, ఒక చోట నిలకడగా వుండవు అయితే, వాటిది ఎంతసేపు పై చూపు. కిందిచూపు లేదు "ధర తగ్గుట హెచ్చుకొరకు" అన్నాడు సుమతీ శతకకారుడు అది సత్యకాలం మాట ఆ రోజులలో ధరలు తగ్గుతూ వుండేవి కాబోలు ఇప్పుడు హెచ్చుతూ పోవడమే తప్ప తగ్గడం లేదు. మరి, మనదేశంలో అభివృద్ధి జరగడం లేదని ఎవ రంటారు?

# అసలు కారణం?

పెళ్ళి అయిన కొత్తలో పెళ్ళాం మాట మగనికి బాగానే వినబడుతుంది ఆ రోజులలో ఆమె పలుకు కలకండ పలుకులా, ఆమె కంఠం కల కంఠంలా మధురంగా వుంటుంది భర్త భార్య అడుగులకు మడుగు లొత్తుతాడు, కొంగు పట్టుకుని కూడా కూడా తిరుగుతాడు, లెకపోతే, పెళ్లామే మగడిని కొంగున ముడి వేసుకుని చెంగు చెంగున తిరుగుతుంది బజారు నుంచి పువ్వులో, కూరలో తేవడం దగ్గిర నుంచి సమస్త విషయాలలో జవరాలి మాట జవదాటకుండా మగడు తిరుగులాడు

కాని, వయసు పైబడుతున్నకొద్దీ, మనసు మారిపోతుంది భార్య మాటలు భారంగా తోస్తాయి, పదిసార్లకి ఒకసారి పలుకుతాడు, ఇల్లాలు ఏది చెప్పినా కామరాజుగారి "పార్కులాం" పాలిసీతో తప్పుకు పోతాడు పువ్వుల సంగతి దేవుడెరుగును, అసలు ఇంట్లోవారు వస్తున్నారో, చస్తున్నారొ కూడా పట్టించుకోడు

కనీసం ఇది కలకాలంగా ప్రతి ఇల్లాలు చేస్తూ వస్తున్న ఫిర్యాదు మగనికి బొత్తిగా నిర్లక్ష్యం బలిసిపోయిందని, చెప్పిన మాట వినిపించు కోవడం మానివేశాడని భార్యలు ఇంతకాలంగా అభాండాలు వేస్తున్నారు భర్తలు కనుక భరిస్తూ వచ్చారు మగవాళ్ళు

కాని, ఇది నిజం కాదట భార్యల మాటలు వినబడకపోవడానికి శాస్త్రీయమైన కారణం వుందట "ఇదుగో మిమ్మల్నే, చెముడా?" అని మన సంసారాలలో తరచుగా వినబడేమాట, నిజంగానే వయసు పైబడు తున్న మగవారికి ఒక రకం చెవుడు వస్తుందట వారికి హెచ్చు స్థాయిలో శబ్దాలు వినబడవట మరి, సాధారణంగా భార్యల గొంతులు తారస్థాయిలోనే వుంటాయి అందుకని భార్యమాట వినబడ దన్నమాట ఈసంగతి ఒక అమెరికన్ డాక్టరు పరిశోధించి కనుక్కున్నాడు

అందుచేత, భార్యలు ఒక పనిచేస్తే మంచిది నెమ్మదిగా ప్రతి మాటకు ఉన్న ధోరణిలో "కాస్త కూరలు తెచ్చిపెడతారా?" అని అడగాలి, అప్పుడు భర్తకు చక్కగా వినబడుతుంది "ఆహా, ఏమా అణకువ, ఏమా వినయం," అని సంతోషించి బజారుకు పరిగెడతాడు

ఇంతకీ ప్రపంచంలో సగం కష్టాలకి, కలహాలకి కారణం అవ తలి వాళ్ళకి ఏ స్థాయిలో, ఎలా చెబితే వినబడుతుందో తెలుసుకోలేక పోవడమే,

# సుదూర లోకాలలో నాగరికత

విశ్వాంతరాళంలో ఎక్కడో నాగరిక లోకాలుండే అవకాశం లేకపోలేదట కొంత కాలం క్రిందట వినవచ్చిన కొన్ని చిత్రమైన రేడియో సంకేతాలనుబట్టి సోవియెట్ శాస్త్రజ్ఞులు ఈ విధంగా ఊహిస్తున్నారు సుదూర లోకాలలోని మానవులు మనతో మాట్లాడడానికి చేసే ప్రయత్నాలే ఆ సంకేతాలని వారి భావన.

ఇది వినగానే కొందరు "ఇవన్నీ వేదాల్లోనే వున్నాయిష." అన కుండా మానరు అయితే మన పూర్వులు పేర్కొన్న చతుర్దశ భువనాలు రష్యన్లు ఊహిస్తున్న లోకాలు ఒక టవునో కాదో మాకు తెలియదు మనవారు చెప్పిన రంభలు, ఊర్వశులు ఈ కొత్త లోకాలలో కలరో లేరో, కామధేనువు, కల్పవృక్షం, అమృతం, ఇత్యాదులు కలవో లేవో కూడా తెలియదు

భూమికి అత్యంత సమీపంగా వున్న ఆల్ఫా సెంటారై అనే నక్షత్రం మనకు 26 లక్షల కోట్ల మైళ్ళ దూరంలో వుంది సెకండుకు లక్ష 86 వేలమైళ్ళ ప్రయాణంచేసే కాంతితో దాదాపు సమాన వేగంతో వెళ్ళే ఫొటాన్ రాకెట్లలో ప్రయాణం చేసినా ఆ నక్షత్రాన్ని చేరడానికి మనకు నాలుగున్నర యేళ్ళకు పైనే పడుతుంది. "పాలవెల్లి" అనబడే నక్షత్రరాశి అక్కడికి ఇంకా పదివేల రెట్ల దూరంలో వున్నది ఇది మనం నివసించే బ్రహ్మాండం సంగతి ఇటువంటి బ్రహ్మాండా లెన్నో విశ్వంలో వున్నాయట వీటిలో దేనినుంచి రేడియో సంకేతాలు భూమిని చేరుకున్నవోగాని వాటి జన్మస్థలానికి వెళ్ళడం మానవ సాధ్యం కాని పని

అయినా, ఊహించుకొనడాని కేముంది? ఆ దూర లోకాల నాగరికత మన భూలోకంలో దానికంటె బాగానే వుండవచ్చు అక్కడ లంచ గొండితనం, రెడ్ టేపిజం లేకపోవచ్చు నోట్లు వెదజల్లితేగాని వోట్లు రావనే బాధ రాజకీయ నాయకులకు లేకపోవచ్చు. విద్యార్థులు క్రమ

శిక్షణతో ప్రవర్తిస్తూ వుండవచ్చు. లారీ ప్రమాదాలు మచ్చుకైనా లేక పోవచ్చు సకాలంలో వర్షాలు కురుస్తూ పంటలు పుష్కలంగా పండవచ్చు అణు విజ్ఞానం వున్నా, మారణాస్త్రాలకు కాక శాంతి కోసం వినియోగ పడుతూ వుండవచ్చు

ఈ ఆదర్శ లోకాలను మనం ఎలాగూ చేరుకోలేము కనుక, అక్కడివారు మనకు పంపించే రేడియో సంకేతాలనైనా మన శాస్త్రజ్ఞులు పరిశీలించి అర్థాలు చెప్పగలిగితే బాగుండును, వారి సందేశాలను పాటించి భూలోకంలోనే ఆదర్శ నాగరికతను స్థాపించడానికి మనం యత్నించ వచ్చు

# ఎర్రటేపు మహిమ

దేవుడు వరమిచ్చినా, పూజారి వర మివ్వడని సామెత  ప్రభుత్వం ఏ మంచి పని తల పెట్టినా, అధికారులు అడ్డుపడతారు

టర్కీలో కిందటి ఆగస్టులో పెద్ద భూకంపం వచ్చింది  కొన్ని వేల మంది మరణించారు, మరికొన్ని వేలమంది  నిరాశ్రితు లయ్యారు వారికోసం తేయాకును విరాళంగా పంపడానికి  భారత ప్రభుత్వం నిశ్చయించింది  అయితే, దానిపై ఎగుమతి సుంకం విధించాలా లేదా? ఇటువంటి ధర్మసందేహాలతో అధికారులు కుస్తీపట్లు పడుతూ, మొత్తం మీద ఒక్క ఔన్సు టీ బయటికి పోకుండా జాగ్రత్త పడ్డారు

అవసరంలో ఆదుకున్నవాడే అసలైన మిత్రుడంటారు. అవసరం తీరిపోయాక  ఎంత ఆప్యాయత ఒలకబోసినా, ఏం లాభం?  మన అధికారుల చాదస్తాల నుంచి తప్పించుకుని మన తేయాకు టర్కీ వెళ్ళేసరికి అక్కడి ప్రజలు భూకంపం సంగతి కూడా మరచిపోవచ్చు

ఇదంతా ఎర్రటేపు మహిమ; అర్జంటు ఫైళ్ళు సుమా అని గుర్తు చేయడానికిగాను కాగితాలను కట్టడానికి ఉపయోగించే ఎర్రటేపు మొత్తం అధికార యంత్రాంగాన్నే చుట్టచుట్టి పడవేస్తున్నది.  అది సాధారణంగా బ్రహ్మముడి కంటె బలంగా పీటముడి  పడుతుంది  ఒక్కొక్కసారి అధికారుల చేతులను తడి చేస్తేగాని ఆ ముడి విడదు  ఒక్కొక్కసారి అదీ లాభం లేదు  తనంతట  తాను దయతలచి  అది విడిపోవలసిందే

# మంచి నీటిలో కల్తీ

పాలు, వెన్న, నెయ్యి, మందులు, బియ్యం— ఇంకా ఎన్నిటిలోనైనా కల్తీ జరగడం విన్నాము కాని, మంచినీటిలో కల్తీ జరగడం వినలేదు పూనా నగరంలోని రెండు పేటలకు సరఫరా అయిన మంచినీటిలో సారా కల్తీ జరిగిందట

అయితే, ఇది పూనా పురపాలక సంఘం బుద్ధిపూర్వకంగా చేసిన పని కాదు ఆ పేటలకు మంచినీటిని సరఫరా చేయడానికి ఉపయోగించే చెరువులో సారా కలిసిందట అక్రమంగా కాపుసారా తయారుచేసిన వారెవరో పోలీసులు దాడి చేయబోతున్నట్టు పసిగట్టి దాన్ని చెరువులో కలిపి వేసి వుండవచ్చునట.

సురాప్రియులు దీన్ని మంచినీటిలో సారా కల్తీగా అంగీకరించక పోవచ్చు వారి దృష్టిలో ఇది సారాలోనే మంచినీటి కల్తీ కావచ్చు

ఏమైనా, రెండు పేటలలోని జనం ఆబాల గోపాలం కుళాయిల నుంచి సారా బిందెలలో నింపుకుని, ఘాటుగా సేవించి, సగం సగం నిషాతోనైనా, తమాషాగా ప్రవర్తించిన ఆ దృశ్యాన్ని ఊహించుకోవలసిందే పోలిసులు కాపుసారా వ్యాపారులను వారి మానాన వారిని పోనిస్తే, అలవాటున్న ఏ కొద్దిమందో మాత్రమే తాగి వుండేవారు ఇప్పుడు మద్యనిషేధ శాసనాన్ని అమలు చేయబోయి, వారు వీరనకుండా రెండు పేటల జనం శాసనోల్లంఘన నేరం చేయడానికి పోలీసులు కారకులైనారు

మన దేశంలో మద్యపాన నిషేధం అమలు జరుగుతున్న తీరుపై ఈ సంఘటన కంటె సముచితమైన వాఖ్య మరి దొరకదు

# మూఢ విశ్వాసం

వెనకటి కొక కుందేలు తాటిచెట్టు కింద నిద్రపోతూ, పైనుంచి కాయ రాలిపడే సరికి, మిన్ను విరిగి పడిపోతున్నట్టు భయపడిందట వెను దిరిగి చూడకుండా అది పరుగెత్తసాగింది దాని కేకలతో కంగారుపడి అడవిలోని మిగతా జంతువులు కూడా వెనక్కి చూడకుండా పరుగెత్తా యట వెనక నుంచి ఆకాశం విరిగి పోతూ వస్తున్నదనే వాటి భయం.

మొన్న న్యూగినీలోని పాపువా రాష్ట్ర ప్రజలు ప్రపంచ ప్రళయం గురించి భయపడడం పై కథను గుర్తు చేస్తుంది వారి నమ్మకాల ప్రకారం మొన్న గురువారం నాటికే (18వ తేదీ) ప్రపంచం అంతమై పోయి వుండవలసింది

ప్రళయం రాబోతుండగా పనిపాటలు దేనికని ప్రజలు అన్ని పనులు మానేశారట పందులన్నిటిని చంపి ఆఖరి విందుకు అట్టహాసంగా ఏర్పాట్లు చేసుకున్నారట

కొన్నేళ్ళ క్రిందట కొందరు ఇటాలియన్ సన్యాసులు ఇలాగే జలప్రళయం రానున్నదని కొండెక్కి కూర్చున్నారు అష్టగ్రహకూటం ప్రళయకారకమని ఆ మధ్య మన దేశంలో కూడా పెక్కుమంది భయ పడడం జరిగింది

ప్రపంచం అంత సులువుగా అంతమై పోతుందా ? కొన్ని కోట్ల సంవత్సరాల తర్వాత భూమి సహజ కారణాలవల్లనే నశించి పోవచ్చు దానికి మనం భయపడనక్కరలేదు లేదా, ఈ లోగా, ఏ అణు యుద్ధం వంటిదో సంభవించి కనీసం మానవజాతిలో హెచ్చు భాగం అంతరించి పోవచ్చు దీనికే మనం భయపడవలసింది, జాగ్రత్తపడ వలసింది!

# చేపల వాన

కుండపోతగా కురుస్తున్న వర్షాన్ని వర్ణించడానికి ఇంగ్లీషులో "ఇటీజ్ రెయినింగ్ క్యాట్స్ అండ్ డాగ్స్" (పిల్లుల, కుక్కల వాన) అని ఒక జాతీయం వున్నది ఇది కేవలం జాతీయంగానే మిగిలిపోయింది గాని, మొన్న ఆగ్రా వద్ద నిజంగానే చేపలవాన కురిసిందట.

వర్షానికి వలెనే, దీనికికూడా విజ్ఞాన శాస్త్రం రీత్యా ఏదో కారణం వుండకపోదు కాని, వర్షాలను తమ ప్రార్థనలకు మెచ్చి దేవతలే కురిపిస్తున్నారని నమ్మేవారు, ఈ చేపలను కూడా స్వర్గంలోని మందాకినీ నది నుంచి పట్టి దేవతలు కురిపిస్తున్నట్టు విశ్వసించవచ్చు పూర్వం దేవతలు కొందరు పుణ్యాత్ములపై పూలవాన, కనకవర్షం కురిపించేవారు కాదా?

ఈ విధంగా దేవతలు దేశమంతటా చేపలవాన కురిపించినా బాగుండును. ఆహార సమస్య కొంతవరకు తీరిపోతుంది ! !

# ఆత్మ వున్నదా?

ఆత్మ వున్నదా? ఈ ప్రశ్న వేస్తేనే ఆస్తికులు ఆగ్రహపడతా రను కోండి ముఖ్యంగా మన వేదాంతుల దృష్టిలో నిత్యమైంది, సత్యమైంది ఏదైనా కలదంటే, ఆత్మ మాత్రమే దాన్ని విడిచి పుచ్చితే మిగిలింది కేవలం మాయ, పూర్తిగా మిధ్య

"ఆత్మ వున్నదా" అనే ప్రశ్న తన జీవితకాలంలో వేస్తే ఏమి ప్రమాదం వస్తుందో అన్న భయం వల్లనే కాబోలు, ఆరిజోనాకు (అమెరికాకు) చెందిన ఒక శ్రీమంతుడు-ఆయన పేరు జేమ్స్ కిడ్-ఆత్మ వున్నట్టు రుజువు చేసే వారికి రెండు లక్షల డాలర్లను బహుమానంగా యివ్వవలసిందని తన మరణ శాసనంలో వ్రాసిపోయాడట ఎనిమిది అమెరికన్ సంస్థలు, ఆత్మ వున్నదని నిరూపించి, ఈ బహుమానాన్ని పొందడానికి ముందుకు వచ్చాయట ఇవి తమ వాదాన్ని ఆరిజోనా స్టేట్‌కు చెందిన సుప్రీం కోర్టుకు త్వరలో వినిపించబోతున్నాయట

అయితే, జేమ్స్ కిడ్ కోరింది ఆత్మ వున్నదన్న వాదం కాదు అవసానదశలో ఆత్మ అనేది బొందినుంచి లేచిపోతుందని చెప్పడానికి శాస్త్రీయమైన (సైంటిఫిక్) ఆధారాన్ని చూపించాలని ఆయన కోరాడు ఈ విషయాన్ని ఏ "యాపరేటస్"తో ఏ విధంగా కోర్టువారికి చూపిస్తు న్నారో ఆ వైనం మనకు తెలియదు

ప్రాణం పోయినప్పుడు "హంస లేచి పోయిం"దని అంటారు దీన్నిబట్టి ఆత్మ అనేది ఒక పులుగు రూపంలో వుంటుందని అనుకోవాలా? అయితే ఈ పులుగును చూచిన వారెవ్వరు లెరు కిడ్ బహుమానం రెండు లక్షల డాలర్లను పొందడానికి ప్రయత్నిస్తున్న అమెరికన్ సంస్థలకు హంసరూపంలో కాకపోతే, అట్టి మరొక రూపంలో ఆత్మకనబడిందేమో, లేకపోతే, బహుమానం సంపాదన కోసం అవి ఎగబడివుండేవా? ఏమైనా ఆసక్తితో ఎదురుచూడదగినదే ఆరిజోనా సుప్రీంకోర్టు ఈ విషయంలో చెప్పబోతున్న తీర్పు!

# మితభాషి మీనన్

కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ మితభాషిత్వానికి పెట్టిందిపేరు కాగా, అతిభాషిత్వానికి పేరు పడిన వ్యక్తి శ్రీ వి కె కృష్ణ మీనన్

వేదిక పైకెక్కితే ఆయన కాలాన్ని మరచిపోతారు ఎన్ని గంటలైనా ఆయన వాగ్ధోరణి అనర్గళ ప్రవాహంగా సాగిపోతుంది, మధ్య మధ్యలో ఆవేశంతో ఊగిపోతారు, ఉద్రేకంతో సభికులను తర్జనితో బెదరిస్తారు, రకరకాల భంగిమలలో ఉపన్యసిస్తారు చేతులలో పుస్తకం గాని, పత్రికగాని వుంటే దానినుంచి ఏవేవో లెక్కలు, అంకెలు ఉదాహరిస్తారు. మొత్తంపై ఆయసి ఉపన్యాస ప్రవాహంలో పడి శ్రోతలు కొట్టుకు పోవలసిందే

అయితే, మొన్న హైదరాబాదులో ఆయన అడ్వకేట్ల సంఘం వారి సమావేశంలో ఉపన్యసించడానికి వచ్చి రెండే వాక్యాలతో సరిపెట్టి కూర్చున్నారట సదస్యులు దిగ్భ్రాంతులై పోయివుంటారు

శ్రీ కామరాజ్‌వలె మితంగా మాట్లాడ్డమే మంచిదనే నిర్ధారణకు ఆయన వచ్చారేమో లెక, కడచిన రెండుసార్లువలె ఈసారి ఎన్నికలలో, ఉత్తర బొంబాయి నియోజక వర్గంనుంచి పోటీ చేయడానికి వీలులెక పోతున్నదనే విషయం ఆయనను చింతాక్రాంతుడుగా చేసిందేమో! ఏమైనా, కాశ్మీర్ సమస్యపై ఐక్యరాజ్యసమితిలో ఆయన వాగ్ధాటి పాశ్చాత్య ప్రతినిధులకు ఆగ్రహం తెప్పించినా, వారిని నిరుత్తరులుగా చెస్తూ వుండేదని మరవిపోవడం కష్టం,

# జేమ్స్ బాండ్ నవలలు

ఇయాన్ ఫ్లెమింగ్ వ్రాసిన జేమ్స్ బాండ్ నవల లన్నిటిని సిరియా ప్రభుత్వం నిషేధించింది అవి సోషలిస్టు దేశాలను కించపరచే విధంగా వుండడమే దీనికి కారణమట

ఇటీవల కొలది సంవత్సరాలుగా మరే డిటెక్టివ్ నవలలకు లేనంత ప్రచారాన్ని జేమ్స్ బాండ్ నవలలు సంపాదించుకున్నాయి ముఖ్యంగా కుర్రకారును అవి విపరీతంగా ఆకర్షించాయి చాలామందికి అవి బైబిల్ వంటివి. వారికి జేమ్స్ బాండ్ ప్రాతఃస్మరణీయుడు. ఆ నవలలు ఆధారంగా తీసిన చలన చిత్రాలు వారి దృష్టిలో కళాఖండాలు

సిరియా ప్రభుత్వం ఆరోపణ నిజమే కావచ్చు ఆమధ్య ఒక జేమ్స్‌బాండ్ చిత్రం పేరులో ఒక సోషలిస్టు దేశం ప్రసక్తి వున్నందున ఇండియాలో ఆ పేరు మార్చడం కూడా జరిగింది

అంతమాత్రాన వాటిని సిరియా ప్రభుత్వం పూర్తిగా నిషేధించడం తగదేమో. దీనివల్ల ఆ నవలల పట్ల మోజు మరింత పెరిగే ప్రమాదం కూడా వున్నది

అంతేకాదు ఈ మధ్య సిరియాలో ప్రభుత్వంపై కుట్రలు పరిపాటి అయిపోయాయి నిన్ననే మరొక కుట్ర బయటపడింది ఈ పరిస్థితిలో ఇటువంటి కుట్రలను బయటపెట్టి విఫలం చేయగల జేమ్స్ బాండ్‌లు ఎందరైనా సిరియాకు కావాలి ఆ నవలలు చదివిన యువకులకు తాము జేమ్స్ బాండ్‌వలె అద్భుత సాహసాలు చేయాలన్న కోర్కె తప్పక కలుగుతుంది. అందుచేత వాటిని తమ యువకులచే చదవనివ్వడమే మంచిదేమో!

# పుణ్యానికి పోతే

వెంత్తని వాడిని చూస్తే మొత్తబుద్ధి వేస్తుందని సామెత మరీ మంచిగా వుండేవాడిని చూస్తే అతి వినయం ధూర్త లక్షణమని అపోహకూడా కలుగుతుంది

కాలిఫోర్నియాలోని ఓక్‌ల్యాండ్‌లో అరవైయేళ్ళ భార్య అరవై ఎనిమిదేళ్ళ భర్తకు విడాకులిచ్చిందట భర్త తనని మానసికంగా హింసిస్తున్నాడని ఆమె అభియోగం

పాపం అతడు చేసిన పెద్ద తప్పేమీలేదు భార్యను పువ్వులలో పెట్టి పూజించడమే అతని దోషం ఆమెను ప్రొద్దున్నే కాఫీ చేయనివ్వడట చేతులు కాల్చుకుంటుందేమోననే భయంతో వంట చేయనివ్వడట బట్టలుతకడం, ఇస్త్రీ చేయడం, అంట్లు తోమడం మొదలైన గృహకృత్యాలు తానే చేస్తాడట

ఈ విధంగా భార్యలను గౌరవించే భర్తలు ఎక్కడో నూటికి, కోటి కొకరు వుంటారు, పుణ్యం కొద్దీ పురుషుడన్నట్టు ఇటువంటి భర్తలు దొరకడమే మహదృష్టంగా చాలమంది ఇల్లాళ్ళు భావిస్తారు అయితే ఆ ఓక్‌ల్యాండ్ గృహిణికి భర్త వరస బొత్తిగా నచ్చలేదు భర్త తనను భార్యగాకాక చిన్న పిల్లవలె చూస్తున్నాడని, దానివల్ల తాను మానసిక హింసకు లోనవుతున్నానని ఆమె ఫిర్యాదు చేసింది కోర్టువారు విడాకులిప్పించారు

భార్యలపట్ల భర్తలు ఎలా మసలుకోవాలో చెప్పడం మా ఉద్దేశం కాదుగాని, పై ఉదంతాన్ని బట్టి మరీ మంచికి పోయినా చిక్కేనని తెలుతుంది భార్యలను వారివారి మనస్తత్వాలను బట్టి, పరిస్థితులనుబట్టి, ఒకసారి లాలించినా మరొకసారి కసరి కొట్టడం, ఒకసారి బుజ్జగించినా వేరొకసారి ఆగ్రహించడం అవసరమేమో ఆ ఒక్క ఉదాహరణనుబట్టి సాధారణీకరించడం సాహసం కావచ్చుగాని, స్త్రీలు పురుషులతో సమానంగా హక్కులు కోరుతున్నా భర్తలు ఆజ్ఞాపించడం, తాము వినడమే వారికెక్కువ ఇష్టం కావచ్చు

# దేశాలమధ్య సహకారం

పదిహేడేళ్ళ అర్జెంటైన్ బాలికకు ప్రాణాపాయం తప్పించడానికి నాలుగు దేశాలవారు పరస్పరం సహకరించారట ఎక్కడ చూసినా స్పర్ధలు, వైషమ్యాలు తప్ప మరొకటి వినరాని ఈ రోజులలో ఈ వార్త ఎంత చల్లని కబురు.

ఆ బాలికకు కావలసిన ఔషధం మాస్కోలో తప్ప దొరకదట దానికోసం బోనస్ ఏరిస్‌లోని ఒక ఆస్పత్రి రేడియో ద్వారా ప్రసారం చేసిన విజ్ఞప్తిని ఇటలీలోని ఒక శ్రోత యాదృచ్ఛికంగా విన్నాడు అతడు వెంటనే ఇంటర్నేషనల్ ఎక్స్ఛేంజి ద్వారా మాస్కోకు తెలియ జేశాడు మాస్కో వైద్యులు ఆ ఔషధాన్ని వెంటనే బ్రిటిష్ విమానం ద్వారా అర్జెంటైనాకు ఉరికించారు ఆ బాలికకు సకాలంలో వైద్య సహాయం అంది గండం గడిచి బయటపడింది

ఇంతమందిలో ఏ ఒక్కరు ప్రాలుమాలినా ఆ బాలికకు మృత్యువు తప్పేదికాదు బోనస్ ఏరిస్ రేడియో విజ్ఞప్తిని ఇటలీలోని వ్యక్తి విని వుండకపోయినా, రోమ్‌నుంచి మాస్కోకు టెలిఫోను చెయ్యక పోయినా, మాస్కో వైద్యులు సిద్ధకించినా, బ్రిటిష్ విమాన సంస్థ సహా రించకపోయినా ఆ పిల్ల బ్రతికేదికాదు చివరకు అంతా సవ్యంగానే జరిగింది

ఇదే ఏ నూరేళ్ళ క్రిందటనో అయితే దేశాలమధ్య సుహృద్భావ మున్నా, ఇట్టి సహకారం సాధ్యమయ్యేది కాదు ఆధునిక వార్తాప్రసార సౌకర్యాలు, ప్రయాణసాధనాలవల్లనే ఇది సాధ్యపడుతున్నది సాంకేతిక ప్రగతి, పరస్పర సుహృద్భావం ఈ రెండే మానవాళికి ఆశాజ్యోతులని పై ఉదంతం నుంచి నేర్చుకో దగిననీతి ఈ రెండు లభించినప్పుడు ఆర్జెంటైన్ బాలికవలె, ప్రపంచ శాంతి సయితం భద్రంగా, సురక్షితంగా వుంటుంది

# ఏది శ్రేష్ఠమైన టీ?

టీ తయారు చేయడంలో చాలా పద్ధతు లున్నాయి దేశానికి దేశానికి, ఒక దేశం లోనే ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి పద్ధతులు భేదిస్తూ వుంటాయి

మన ప్రాంతంలో టీలో పాలు, చక్కెర కలిపి త్రాగుతాము ఉత్తర భారతంలో కొన్ని చోట్ల ఆ రెండు లేకుండా ఉప్పు కలుపుకుని త్రాగుతారు రష్యన్లకు నిమ్మరసం కలిపిన టీ ఇష్టం, అమెరికాలో ఐస్ వేసిన టీ అలవాటు రోజుకు సుమారు ఇరవై కప్పుల టీ త్రాగడానికి అల వాటుపడిన జపానీయులకు టీ తయారీ ఒక కళ, ఒక శాస్త్రం మాత్రమే కాదు, అది వారి "జెన్" బౌద్ధమతంతో ముడి పడిన ఒక పవిత్ర విధి

"ఏది శ్రేష్ఠమైన టీ?" అనే సమస్యపై లండన్ శాస్త్రజ్ఞు లిద్దరు పదేళ్ళపాటు రహస్య పరిశోధనలు చేశారట వారి పరిశోధనల ఫలితంగా తేలింది ఇది కప్పులో ముందు టీ పోసి తరవాత పాలు పోయరాదు ముందే పాలు పోసి టీ కలిపితే శ్రేష్ఠమైన రుచి వస్తుంది.

ఈ ఫలితం కోసం పదేళ్ళ అమూల్య కాలాన్ని వెచ్చించిన ఆ శాస్త్రజ్ఞులపై మాకు జాలి కలగడం లేదు వారి పద్ధతిలో తయారుచేసిన రుచి చూడకుండా వారి పరిశోధనా ఫలితంపై అభిప్రాయం వెల్లడించ డానికి కూడా మేము సిద్ధంగా లేము

కాని, విచారించవలసిన దొకటే ఆ శాస్త్రజ్ఞులకు పదెళ్ళ పరిశోధన లోను డజను మంది సహాయపడినారట, వారు రోజుకు వెయ్యేసి సార్లు టీ రుచి చూడవలసి వచ్చేదట ఆ శాస్త్రజ్ఞులు తయారు చేసే అన్ని రకాల టీని అన్ని సార్లు వారెలా త్రాగగలిగారో త్రాగి ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకున్నారో ఆశ్చర్యం వారిపై మనం జాలిపడక తప్పదు

అంతకంటె ఆశ్చర్యకరమైనది-అన్ని రకాల కషాయాలను త్రాగి స్వల్ప రుచి భేదాలను వారెలా పోల్చగలిగారో? మా అనుమానం—ఆ శాస్త్రజ్ఞుల బాధపడలేకనే చివరకు ఏదో ఒక దాన్ని శ్రేష్ఠమైనదిగా వారు తేల్చి వుంటారు ఏమైనా పరిశోధన చేసిన శాస్త్రజ్ఞులను కంటె వారి బాధ అనుభవించిన సహాయకులనే ఎక్కువగా అభినందించాలి

# పెరుగుతున్న రోజు

భూమి తన చుట్టూ తాను తిరగడానికి ఇదివరకటి కంటె ఎక్కువ సేపు పుచ్చుకుంటున్నదట అంటే దాని పరిభ్రమణ వేగం తగ్గి పోతున్న దన్నమాట దీనివల్ల రోజు ప్రమాణం పెరిగి పోతున్నదని రష్యా శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

ఇదివరలో వారు వేసిన లెక్కల ప్రకార మైతే, నూట ఇరవై ఏళ్ళ కొక మిల్లీ సెకండు (సెకండులో వెయ్యవ వంతు) చొప్పున రోజు ప్రమాణం పెరిగేది ఇప్పుడు తిరిగి లెక్కకట్టి చూడగా ఒక ఏడాదిలోనే మిల్లీ సెకండు చొప్పున పెరుగుతున్నట్టు తేలింది ఈ లెక్కన ఇంకొక మూడులక్షల అరవై వేల ఏళ్ళలో రోజును ఇరవై ఐదు గంటలుగా భాగించ వలసి రావచ్చు లేదా 24 గంటలుగానే వుంచదలిస్తే గంట ప్రమాణాన్ని హెచ్చించ వలసి వుంటుంది

దీనివల్ల పెక్కుమందికి పెక్కు రకాలుగా చిక్కులు రాకతప్పదు ఆ అదనపు గంటతో ఏమి చెయ్యడ మనేది చాలా మందికి పెద్దసమస్య కావచ్చు పోతే, ఎక్కువ సేపు పనిచేస్తున్నందుకు జీతాలు ఎక్కువ చేయాలని ట్రేడ్‌యూనియన్‌లు సమ్మె కట్టవచ్చు

ఇది మూడు లక్షల అరవై వేల ఏళ్ళ తరువాత మాటకదా అని అశ్రద్ధ చేయడానికి వీలులేదు తక్షణ ప్రమాదాలు కూడా కొన్ని వున్నాయి నాగార్జునసాగర్ నిర్మాణం మరొక రెండుమూడు మిల్లీసెకండ్లు ఆలస్యమై పోతుంది అప్పుడు తెన్నేటివారో, వావిలాలవారో చేయగల నిశిత విమర్శలకు ప్రభుత్వం ఇప్పటినుంచి తయారుగా వుండడం మంచిది

1980 నాటికి దేశంలో ప్రతి వ్యక్తికి కూడు, గుడ్డ వంటివి సమృద్ధంగా లభిస్తాయని కాంగ్రెస్ పార్టీ హామీ ఇస్తున్నది ఈ లక్ష్యం నెరవేరడం పదిహేను మిల్లీ సెకండ్లు ఆలస్యం కావచ్చు దీనిపై ప్రతి పక్ష సభ్యులు చేయబోయే రగడను దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం చురుగ్గా పని చేయవలసి వుంటుంది

ఇంకా ఇటువంటి సమస్య లెన్నయినా తలెత్త వచ్చు అందుచేత, రోజు ప్రమాణం పెరగడంవల్ల వచ్చే సాధక బాధకాలను విచారించడానికి ప్రభుత్వం వెంటనే ఒక నిపుణుల సంఘాన్ని నియమించడం మంచిది

# స్త్రీలు — సాహిత్యం

"ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్" అని కవి వాక్కు శారీరక, మానసిక శక్తులలో స్త్రీ పురుషులకు భేదం లేదని కమ్యూనిస్టులు కూడా నమ్ముతారు స్త్రీని వంటింటి బానిసగా సంతానోత్పత్తి పరికరంగా భావించడం ఫ్యూడల్, బూర్జువా సంస్కృతుల చిహ్నమని వారి సిద్ధాంతం

అటువంటిది, కమ్యూనిస్టు "పితృదేశం"లో పుట్టి పెరిగి, కమ్యూనిజంపట్ల గాఢ విశ్వాసం కలిగిన రచయిత షోలొకోవ్ దీనికి విరుద్ధమైన ప్రకటన చేయడం ఆశ్చర్యమే సాహితీ వ్యాసంగంలో స్త్రీలు పురుషులతో సాటిరారని ఆయన స్టాక్‌హోంలో మొన్న ప్రకటించాడు

ఇది కనీసం స్త్రీలకు ఆగ్రహకారణం కాగల దనడంలో సందేహం లేదు సంఖ్యలో కాకపోయినా ప్రతిభలో పురుషు లంతగాను ప్రఖ్యాతి కెక్కిన ఎందరో రచయిత్రులను—ప్రాచీన గ్రీకు కవయిత్రి శాఫో నుంచి ఇటీవలి బ్రాంటీ సిస్టర్స్, జేన్ ఆస్టెన్, జార్జ్ ఇలియట్, ఎలిజబెత్ బ్రౌనింగ్, వర్జీనియా వుల్ఫ్ వరకు—ఎందరినైనా వారు ఉదహరించవచ్చు

ముఖ్యంగా తెలుగు రచయిత్రులకు షోలొకోవ్ ఉద్ఘాటన వట్టి అసందర్భంగా కనిపించవచ్చు ఉదాహరణలకు మొల్లవరకు పోనక్కర లేదు. ఇటీవల ఏ తెలుగు పత్రిక తిరగవేసినా సంఖ్యలోను, వస్తుబడిలోను రచయిత్రులదే పైచెయ్యి. ప్రసిద్ధులు, ప్రతిభాశాలులైన రచయిత్రు లెందరో వుండగా సాహిత్య అకాడమీ బహుమతి సయితం ఒక రచయిత్రికే లభించలేదా?

షోలొకోవ్ నోబెల్ బహుమతి పొందినా తమపట్ల ఆయన భావాలు "నోబుల్"గా లేవని స్త్రీలు నిరసిస్తే ఆశ్చర్యపడ నక్కరలేదు రానున్న మార్చిలో ఇండియా రానున్న షోలొకోవ్‌కు వారు నల్లబ్యాడ్జీలతో స్వాగత మిచ్చినా ఇవ్వవచ్చు ఏమైనా ఆయన కొంచెం తొందరపడి మాట జారారనే చెప్పాలి

# ఆకాశ హర్మ్యాలు

న్యూయార్క్ నగరం ఆకాశ హర్మ్యాలకు ప్రసిద్ధికెక్కింది నూటొక్క అంతస్తులతో ప్రపంచంలో కెల్లా పెద్దదైన ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ అక్కడిదే

ఇంతకంటె ఎన్నో రెట్లు ఎత్తు, కొన్ని వందల రెట్లు విశాలం అయిన ఆకాశ హర్మ్యాలను నిర్మించ వచ్చునని ఒక సోవియట్ ఇంజనీరు సూచిస్తున్నాడు ముందు ముందు పట్టణాల జనాభా, వైశాల్యం పెరిగి పోయి వ్యవసాయానికి భూమి తక్కువై పోతుంది అందుచేత పట్టణాలను నేల బారున కాక, ఆకాశంలోకి కట్టాలని అతని సలహా

అతని ఊహాశక్తి మెచ్చదగింది అయిదు వందలకు పైగా అంతస్తులతో, అయిదువేల అడుగుల ఎత్తున ఇరవై మైళ్ళకు పైగా వ్యాసంతో ఒక మేడ కట్టాలట దానిలో ఇప్పటి మాస్కో జనాభాకు ఎనిమిది రెట్లు నివసించ వచ్చునట. అంటే మొత్తం సోవియట్ యూనియన్ను ఏ ఎదెనిమిది మేడలలోనో ఇరికించ వచ్చు నన్నమాట

న్యూయార్క్‌ను ఆకాశ హర్మ్యాల అరణ్యంగా చాల మంది పేర్కొంటారు అది చూచిపోదగిన నగరమె గాని నివాస యోగ్యమైంది కాదంటారు మరి సోవియట్ ఇంజనీరు సూచించే భవనాలలో జీవితం మరెంత దుర్భరంగా వుంటుందో! చాల మంది వాటిలోనే పుట్టి, పెరిగి, నేల, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, వాన, నదులు మొదలైనవి ఎలా వుంటాయో ఎరగకుండానే చనిపోవచ్చు తలచుకుంటేనే భయావహంగా వుంటుంది ఈ ఊహ

# మార్జాల వారం

అతి చిత్రమైన దేశం అమెరికా అక్కడ ఏది జరిగినా ఆశ్చర్యంలేదు అక్కడొక "మార్జాల సంఘం" వున్నదట అంటే దానిలోని సభ్యులు పిల్లులని కాదు పిల్లులను సంరక్షించాలనే వారందరు ఒక సంఘం ఏర్ప రచుకున్నా రన్నమాట ఆ సంఘం వచ్చే నవంబరు 7వ తేదీనుంచి "మార్జాల రక్షణ వారాన్ని" ప్రపంచవ్యాప్తంగా జరపాలని విజ్ఞప్తి చేస్తున్నది

పిల్లులను పెంచడం పాశ్చాత్య దేశాలలో బాగా అలవాటే నను కోండి అయినా, ఇది కేవలం పిల్లుల పట్ల ప్రేమతోనే చేసిన విజ్ఞప్తి కాదు ఎలుకల బెడదను తగ్గించడానికి పిల్లులను బాగా పెంచాలని, వాటి సంఖ్యను ఎక్కువ చేయాలని అమెరికన్ సంఘం ఆశయం వారి అంచనా ప్రకారం ఒక్క రాత్రిలో ఒకపిల్లి పదమూడు ఎలుకలను చంపగలదట

మనకీ ఎలుకల బాధ ఎక్కువే అసలు మన ఆహార సమస్యకు కారణం అవేనని కూడా-అంటే మన పంటలో సగానికి సగం అవే స్వాహా చేస్తున్నాయని-కొందరు అంచనాలు వేశారు అందుచేత వాటి నిర్మూలన మనకీ అవసరమే దానికొసం ఏవేవో మందులూ అవీ కని పెట్టి ప్రయోగించడం కంటె పిల్లులను ఎక్కువగా పోషిస్తే సరిపోదా ?

కనుక, మనదేశంలోకూడా అమెరికన్ సంఘం విజ్ఞప్తి ప్రకారం "మార్జాలవారం" జరిపితే మంచిదేమో. మనమిప్పుడు ఎన్ని రకాల వారోత్సవాలు జరపడంలేదు వాటిలో ఇదీ ఒకటి

ఎటొచ్చీ, ఎలుకలన్నీ నిర్మూలనమై పోయి పిల్లులబాధ ఎక్కువై పోవచ్చు అప్పుడు అవి మన ఆహారం మీదకి ఎగబడి కొత్త సమస్యను తేవచ్చు

# పులి, నక్క

రజ్జు సర్పభ్రాంతి వలెనే, సర్పరజ్జు భ్రాంతి కూడా వుంటుంది తాడును పామను కుంటే ఉలికి పడడంతోనే సరిపోతోంది కాని, పామును తాడని భ్రమిస్తే అది కాటు వేయవచ్చు.

వేయకపోవచ్చు కూడా మొన్న స్పెయిన్‌లో ఒక వృద్ధురాలి గదిలోకి సర్కస్ పులి చొరబడిందట ఆమెకు చూపు సరిగా ఆనక, దాన్ని కుక్క అనుకుని లాలించిందట, అది ఆమె కే అపాయం చేయ లేదట

అందుకే కాబోలు, మన వేదాంతులు "అంతా అనుకోవడం లోనే వుంది" అంటారు ప్రపంచం వుందనుకుంటే వుంది, లేదనుకుంటే లేదు ఫ్రెంచి వేదాంతి దెకార్తే "లోకమంతా నా భావనే"(ది వరల్డ్ ఈజ్ మై ఐడియా) అనలేదా?

అయితే, ఈ వేదాంతాన్ని అన్ని చోట్ల ప్రయోగిస్తే ప్రమాదం నిప్పును మంచు ముద్దగా భావించి పట్టుకుంటే చేయి కాలక తప్పదు గోడ లేదనుకొని ముక్కుకు సూటిగా పోతే తల బద్దలవుతుంది అందుకే అటు వంటి సమయాలలో "గజం మిధ్య, పలాయనం మిధ్య" అనే తర్కంతో వేదాంతులు తప్పించుకుంటారు

సర్కస్ పులి ఏ కళ నున్నదో స్పానిష్ వృద్ధురాలిని విడిచి పెట్టింది కాసేపు కుక్కవలె నటించి ముసలమ్మ ముచ్చట తీరిస్తే పోయిందేమిటే అనుకున్నదేమో!

# ఈదలేని బాతం

హాన్స్ యాండర్సన్ కధ "అగ్లీ డక్లింగ్" (కురూపి బాతుపిల్ల) మీరు చదివే వుంటారు ఒక బాతు పొదిగిన అన్ని గుడ్లనుంచి అందమైన పిల్లలు వచ్చాయిగాని, ఒకదాని నుంచి మాత్రం వికృతంగా వున్న పిల్ల పుడుతుంది. దాన్ని చూసి మిగతా బాతులన్నీ హేళన చేస్తూ పీడిస్తూ వుంటాయి అది ఎంతో దిగులు పెట్టుకుంటుంది చివరకు అది బాతుపిల్ల కాదని, హంస అని, తెలిసి దాన్ని అంతా గౌరవించడం మొదలెడ తారు తాను కురూపి బాతు కాక, అందాల రాయంచనని గ్రహించగానే దానికి కూడా పోయిన ఆత్మవిశ్వాసం తిరిగివస్తుంది

మొన్న ఇంగ్లండులో వార్తలలోకెక్కిన "బార్నీ" అనే పెంపుడు బాతుకూడా ఇట్టిదేనేమో, దానికి ఈతరాదట యాండర్సన్ కధలో బాతు పిల్ల తన కురూపితనానికి ఎంత దిగులు పెట్టుకున్నదో ఇది తనకు ఈత రాకపోవడంతో అంతగా బాధపడి పోతున్నదట యాండర్సన్ కధలో బాతుపిల్ల హంసగా రుజువైనట్టే, ఇది కూడా ఈతరాని పక్షుల జాతికి దేనికో చెందినదేమో · ఆ సంగతి తెలిసి వచ్చిన మరుక్షణంలో దానికి దిగులుండదు

మానవులలో సయితం అందని మ్రాని పండ్లకు ఆశించి క్రుంగి పోయే వాళ్ళుంటారు తాము ఆశిస్తున్నది తమకు లభించనిదని, తమ ప్రకృతికి, తమ శక్తియుక్తులకు అది అతీతమని గ్రహించిన క్షణంలో వారి అసంతృప్తి, ఆవేదన మటుమాయమై పోతాయి తన్నుతాను తెలుసు కోవడమే జ్ఞానానికి పరాకాష్ఠగా మన వేదాంతులు ప్రవచించలేదా ?

# రెండు కాళ్ల ఎలుకలు

ఎలుకలేకాదు, మరే జంతువులైనా సరే, తిరుగుబాటు చేయదలిస్తే మానవులు బ్రతక గలరా? "విభజించి పాలించు" అనే సూత్రాన్నిబట్టి జంతువులలో సంఘీభావం ఏర్పడకుండా జాగ్రత్తపడుతూ వుండబట్టిగాని, అవి మూకుమ్మడిగా దండయాత్ర చేస్తే ఇంకేమైనా వుందా?

వెనిస్ నగరంపై మొన్న వేలాది ఎలుకలు దాడి చేశాయట వాటి పీడనుంచి నగరాన్ని రక్షించడానికి అధికారులు ఆరువందలమంది పోలీసులను సమీకరించవలసి వచ్చింది

పూర్తిగా కాదుగాని, కొంత చారిత్ర కాధారం కలిగిన ఇటువంటి మరొక సంఘటన 1284లో జర్మనీలో జరిగిందని చెబుతారు హామెలిన్ అనే పట్టణంపై కొన్ని లక్షల ఎలుకలు దండయాత్ర చేశాయట ఒక మాంత్రికుడు పిల్లనగ్రోవి ఊదుతూ, ఆ ఎలుకలన్నీ తన వెంట వచ్చేట్టు చేసి వీజర్ నదిలోకి తీసుకుపోయి వదలిపెడతాడు ఆ తర్వాత వాడికిస్తా మన్నది పౌరు లివ్వకపోవడం వాడు ఊళ్ళో పిల్లలందరిని తనవెంటవచ్చే టట్టు చేసి ఒక గుహలో బంధించడం—అది మిగతా కథ

మన దేశంలో మనకీ ఎలుకల బాధ వున్నది మనం పండించే తిండి గింజలలో చాలా భాగాన్ని అవి కాజేస్తున్నాయి

అయితే, ఇవికాక, మరొక రకం ఎలుకలు—రెండు కాళ్ళవి—వున్నాయి ఇవి కూడా మన ఆహారధాన్యాలలో ఒక పెద్దభాగాన్ని కాజేస్తున్నాయి, గిడ్డంగులలో దాచేస్తున్నాయి, కరువు కాలంలో బయటికితీసి అధిక లాభాలు దోచేస్తున్నాయి

అసలు ఎలుకల బాధనైనా వదిలించుకో గలమేమో గాని ఈ రెండు కాళ్ళ ఎలుకలను మాత్రం మనం ఏమీ చేయలేక పోతున్నాము పోలీసులవల్ల కూడా ఈ పని కావడం లేదు జర్మన్ కథలోవలె ఏ మాంత్రికుడైనా రావలసిందేనేమో వీటిని పట్టివేయడానికి.

# ఎండల తీవ్రత

ఇద్దరు ఇంగ్లీషువాళ్ళు కలుసుకుంటే వాతావరణాన్ని గురించిన పరామర్శతో వారి సంభాషణ ప్రారంభ మవుతుంది.

విజయవాడ పౌరులైనా అంతే మార్చి నెల అంతం కాకుండానే వారి సంభాషణ ఎండలమీదికి మళ్ళుతుంది "ఏమండోయ్! ఎండలు ముదురుతున్నాయ్!" అని ఒకరనగా, "అప్పుడే ఏముంది? ముందున్నాయ్అసలు ఎండలు", అని మరొకరు అనడం పరిపాటి

విజయవాడకు అసలు ఎండలు రానే వచ్చాయి ఏ యిద్దరు కలుసుకున్నా "ఏమి యెండలు ఏమి యెండలు" అనే మాటే

ఔను. విజయవాడలో ఎండలు మండి పోతున్నాయి. మార్కెట్ లో ధరలవలె మండి పోతున్నాయి రష్యా. చైనాల మధ్య పచ్చ గడ్డివలె మండిపోతున్నాయి

పగలు పన్నెండు గంటలవేళ విజయవాడ వీధులలో నడిచేవారు పూర్వకాలంలో పంచాగ్నుల మధ్య తపస్సు చేసిన ఋషులకుగాని, పీర్ల పండగ ఆఖరునాడు నిప్పులపై నడిచే వారికిగాని ఏ విధంగాను తీసిపోరు

"సదావగాహక్షమ వారిసంచయః" అని కాళిదాసు తన "ఋతుసంహారం"లో గ్రీష్మర్తువును వర్ణించాడు అంటే గ్రీష్మం ఎల్లప్పుడు స్నానం చేయడానికి అనువైన చల్లని నీరు కలిగి వున్నదట ఆ మహాకవి నివసించిన ఉజ్జయినీ నగరం ప్రక్కగా శిప్రానది ప్రవహించేది నగర పాలకసంఘంవారు ఆ నదీ జలాలను పుష్కలంగా పౌరులకు సరపరా చేస్తేవారేమో ఆధునిక యంత్ర సదుపాయాలెన్నో లభ్యమవుతున్న ఈ రోజులలో, పట్టణం ప్రక్కనుంచి కృష్ణవంటి మహా నది ప్రవహిస్తున్నా "సదావగాహక్షమమైన వారి సంచయం" పౌరులకు పుష్కలంగా లభించడం లేదు. నిజానికి త్రాగడానికే సమృద్ధిగా లభించడం లేదు వారికి

ఏమైనా, విజయవాడ ప్రజలు అల్ప సంతోషులు. ఎక్కడికక్కడికే వారు సరిపుచ్చుకోగలరు 115 డిగ్రీల ఎండ వచ్చిననాడు 117 డిగ్రీలు రానందుకు, 117 వచ్చిన రోజున 120 రానందుకు వారు సంతోషిస్తారు శీతోష్ణాలను సమంగా భరించగలిగినవారిని "స్థితప్రజ్ఞులు"గా గీతాకారుడు నిర్వచించాడు విజయవాడకు శీతబాధ లేదు కనుక, ఇక్కడి పౌరులు సగం స్థిత ప్రజ్ఞులు

# నీటిపై నడక

అణిమాది అష్టసిద్ధులను హఠయోగం ద్వారా సాధించవచ్చునని మనవారి నమ్మకం క్షుద్ర దేవతోపాసన ద్వారా వాటి సాధనకు యత్నించే సంప్రదాయంకూడా పూర్వం వుండేది

మొన్న బొంబాయిలో ఒక హఠయోగి బహిరంగంగా తన సిద్ధులను ప్రదర్శించడానికి ప్రయత్నించి నగుబాటు పాలైనాడట పాదాలు తడవకుండా నీటిపై నడవగలనని సవాలు చేశాడు మొదటి అడుగులోనే మునిగిపోయాడు

పాపం ఆయన్ని చూసి జాలిపడాలి టిక్కెట్లు అమ్మి, పత్రికలలో పబ్లిసిటీ ఇచ్చి, వేలాదిమందిని ఆహ్వానించి, సర్కస్ ఇంద్రజాల ప్రదర్శనకో చేసినంత హంగామా చేయడానికి ముందు ఆయన కొద్ది మంది పత్రికా విలేకరులకో, ప్రత్యేకాహూతులకో తన మహిమను చూపించవలసింది అలా కాక, ఒక్కసారే ప్రపంచఖ్యాతి కొట్టివేయాలన్న పేరాసకు పోవడంతో భంగపడ్డాడు.

నీటిలో కాలుచేతులు కదల్చకుండా గంటల తరబడి తేలియాడే వారున్నారు పొట్టనిండా గాలిపీల్చి దాన్ని అక్కడే స్తంభింపజేసినప్పుడు శరీరం తేలికై నీటిలో తేలుతుందట అలాకాక నీటిపై పాదాలు తడవకుండా నడవడమంటే గాలిలో ఎగరడంతో సమానమే దీన్ని అద్భుత శక్తిగానే పరిగణించాలి

వెనుకటికి రామకృష్ణ పరమహంసను చూడ్డానికి ఒక యోగివచ్చి తాను నీటిపై నడచివచ్చానని గర్వంగా తన యోగశక్తిని గురించి చెప్పుకున్నాడట రామకృష్ణుడది విని, "దానికోసం అంత తపస్సు చెయ్యాలా? అర్థణా ఇస్తే బల్లకట్టుపై గంగను దాటే వాడవుకదా?" అని అతని తపశ్శక్తికి అర్థణా విలువ నిచ్చాడట

హఠయోగి శ్రీ ఎల్ ఎస్ రావు మరొకసారి ప్రయత్నం చేసి నీటిపై నడక సాధ్యమేనని నిరూపిస్తారట ఈ సారి ఆయన విజయం పొందినా, తన యోగశక్తులకు నీటిపై నడకను మించిన విస్తృత సాంఘిక ప్రయోజనం కలదని ఆయన నిరూపించేవరకు, దానికి లోకం పెద్దగా విలువ నివ్వదు

# వేలం వెర్రి

ప్రసిద్ధ చిత్రకారుడు పికాసో ఒకనాడు తాను అప్పుడే పూర్తిచేసిన చిత్రం ముందు నిలుచుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడట ఇంతలో ఒక మిత్రుడువచ్చి, "పార్టీకి వెళ్ళాలి త్వరగా ర"మ్మన్నాడు "వస్తానుగాని ఈ బొమ్మలో ముక్కు సరిచెయ్యాలి" అన్నాడు పికాసో "అయితే, ఆల స్యం దేనికి? సరిచెయ్య"మన్నాడు మిత్రుడు

"అదే చూస్తున్నాను ఆ ముక్కు ఎక్కడ వుందో కనబడడం లేదు" అన్నాడట పికాసో

ఏ అవయవం ఎక్కడ వుండాలో అక్కడ వుండని వందలాది చిత్రాలను రచించి చిత్రకళలో ఒక నూతన శకాన్ని ప్రారంభించిన పికాసో ఆధునిక చిత్రకారులకు గురుతుల్యుడు ఆయన వరవడిలో పామరులకు ఒక పట్టాన బోధపడని అయోమయ చిత్రకళ తామరతం పరగా పెరిగిపోయింది

ఇటువంటివెనేమో లండన్ శివార్లలో ఒక రేకు షెడ్డులో నివసించే 83 సంవత్సరాల వృద్ధురాలు వేస్తున్న చిత్రాలు? ఆమె ఇప్పటికి యాభై ఏళ్ళకు పైగా పాత గుడ్డపీలికలను చేర్చి కుట్టి చిత్రాలు తయారుచేస్తున్న దట ఒక ఏడాదిక్రిందట ఆమె చిత్రాలనుచూసి ఒక కళాప్రియుడు ప్రదర్శన ఏర్పాటు చేశాడట దానితో ఆమెకు అంతర్జాతీయ కీర్తి వచ్చేసింది వెలం వెర్రిగా ఆమె చిత్రాలకోసం దేశ దేశాలవారు ఎగబడుతున్నారు విమర్శకు లామెను పికాసో, మాటిసీలవంటి గొప్ప చిత్రకారులతో పోలుస్తున్నారు

వేలం వెర్రికి చిత్రకళవంటి సారవంతమైన రంగం మరొకటి లేదు ఒకనాడు ఎందుకూ కొరగానివని నిరాదరణ పొందిన చిత్రాలకు మరునాడు ఏ విమర్శకుని చలవ వల్లనో గిరాకీ వచ్చేస్తుంది లేకపోతే గుడ్డ పీలికలతో కుట్టిన చిత్రాలకు అంత ప్రఖ్యాతి రావడమేమిటి?

# ఛాందస పండితులు

మన దేశంలో ఛాందస పండితులకు కొరత లేదు ఆధునిక శాస్త్రజ్ఞులు కొత్తగా ఏ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా, ఏ కొత్త వైజ్ఞానిక విషయాన్ని కనుగొన్నా, అది మన ప్రాచీన మహర్షులకు కొన్ని వేల ఏళ్ళనాడే తెలుసునని వీరు నమ్ముతారు ఇతరులను నమ్మించడానికి ప్రయత్నిస్తారు.

ఇటువంటి వారిలో ఒకరు శ్రీ బానీ దేశ్‌పాండే సాపేక్ష సిద్ధాంతం కొన్నివేల ఏళ్ళనాడే వ్యాసుడికి తెలుసునని ఈయన తన "యూనివర్స్ ఆఫ్ వేదాంత" అనే గ్రంథంలో వ్రాసినట్లు ఒక వార్త తెలుపుతున్నది

ఈ శతాబ్దపు ప్రారంభ సంవత్సరాలలో ఒకానొక చారిత్రక సన్నివేశంలో సాపేక్ష సిద్ధాంతం వెలువడింది ఐన్‌స్టయిన్ కాకపోతే, మరొకరైనా ఆ సిద్ధాంతాన్ని ఆ సమయంలో ప్రతిపాదించేవారే, భౌతిక శాస్త్రంలో ఎదురైన కొన్ని చిక్కు సమస్యలను పరిష్కరించడం తప్పని సరి అయిన క్లిష్ట ఘట్టంలో దాని ప్రతిపాదన జరిగింది ఎంతటి మహా మేధావికైనా అంతకు నూరేళ్ళ ముందు ఆ సిద్ధాంతం ఊహకైనా అంది ఉండేది కాదు విజ్ఞానశాస్త్ర క్రమ పరిణామ ఫలితమే సాపేక్ష సిద్ధాంతం

ఈ ప్రాథమిక విషయాన్ని తెలుసుకోకుండా కొన్నివేలఏళ్ళనాడే వ్యాసుడు సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రవచించాడనడం మూర్ఖత్వానికి పరాకాష్ఠ ఒక విధమైన జాత్యహంకారానికి నిదర్శనం వ్యాసుడనేవాడు వుంటే గింటే, ఆయన ఎంతటి మేధావి అయినా- ఆ నాటి తాత్త్విక, వైజ్ఞానిక శాస్త్రావసరాలను బట్టి—— పూర్తిగా గణిత శాస్త్ర ప్రాతిపదికపై ఆధారపడిన సాపేక్ష సిద్ధాంతం జోలికి పోవలసిన అవసరమే ఆయనకు వుండేది కాదు

ఏ ఆధునిక శాస్త్రజ్ఞుడు ఏ కొత్త విషయం కనుగొన్నా, అది మన శాస్త్రాలలో ఇదివరకే వున్నదని వాదించే వారు, ఆ ఆధునిక శాస్త్రజ్ఞుడు ఆ కొత్త విషయాన్ని కనుగొనక ముందే దాన్ని త్రవ్వి ప్రపంచాన్ని ఎందుకు ఆశ్చర్యచకితం చేయలేక పోతున్నారు? ఈ ఛాందస పండితుల వల్ల మన దేశం వైజ్ఞానికంగా, ఇతర విధాలుగా ఒక్క అంగుళం ముందుకు పోలేదు సరిగదా, వారిని నమ్ముకుంటే కొన్నివేల ఏళ్ళు వెనుకకు పోవడం మాత్రం ఖాయం

# వృక్షాలకం దోహదం

"దోహదం" అనే పదాన్ని మన మీ నాడు ఏ అర్థంలో వాడుతున్నా. ఒకప్పుడు దాన్ని ఒకానొక ప్రత్యేకార్థంలో వాడేవారు

అందమైన ఆడది అశోకవృక్షాన్ని కాలితో తన్నితే అది పుష్పిం చేది వకుళ తరువును విరియించడానికి నోటినిండా కల్లు పోసుకుని పుక్కిలించి ఉమ్మివేయాలి, మరొక మహీరుహ మేదో కుసుమించాలంటే కౌగిలించుకోవాలి వీటినే దోహద క్రియలనేవారు

ఇవన్నీ మన పూర్వులు నిజంగానే విశ్వసించేవారో, లేక కవి సమయాలుగానే వాడుకునేవారో మనకు తెలియదు మేమీ విషయమై పరి శోధన చేసినవారము కాము కనుక, పుష్పజాతులకే కాక, ఫలజాతి వృక్షా లకు కూడా దోహద క్రియ ఉండేవేమో చెప్పలేము

ఇటీవల అమెరికాలో ఒక శాస్త్రవేత్త ఫల వృక్షాలకు ఒక కొత్త రకం దోహదాన్ని కనిపెట్టాడట చెట్టు మానుకు పోజిటివ్ ఎలక్ట్రోడ్‌ను, చిటారు కొమ్మలకు నెగెటివ్ ఎలక్ట్రోడ్‌ను పెట్టి విద్యుచ్ఛక్తిని ప్రస రింపజేస్తే ఫలాలు త్వరగా పక్వానికి వస్తాయట నారింజజాతి వృక్షాలకు ఈ విద్యుత్ప్రయోగాన్ని చేసి చూడగా మంచి ఫలితాలు కనిపించాయట

ఇది సర్వాలంకార భూషితలైన అంగనామణులు చేసే దోహద క్రియలతో భావ సౌకుమార్యంలోగాని, ఊహాసౌందర్యంలోగాని పోలికకు రాదు అయినా అంతకంటె ప్రయోజనకరమైనది కనుక, ఈ విద్యుద్దో హదక్రియను కావ్యాలలో వాడుకొనడానికి వీలులేకపోయినా, మన కృషీ వలులుకూడాప్రయోగించి సత్ఫలితాలను పొందవచ్చు

ఫలవృక్షాలకు వలెనే వరి, జొన్న మొదలైన ఆహార సస్యాలకు కూడా ఎరువుల వంటివి అవసరం లేకుండా సులభంగా పంటను అధికం చేసే దోహదాలను ఏ శాస్త్రవేత్త అయినా కనిపెడితే బాగుండును, మన ఆహార సమస్యను త్వరలో పరిష్కరించుకోవచ్చు.

# ఢిల్లీ విద్యార్థుల సాహసం

ఇటీవల నలుగురు ఢిల్లీ విద్యార్థులు చేసిన సాహసం దేశాన్ని ఆకర్షిం చింది పంజాబ్ రోడ్‌వేస్‌కు చెందిన ఒక క్యాషియర్‌ను ఇద్దరు దొంగలు దోచుకుని హత్యచేసి కారులో పారిపోతుండగా నలుగురు కాలేజీ విద్యార్థులు వెన్నాడి పట్టుకుని పోలీసులకు అప్పగించారు వారి సాహసాన్ని విద్యామంత్రి శ్రీ చాగ్లా స్వయంగా ప్రశంసించారు.

విద్యార్థిదశలో యువకులలో ఉత్సాహం, ఉద్వేగం సహజంగానే పొంగిపొరలుతుంటాయి అవి కేవలం పాఠ్యపుస్తకాలు చదివి, పరీక్షలలో ఉత్తీర్ణులు కావడానికే పరిమితాలై వుండడం అసహజం, అసాధ్యంకూడా, అందుచేత అవి తరచుగా ఇతర రంగాలవైపు మళ్ళుతూ వుంటాయి స్కౌటింగ్, ఎన్ సి సి వంటి ఉద్యమాల ద్వారా అవి క్రమశిక్షణకు లొంగి, వ్యక్తిలోని ఉత్తమోత్తమ గుణాలను వెలికి తీసుకురాగలిగితే, శీలాన్ని పెంపొందించ గలిగితే హర్షించదగినవే అలాకాక, కొన్నాళ్ళ క్రిందట ఒరిస్సాలోను, ఇటీవల కేరళలోను జరిగినట్టు శాంతిభద్రతలకు భంగకరంగా తయారైతే చింతించాలి, రాజకీయ వర్గాల ప్రభావానికి లోనైతే, సంఘ విద్రోహ శక్తులకు దోహద కరమైతే విచారించాలి విద్యార్థులు క్రమశిక్షణ తప్పి, ఈ విధంగా ప్రవర్తిస్తున్నారనే నింద తర చుగా వినబడుతున్న ఈ రోజులలో ఢిల్లీ విద్యార్థుల ధీరోచిత చర్య ఎంతైనా కొనియాడదగింది

వారు చేసిన సాహసం అపరాధ పరిశోధక సాహిత్యంలో పేరొం దిన పెర్రీ మేసన్ సాహసాలకు, జేమ్స్‌బాండ్ అద్భుతాలకు ఏవిధం గాను తీసిపోదు ఎటొచ్చీ, శ్రీ చాగ్లావంటి ప్రముఖుడు "సర్టిఫికెట్" ఇచ్చారుగదా అని విద్యార్థులు నేర పరిశోధన మోజులో పడి, క్లాసు పుస్తకాలకు బదులు ఈనాడు కుప్పతిప్పలుగా వస్తున్న చౌకబారు డిటెక్టివ్ నవలల అధ్యయనం ఎక్కువ చేయరనే ఆశిస్తున్నాము

# ఎన్నికల కవులు

ఎన్నికల రోజులలో జ్యోతిష్కులకే కాదు, కవులకు కూడా మంచి గిరాకీ పురుషులందు పుణ్యపురుషులు వేరుగా వున్నట్టు కవులలో ఎన్నికల కవులు వేరే వుంటారు

వీరికి తిట్టు కవిత్వం, భట్టు కవిత్వం, బాగా వచ్చివుండాలి ఒక్కొక్క పార్టీనే పొగడుతూ, మిగతా పార్టీలను తెగడుతూ మార్చి మార్చి వేరువేరుగా పద్యాలో, పాటలో బుర్రకథలో వ్రాసి వుంచుకుంటే, ఎవరికి కావలసినవి వారు ఎగరవేసుకు పోతారు ఈ విధంగా ఎన్నికల రోజులలో ఎంత వ్యాపారమైనా చేయవచ్చు

అస్సాంలో కొన్ని నియోజక వర్గాలలో లెఫ్టిస్టు కమ్యూనిస్టులు పొలాలలో పనిచేసుకునే రైతులకు కొన్నిరోజులుగా కాంగ్రెస్ వ్యతిరేక గేయాలు వినిపిస్తున్నారట ప్రబంధ కవిత్వమని, భక్తి కవిత్వమని, భావ కవిత్వమని చెప్పుకున్నట్టు వీటిని ఎన్నికల కవిత్వమని చెప్పుకోవచ్చు

ఎటొచ్చీ, ఒకటే చిక్కు ఈ ఎన్నికల కవిత్వం ఎన్నదగినదిగా ఎన్నడూ వుండదు వినివిని చిరాకు పుట్టి వోటర్లు తమకు ఆ పాటలు వినిపించే పార్టీకి కాక, మరొక దానికి వోటు చేసినా చేయవచ్చు

# ఎన్నికల జ్యోతిష్కులు

ఎన్నికలలో కాంగ్రెస్ చేస్తున్నది భారీ వ్యాపారంగానూ మిగతా రాజకీయ పక్షాలు చేస్తున్నది చిల్లర వ్యాపారంగాను శ్రీ కామరాజ్ ఇటీవల పోల్చారు

ఎన్నికల రోజులలో చిల్లర వ్యాపారం చేసే వర్గం మరొకటి వున్నది అది జ్యోతిష్కుల వర్గం అయిదేళ్ళ కొకసారి వారికి మంచి గిరాకీ తగులుతుంది చకచకా నాలుగు డబ్బులు చేసుకొనడానికి ఎన్నికల రోజులు మంచి సీజను పార్టీ టిక్కెట్టు వస్తుందో రాదో చెప్పడంతో ప్రారంభమై ఎన్నికలలో గెలుపు లభిస్తుందో లేదో, గెలిస్తే ఎన్నికలైన తరువాత ఏదైనా పదవి వస్తుందో రాదో చెప్పడంతో వీరి సీజను ముగుస్తుంది ఈలోగా అడుగడుగునా వీరి సలహాలు కావలసిందే!

ఢిల్లీలో ఎన్నికల జోతిష్యుల సిండికేట్ ఒకటి ప్రారంభమైందట నామినేషన్లు వేసిన టైము, నియోజక వర్గం పేరు అది ఏ అక్షాంశ- రేఖాంశాల మధ్య వున్నది, ప్రత్యర్థులెవరు మొదలైన వివరాలు తెలిపితే, అభ్యర్ధి గెలుస్తాడో లేదో వారు చెబుతారు

ఒక అభ్యర్థి గెలుస్తాడో లేదో, ఒక నియోజక వర్గంలో, లక్ష మంది ఓటర్లుంటే ఎవరు ఎవరికి ఓటు చేయబోతున్నారో ముందే చెప్ప గలిగితే ఇక ఎన్నిక లెందుకు? ఇంత ప్రచారం, ఇంత ఖర్చు హంగామా దేనికి? గెలిచే అభ్యర్థి ఒకడే నిలబడి మిగతా వారు కడుపులో చల్ల కదల కుండా కూర్చుంటే సరిపోదా ?

# పాత్రలూ, వాటి పేర్లూ

రచయితలు సంఘటనలను, పాత్రలను కల్పించగలరు కాని, పాత్రల పేర్లు కూడా కల్పించ గలరా ? గురజాడ అప్పారావుగారు "కన్యాశుల్కంలో" లో చేసినట్టు పాత్రల స్వభావాన్నిబట్టిఅగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్లు, సౌజన్యారావు అని కల్పించడం మొదలుపెట్టినా అటువంటివి ఎన్ని దొరుకుతాయి? దొరికినా అవి వికారంగా తయారు కావా?

జేమ్స్‌బాండ్ పాత్రను సృష్టించిన ఇయాన్ ఫ్లెమింగ్ "గోల్డ్ ఫింగర్" అనే నవల వ్రాశాడు అది చలన చిత్రంగా కూడా వచ్చింది పారిస్‌లో గోల్డ్ ఫింగర్ అనే పేరుగల వాడొకడు తనపేరును అవమాన కరంగా వాడుకుని తనకు అప్రతిష్ఠ తెచ్చినందుకు ప్రచురణ కర్తలమీద కేసు పెట్టాడట.

జంతువులపై కథలు వ్రాసి సరిపుచ్చితే ఏమోగాని, మానవ పాత్రలను తీసుకుని కథలు వ్రాస్తున్నంతకాలం వాటికి లోక వ్యవహారంలో వున్న పేర్లే పెట్టక తప్పదు ఆ పేర్లు గలవారు ఎక్కడో వుండక తప్పదు వారు అభ్యంతర పెట్టడం మొదలు పెడితే కథలు వ్రాయడమే అసంభవమై పోతుంది

అప్పటికీ సాధారణంగా రచయితలు "ఇందులోని పాత్రలు కేవలం కల్పితం" అని జాగ్రత్త పడుతూ వుంటారు ఒక రచయిత అలాగే కథ వ్రాసి పత్రికకు పంపుతూ "దీనిలోని పాత్రలకు బ్రతికి వున్న, లేదా చనిపోయిన మనుష్యులతో ఎట్టి సంబంధమూ లేదని గమనించ వలెను" అని వ్రాశాడట దాన్ని సంపాదకుడు తిరుగు టపాలో త్రిప్పి పంపిస్తూ "ఈ కారణము చేతనే మీ కథను త్రిప్పి పంపడమైనది" అని సమాధాన మిచ్చాడట పాత్రలకు యథార్థ వ్యక్తులతో పోలికవున్నా చిక్కే, లేకపోయినా చిక్కే మరి

# పువ్వులు — పూబోడలు

పువ్వులతోపాటు నార తలకెక్కిందట. గోవాలో పువ్వులతో పాటు ఒక ఎన్నికల గుర్తుకూడా తలకెక్కింది

గోవా మహారాష్ట్రలో విలీనం కావాలనే వారిగుర్తు పువ్వు. మొన్న జరిగిన జనవాక్య సేకరణలో పోలింగ్‌కు స్త్రీ ఓటర్లు తలల నిండా దట్టంగా, దిట్టంగా పువ్వులు పెట్టుకు వచ్చారట. పోలింగ్ కేంద్రాలకు నూరుగజాల లోపల పార్టీల ఎన్నికల గుర్తులు ప్రదర్శించరాదని నిషేధం వున్నప్పటికీ, అధికారులు నిస్సహాయంగా చూస్తూ వూరుకోవడం తప్ప ఏమీ చేయలేక పోయారు. స్త్రీలు పూలు పెట్టుకురాకుండా చేయడం వారి తరమా? అంటే, అప్రయత్నంగానో, సప్రయత్నంగానో పువ్వులు పూబోడులు కలసి ఒక పార్టీకి పోలింగ్ కేంద్రాల వద్దనే ప్రచారం చేసి పెట్టడం జరిగిందన్నమాట

గోవా కేంద్ర పాలిత ప్రాంతంగానే వుండాలనే వారికి జనవాక్య సేకరణ ఫలితం ఎదురు తిరిగితే, దానికి కారణం స్త్రీ ఓటర్లు పువ్వులు పెట్టుకుని రావడమేనని వారు అభ్యంతరం లేవదీస్తారేమో.

ఇక ఇలాటి చిక్కులు రాకుండా చేయాలంటే పువ్వులే కాదు, పెన్ను, రిస్టువాచీ, కళ్ళజోళ్ళు, కాళ్ళజోళ్ళు వంటి వంటిపై ధరించే వస్తువులేవీ ఎన్నికల గుర్తులుగా పనికిరావని శాసించాలి. లేకపోతే వాటిని ధరించి పోలింగ్‌కు రాకూడదని నిషేధించాలి

అప్పటికీ, మిగతావాటి మాట ఎలావున్నా, పువ్వు గుర్తుకు సంబంధించినంతవరకు ఒక చిక్కు తప్పదు. ఎన్నికలలో పురుషులతో సమానంగా స్త్రీలుకూడా పాల్గొంటున్నారు. స్త్రీలు స్వయంగానేపూబోడులు. వారి వదనాలను కవులు పద్మాలతో పోల్చారు. వారి నేత్రాలను కలువ రేకులతో పోల్చారు. నాసికను చంపక పుష్పంతో, నవ్వితే మెరిసె పలువరసను మల్లెమొగ్గలతో పోల్చారు. కపోలాలలో గులాబీలు దాగి వుంటాయని వర్ణించారు. మరి పువ్వులను ఎన్నికల గుర్తుగా వుపయోగించరాదని నిషేధించినా ప్రయోజనం వుంటుందా?

# అనుకరణ వల్ల లాభం

ఒకడు దారి చేసి చూపిన తర్వాత, దాని వెంట నడవడం సులభం కొలంబస్ అమెరికా మార్గాన్ని కనిపెట్టిన తర్వాత చాలామంది అతని ననుసరించి, అమెరికా వెళ్లారు మరి కొలంబస్‌కు వచ్చిన ఖ్యాతి అందరికీ వచ్చిందా?

సాహిత్యంలో, ఇతర కళలలో, విజ్ఞాన శాస్త్రంలో, వ్యాపారం మొదలైన వివిధ రంగాలలో వినూత్న ప్రయోగాలు చేసి, కొత్తదార్లు తొక్కే కొలంబస్‌లు కొద్దిమందే వుంటారు వారిని అనుకరించి సులభంగా పేరో, ధనమో కొట్టేయాలని చూసేవారు చాలామంది వుంటారు

అమెరికాలో ట్వీట్సీ రెయిల్‌రోడ్ అనే ఒక కంపెనీ కొన్నివేల డాలర్లు ప్రచారం క్రింద ఖర్చుచేసి మంచిపేరు సంపాదించుకున్నదట దాన్ని చూసి కన్నుకుట్టి మరొకడు టూట్సీ రెయిల్‌రోడ్ అనే పేరుతో మరొక కంపెనీ పెట్టి, మొదటిదానికి వచ్చిన ప్రచారాన్ని కొట్టేయడానికి యత్నించాడట ట్వీట్సీ—టూట్సీల పేర్లు ఒకే విధంగా వున్నందున, పేరు మార్చుకోవలసిందిగా రెండవ వాడిని కోర్టు ఆదేశించింది

కోర్టు తీర్పును శిరసావహించక తప్పదు కనుక రెండవ వాడు పేరు మారుస్తా డనుకోండి కాని, సెంట్ ఖర్చులేకుండా ఇంతగా వార్తలలో కెక్కిన అతని కంపెనీకి రావలసిన ప్రచారం ఎలాగూ వచ్చేసింది పేరు మార్చినా, ఆ ప్రచారలాభం కొంత అతనికి మిగలకపోతుందా?

# రంగాగారి ఛలోక్తి

స్వతంత్రపార్టీ నాయకులు శ్రీ ఎన్. జి. రంగా కాంగ్రెసును ఒక్క తేడాతో—పాండవులతో పోల్చారు. అయిదుగురు పాండవులకు ఒకే భార్య వుండేది. కాంగ్రెసు విషయంలో ఇది వ్యతిరేకమై, ఆ సంస్థకు అయిదుగురు భార్యలున్నారని చమత్కరించారు.

పంచాయితీ సంస్థలు, సహకార సంస్థలు మొదలైనవేవో అయిదింటిని పేర్కొని శ్రీ రంగా వాటిని కాంగ్రెసుకు గల అయిదుగురు భార్యలుగా వర్ణించారు. మన దేశంలో ఎవరికైనా బహుభార్యాత్వ నిషేధం వర్తించవచ్చుగాని, రాజకీయ పక్షాలకు, వాటి ప్రభుత్వాలకు మాత్రం ఆ నిషేధం లేదుకదా? ఇటువంటి భార్యలు ఏ ప్రభుత్వానికైనా తప్పనివే. అయిదింటితోనే సరిపుచ్చనక్కర లేదు. ఒక్కొక్క ప్రభుత్వ శాఖ ఒక్కొక్క భార్యవంటిదే. రేపు ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా—ఆఖరికి స్వతంత్రపార్టీ ఏర్పరచినా—ఇటువంటి భార్యలు తప్పరు.

ఏమైనా పొరపాటునో, అలవాటు చొప్పునో శ్రీ రంగా కాంగ్రెస్‌ను పాండవులతో పోల్చారు. పాండవులలో కొన్ని లోపాలున్నప్పటికీ, కనీసం, మహాభారత కర్త దృష్టిలో వారిదే ధర్మపక్షం. చివరికి గెలుపుకూడా వారిదే. మరి, వ్యాసునితో శ్రీ రంగా ఏకీభవిస్తున్నారని దీని అర్థమా? ఈ ఉపమానాన్ని అదేపనిగా పొడిగించడం భావ్యంకాదు గాని, మరొక సందేహం. పాండవులపట్ల ద్వేషం, రాజ్యకాంక్ష తప్ప మరేమీ లేని కౌరవుల వంటివా, మన ప్రతిపక్షాలు?

# ప్రధాని పదవికి అర్హతలు

ప్రధానమంత్రి కాదలచిన వ్యక్తికి ఎట్టి అర్హత లుండాలి? ఒకరు తనకు వేసిన ఈ ప్రశ్నలకు సమాధానంగా శ్రీ మొరార్జీ దేశాయి ఆరు అర్హతలను పేర్కొన్నారు ఇవన్నీ మంచివేనని మేమూ ఒప్పుకుంటు న్నాము కాని వీటిలోంచి శ్రీ మొరార్జీయే తొంగి చూస్తున్నట్టు అని పించక మానదు

ఉదాహరణకు—పదవీ వ్యామోహం లేకపోవడం ఒక అర్హతగా ఆయన పేర్కొన్నారు కామరాజ్ పథకం క్రింద రాజీనామా ఇచ్చి తనకు పదవిపట్ల వ్యామోహం లేదని ఆయన రుజువు చేసుకున్న మాట నిజమే కాని బొత్తిగా ఆ వ్యామోహం లేని వ్యక్తి ప్రధాని పదవికి పోటీ చేస్తాడా? చేసినా నెగ్గుతాడా? నెగ్గినా రెండేళ్ళు కంటె నిలుస్తాడా?

దీనితో సంబంధమేమీ లేదుగాని ఈ సందర్భంలో మాకొక కధ జ్ఞాపకం వస్తున్నది సినిమా హీరో కావాలని లోలోపల ఉబలాటపడే జర్నలిస్టు ఒకడు సినిమా హీరోకు కావలసిన అర్హత లన్నిటిని పూసగుచ్చి నట్టు వ్రాస్తూ, తన్ను తాను వర్ణించుకుని, అచ్చంగా తన వంటివాడే హీరో కాదగునని తేల్చాడట చివరికి సినిమా హీరోకు జర్నలిజంలో ప్రవేశం వుండాలని కూడా వ్రాశాడట

# యంత్ర మానవులు

మానవుడే ఒక యంత్రం కాకపోతే సజీవ యంత్రం, అతడు తన పనులు కొన్నిటిని చేసి పెట్టడానికి యంత్రాలను తయారుచేశాడు. తిరిగి ఈ యంత్రాలచేత పని చేయించడానికి మరికొన్ని యంత్రాలు రాబోతున్నవా?

లండన్‌లో ఒక కంపెనీ "యంత్రమానవు"లను తయారు చేస్తున్నదట ఫ్యాక్టరీలలో అక్కడా విసుగు పుట్టించే పనులను, అసహ్యం కలిగించే పనులను చేయడానికి ఈ యంత్ర మానవులను ఉపయోగించ వచ్చునట

ఈ యంత్రమానవుని ఖరీదు కొంచెం ఎక్కువే—ఆరువేల పౌనులు అయినా కొన్ని లాభాలున్నాయి మరమ్మతు ఖర్చులుంటాయేమో తప్ప జీతమివ్వనవసరంలేదు అది హెచ్చు జీతం కోరదు చెడిపోతే తప్ప సమ్మె చేయదు ట్రేడ్ యూనియన్‌లలో చేరదు అలసిపోదు జ్వరమో మరొకటో అని వంక పెట్టి సెలవులు పెట్టదు దానికి ప్రావిడెంట్‌ఫండ్ గ్రాచ్యూటీ, నష్టపరిహారం మొదలైనవి అక్కరలేదు

చెక్ మహారచయిత కార్ల్ చాపెక్ ఇటువంటి యంత్రమానవులను (రాబట్స్)ను ఊహించి "ఆర్ యు ఆర్" (రోసమ్స్ యూనివర్సల్ రాబట్స్) అనే నాటకం చాలాకాలం క్రిందట వ్రాశాడు దానిలో మానవులు తమ విశ్రాంతి కోసం రాబట్స్‌ను తయారుచేసి ఉపయోగిస్తూ వుంటారు కొన్ని లక్షలు, కోట్లు రాబట్స్ తయారౌతాయి చివరకు అవి మానవులను అణగద్రొక్కి ప్రపంచాన్ని వశపరచుకుంటాయి పైన చెప్పిన ప్రయోజనాల కోసం ఇటువంటి మహా ప్రమాదాన్ని దేనోన్ని తెచ్చుకోబోతున్నామా?

# మధ్యప్రదేశ్ మాజీ మంత్రి

పదవిపోగానే మంత్రి మనస్తత్వం ఏ విధంగా వుంటుంది? దీనికి సమాధానం చెప్పడానికి పెద్దగా పరిశోధనలు చేయనక్కరలేదు మంత్రుల ప్రవర్తనను బట్టి, మాజీ మంత్రుల మనస్తత్వాన్ని సులభంగా ఊహించవచ్చు

మంత్రి పదవిని విడిచిపెట్టగానే, నిద్ర నుంచి మేల్కొన్నట్టు ఏదో మత్తు దిగిపోయినట్టు, తనలో ఎక్కడో ఖాళీ ఏర్పడినట్టు, కుడిచెయ్యి చచ్చుపడినట్టు, ఏ జూదంలోనో సర్వం కోల్పోయినట్టు వుండవచ్చు

"ఐవరీ టవర్" వంటి ఆ పదవి నుంచి దిగి వీధిలో అడుగుపెట్టగానే రిప్‌వాన్ వింకిల్‌కు వలె ప్రపంచమే కొత్తగా కనిపించవచ్చు రోడ్ల మీద గతుకులే కాదు, పేదల బ్రతుకులలో గతుకులు, రేషన్ దుకాణాల ముందు క్యూలు, పెరిగిపోయిన ధరలు ప్రభుత్వ శాఖలలో అవినీతి, కొత్త మంత్రుల అసమర్థత, పరిపాలనా విధానాలను సంస్కరించవలసిన ఆవశ్యకత—— ఇటువంటి వెన్నో మాజీ మంత్రికి మొదటిసారిగా కనిపించవచ్చు

అయినప్పుడు పదేళ్ళ తర్వాత పదవి నుంచి దిగిన మధ్యప్రదేశ్ ఆర్థిక మంత్రి శ్రీ ఎస్ సి శుక్లాకు చిల్లర డబ్బులు కొత్తగా, వింతగా కనబడడంలో ఆశ్చర్యం ఏముంది? ఏ నాణెం విలువ ఎంతో, వేర్వేరు నాణాలను లెక్కపెట్టడం ఎలాగో తెలియక ఆయన తికమక పడ్డారట; అవును మరి ఆయన ఆర్థిక మంత్రే కావచ్చుగాని, ఆయన పని ఎంతసేపు కాగితాలపై కోట్లు, లక్షల మొత్తాలతోనేగాని వాస్తవ జీవితాన్ని పోలిన చిల్లర డబ్బులతో కాదుగదా;

# ఎన్ని రకాల దోమలు ?

విజయవాడలో దోమలబాధ నానాటికీ ఎక్కువైపోతున్నది దోమతెరలు కొనుక్కోగలిగిన వారికి ఫరవా లేదు. లేని వారికి మంచాల చుట్టూ తెల్లవార్లూ దోమల తెరలు తప్పడం లేదు

ఈ పట్టణం దేనికి ప్రసిద్ధి అయినా కాకపోయినా దోమలకు మటుకు ప్రసిద్ధి విజయవాడను టూరిస్టు కేంద్రంగా చేసి "ఇక్కడ ప్రశస్తమైన దోమలు లభించును" అని పబ్లిసిటీ ఇవ్వవచ్చు.

వీటి బాధను గురించి (వీటియొక్క బాధకాదు వీటివల్ల బాధ) ఒక స్థానిక పత్రికలో ఫిర్యాదు చేసిన పౌరునికి ప్రభుత్వ మశక నిర్మూల నాధికారి ఇచ్చిన సమాధానం వింతగా వుంది వారి జవాబ్దారి మలేరియా దోమల వరకేనట మిగతావాటి బాధ్యత మునిసిపాలిటీదట తమ దోమల సంఖ్య యిప్పుడు చాలా వరకు తగ్గిపోయిందట

దీన్నిబట్టి ఒక విషయం తెలుస్తుంది మొదట విజయవాడ దోమలన్నీ ఒకరకమైనవే తర్వాత మలేరియా నిర్మూలనపట్ల ప్రభుత్వం శ్రద్ధ వహించడంతో అవి రెండు రకాలైనాయి ఒక రకమైనవి గవర్న మెంటు దోమలు ఇవి మలేరియా మాత్రమే కలిగిస్తాయి మిగతా వన్నీ మునిసిపల్ దోమలు ఇవి ఫైలేరియా వంటి ఇతర వ్యాధులను కలిగిస్తాయి ఆయా వ్యాధుల నిర్మూలనకు ప్రభుత్వం శ్రద్ధవహించి వేర్వేరుగా అధి కారులను నియమించే వరకు మిగతా దోమల బాధ విజయవాడ పౌరులకు తప్ప దన్నమాట

నిజానికి దోమలను జాగ్రత్తగా పరిశీలించిన శాస్త్రవేత్తలు మొత్తం 2 500 రకాల దోమ లున్నాయని తేల్చారు అందుచేత. ఇన్నిరకాల దోమ లకు ఇందరు అధికారులను ప్రభుత్వం నియమించేవరకు మనం ఓపిక పట్టాలేమో !

కాని, ఈలోగా మలేరియా దోమలు కొన్ని తప్పించుకుని మునిసి పల్ దోమలతో రహస్యంగా చొరబడకుండా ప్రభుత్వం వెంటనే చెక్ పోస్టులు ఏర్పాటు చెయ్యాలి ఈ రెండు రకాల దోమల మధ్య అంత ర్వివాహాలు జరిగి తిరిగి మలేరియా దోమల సంఖ్య పెరగవచ్చు అలా జరగకుండా నిషేధిస్తూ తక్షణం ఆర్డినెన్సు జారీచేయాలి.

# ఎగిరే కప్పులు కూడా !

ఎగిరే సాసర్లు అందరు ఎరిగినవే ఇప్పుడు ఎగిరే కప్పులు కూడా బయలుదేరాయి

పది పదిహేనేళ్ళపైగా ఎగిరే సాసర్ల గురించి వార్తలు వింటున్నాము ఇదుగో పులి అంటే అదిగో తోక అన్నట్టు ఈ సాసర్లను తాము కళ్ళారా చూశామని, అవి రంగు రంగులుగా వెలుగుతున్నాయని, అవి నేలకు దిగగానే వాటిలోనుంచి వింతవ్యక్తులు బయటికి వచ్చారని, తాము సమీపించగానే మళ్ళీ సాసర్‌లో ఎక్కి పారిపోయారని—— ఓహ్ః, ఎన్ని రకాల కథలు!

వీటిని కట్టు కథలుగా, భ్రమా ప్రమాద ఫలితాలుగా శాస్త్రవేత్తలు తీసివేస్తున్నారు కాని, ఇప్పుడు పెరూ దేశంలో కోస్తా మీదుగా పోతున్న ఒక విమానంలోని పైలట్‌కు, ప్రయాణీకులకు రెండు బ్రహ్మాండమైన కప్పులు ఆకాశంలో కనబడ్డాయట వీటిని ఏమంటారో శాస్త్రవేత్తలు?

అవి అచ్చంగా టీ కప్పుల ఆకారంలో వున్నాయట అందుచేత ఇదివరకు కనిపించినవన్నీ వాటి తాలూకు సాసర్లే అయి వుండాలి ఏదో సుదూర లోకంలో——"గలివర్స్ ట్రావెల్స్"లో బ్రాబ్డింగ్‌నాగ్ అని ఒక మహాకాయుల జాతి వుంటుంది చూడండి——అటువంటి జాతి వారు వున్నారేమో వారు టీ తాగి కప్పులు, సాసర్లు అంతరిక్షంలోనికి విసిరేస్తే కొన్ని ఇటువైపు కొట్టుకు వచ్చాయేమో జొనాథన్ స్విఫ్ట్‌వలె మరొకరెవరైనా వేరొక "గలివర్స్ ట్రావెల్స్" వ్రాయడానికి మంచి కథావస్తువు!

# దైవాధీనం అభ్యర్థులు

మధ్యప్రదేశ్‌లో ఇద్దరు అభ్యర్థులు దేవుళ్ళకు పెద్ద చిక్కే తెచ్చి పెట్టారు ఇద్దరూ తమ తమ ఇష్టదైవాల మీద భారంవేసి ఒకరితో ఒకరు పోటీ చేస్తున్నారు

ఒకాయన రెండు వారాలనుంచి తన గదిలో తలుపులు బిడాయించుకుని కూర్చుని, ప్రార్థనలతో హోరెత్తించేస్తున్నాడట రెండవ అభ్యర్థి తనను పోటీ చేయవలసిందిగా శ్రీకృష్ణుడే స్వయంగా ఆదేశించినట్టు ప్రచారం సాగిస్తున్నాడట

ఇద్దరి దేవుడూ శ్రీకృష్ణుడే అయితే, ఏ భక్తుడిని గెలిపించడమనేది ఆయనకు పెద్ద సమస్య ఏ ఒకరిని గెలిపించినా రెండవ వాడికి అపకారం జరుగుతుంది ఇద్దరినీ గెలిపించడం దేవుడికైనా అసాధ్యమే అందువల్ల ఇద్దరినీ ఓడ గొట్టక తప్పదేమో; ఆ నియోజకవర్గంలో మరి నలుగురు పోటీ చేస్తున్నారట

ఇలా కాక, ఇద్దరి దేవుళ్ళు వేర్వేరైనా చిక్కే దేవలోకంలో ముందుగా వారిద్దరూ తేల్చుకుని, ఆ తర్వాత భూలోకంలో ఈ అభ్యర్థుల సమస్య పరిష్కరించాలి దేవుళ్ళిద్దరికి రాజీ కుదరకపోతే, దివినుంచి భువికి దిగివచ్చి ఎవరి అభ్యర్థి తరఫున వారు ప్రచారం చెయ్యాలి

ఏమైనా, అలవైకుంఠపురంలోనో, కైలాసపానువుల మీదనో తమ తమ భార్యలతో లీలా విలాస వినోదాలలో తమ మానాన తాము హాయిగా కాలక్షేపం చేస్తున్న దేవుళ్ళకు ఈ సువిశాల భూప్రపంచంలో, ఇండియాలో ఒక మారుమూల నియోజక వర్గంలో జనరల్ ఎన్నికలు పెద్ద సమస్యనే తెచ్చి పెట్టాయి కాని మన దేశంలో కనీసం అయిదేళ్ళ కొక్కసారైనా ప్రజలు ఓటర్లుగా మారి, తమ మాట నెగ్గించుకునే అవకాశాన్ని జనరల్ ఎన్నికలు కల్పిస్తున్నాయి కనుక, మన ప్రజాస్వామ్య వ్యవస్థలో దేవతలు జోక్యం చేసుకోకుండా వుంటేనే బాగుండును

# గడ్డాలపై స్టాంపులు

ప్రపంచ మేధావులలో చాలామంది గడ్డాలు పెంచినవారే షేక్స్పియర్, టాల్‌స్టాయ్, మార్క్స్, ఎంగెల్స్, విట్మన్, షా, టాగోర్ మొదలైన వారి రచన లెంత ప్రసిద్ధి కెక్కాయో వారి గడ్డాలంత ప్రసిద్ధి కెక్కాయి వారి రచనలలో ఎంత వైవిధ్యం కనిపిస్తుందో, వారి గడ్డాలలో అంత వైవిధ్యం కనిపిస్తుంది

మేధావులు చాలామంది గడ్డాలు పెంచుతారు కాని, గడ్డాలు పెంచిన వారందరు మేధావులు కారు కొందరు మేధావులవలె కనిపించడానికి గడ్డం పెంచుతారు కొందరు తిరుపతి మొక్కు కోసం పెంచుతారు కొందరు భార్య గర్భవతిగా వున్నందున పెంచుతారు మరి కొందరు మత రీత్యా పెంచుతారు ఇంకా కొందరు వ్యవధి లేకనో, బద్ధకంవల్లనో, ఆర్థిక స్తోమత లేకనో గడ్డాలు పెంచుతారు

అందువల్ల గడ్డాలకు కారణాలు రకరకాలు ఆకారాలు కూడా రకరకాలు, కొన్ని పొడుగాటివి, కొన్ని పొట్టివి, కొన్ని బవిరి గడ్డాలు. మరి కొన్ని మేక పోతు గడ్డాలు

ఇలాంటి రకరకాల గడ్డాలపై మన తంతి, తపాలా శాఖ స్పెషల్ స్టాంపులు వేయబోతున్నట్లు కేంద్ర మంత్రి శ్రీ జగన్నాథ్ పహాడియా మొన్న మద్రాసులో వెల్లడించారు అంటే ప్రతివారి గడ్డానికి స్టాంపు అతికిస్తారని కాదు, రకరకాల గడ్డాలను చూపించే స్టాంపులను విడుదల చేస్తారని మాత్రమే

తంతి, తపాలా శాఖ దృష్టి ఈసారి గడ్డాలపైకి ఎందుకు పోయిందో తెలియదు కాని, గడ్డం పురుష లక్షణం దాన్ని ప్రత్యేకించి గౌరవించడం ఈ అంతర్జాతీయ మహిళా దశాబ్దంలో స్త్రీలకు ఈర్ష్యా కారణం కావచ్చు తనుక మహిళల జడలపై, రకరకాల ముడులపై కూడా స్పెషల్ స్టాంపులు విడుదల చేయడం సముచితం

# నవ్వుకేం కారణాలుం

మనిషి ఎందుకు నవ్వుతాడు? ఎందుకేమిటి? నవ్వు వస్తే నవ్వుతాడు అంతే

కాని ఉత్తర అమెరికా, యూరప్, మధ్యప్రాచ్యాలకు చెందిన 150 మంది మనస్తత్వ శాస్త్రజ్ఞులకు ఈ సమాధానం చాలలేదు మనిషి ఎందుకు నవ్వుతాడో తెలుసుకొనడానికి వారు వేల్స్‌లోని కార్డిఫ్‌లో మొన్న ఒక మహాసభ జరిపారట

మనిషి ఎందుకు ఏడుస్తాడో మనకు తెలుసు బాధ కలిగితే ఏడుస్తాడు సుఖం కలిగితే సంతోషిస్తాడు ఈ లక్షణాలు మనిషికి, జంతువులకు సమానమే

కాని, సంతోషం వేరు నవ్వువేరు నవ్వు మనిషికే చేతనైన విద్య మనిషి కొక్కడికే ప్రకృతి ప్రసాదించిన వరం ఏవో కొన్ని కండరాల కదలికవల్ల నవ్వు కలుగుతుందని శరీర శాస్త్రం చెప్పవచ్చు మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఇంకేదో కారణం చెప్పవచ్చు కాని, నవ్వు నవ్వే దాన్ని నిర్వచించడానికి వీలులేదు

గులాబీపువ్వు అందంగా ఎందుకున్నదో తెలుసుకొనడానికి దాని, రేక లన్నిటిని వూడదీసి పరిశోధిస్తే గులాబీ పువ్వే మిగలదు అలాగే నవ్వు ఎందుకు కలుగుతుందో పరిశోధించబోతే నవ్వే మిగలదు

ఒక సన్నివేశం చూస్తే, లేదా ఒక ఛలోక్తి వింటే ఒకడికి నవ్వు వస్తుంది మరొకడికి నవ్వు రాదు మొదటి వాడికైనా ఒక సందర్భంలోనే వస్తుంది అన్ని సందర్భాలలోను రాదు మనకు చాలా బద్ధశత్రువైన వాడు ఎంత మంచి ఛలోక్తి విసిరినా, మనకు నవ్వురాదు మన పై అధికారి ఎంత చచ్చు జోక్ వేసినా, మనకు దానిలో పగలబడి నవ్వేటంత హాస్యం కనిపిస్తుంది ఇలాగ నవ్వులలో ఎన్ని రకాలైనా వుంటాయి వాటికి కారణాలు కూడా ఎన్ని రకాలుగానైనా వుంటాయి

కాని, హాయిగా నవ్వడానికి మనిషిలో "సెన్స్ ఆఫ్ హ్యూమర్" —హాస్య ప్రియత్వం—వుండాలి నవ్వుకు ముఖ్య కారణం అదే అది లేని వాడిని ఎంత ప్రయత్నించినా నవ్వించలేము కార్డిఫ్ అంతర్జాతీయ మహాసభ నవ్వులకు మరి ఏ నిర్వచనం ఇచ్చినా అది నవ్వు పుట్టిస్తుంది

# అగ్ని పేటికా సందేశం

"కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు" అని కాళిదాసు అన్నాడు కామార్తులైన వారికి ఇది చేతనం, ఇది అచేతనం అని తెలియదు కదా' అందుకే మేఘదూత కావ్యంలో విరహార్తుడైన యక్షుడు మేఘంద్వారా ప్రియురాలికి సందేశం పంపించాడు.

కేంద్ర కుటుంబ నియంత్రణ శాఖవారు కూడా అలాగే అగ్గిపెట్టెల వంటి అచేతన వస్తువులద్వారా అసంఖ్యాక ప్రజలకు ఒక సందేశం పంపించబోతున్నారు "దో యా తీన్ బచ్చే బస్"—"ఇద్దరు లేదా ముగ్గురు పిల్లలు చాలు!" అని ఆరుకోట్ల లేబుల్స్‌ను వారు ముద్రించారట వాటిని అగ్గిపెట్టెల వెనక అంటించి పంపిణీ చేస్తారు.

మంచి ఆలోచనే. అగ్గిపెట్టెలతో అవసరం లేనివారు ఎవరుంటారు ధూమపానం అలవాటున్న ప్రతిపురుషుడికి అగ్గి పెట్టె విధిగా జేబులో వుంటుంది. అగ్గిపెట్టె తీసినప్పుడల్లా కుటుంబ నియంత్రణ సందేశం అతడిని ప్రబోధిస్తుంది అలాగే, పొయ్యి వెలిగించడానికి, దీపం ముట్టించ డానికి అగ్గిపెట్టె తీసిన ప్రతిసారి ప్రతి గృహిణికి ఆ సందేశం కంట పడుతుంది

అతిశయోక్తి అలంకారం వలెనే న్యూనోక్తి అలంకారమని ఒక టుంది దానికి అగ్గిపెట్టె చిహ్నం వెనకవైపు "వెల ఆరు పైసలు" అని ముద్ర వుంటుంది కాని ఎనిమిది పైసలకు తక్కువగా ఎక్కడా దొరకదు ఆరుపైసల వెలగల వస్తువును ఎనిమిది పైసలకు కొనవలసి వస్తున్నదే అని బాధ కలగకుండా చేయడానికి కూడా అగ్గిపెట్టె వెనక అంటించే కుటుంబ నియంత్రణ లేబుల్ పనికి వస్తుంది ఇదొక అదనపు లాభం●

# అధిక ప్రసంగాలు

ఒకప్పుడు అమెరికన్ సెనేట్‌లో సభ్యులు తమకు ఇష్టం లేని బిల్లును నిరోధించడానికి చర్చను అనంతంగా పొడిగిస్తూ ప్రసంగాలు చేసేవారు. ఒక్కొక్క సభ్యుడు పద్నాలుగేసి గంటలసేపు ఏకబిగిని ప్రసంగించిన సందర్భాలుకూడా వుండేవి. ఒక సభ్యుడు అలసిపోయి కూర్చోగానే మరొక సభ్యుడు అందుకునేవాడు రోజుల తరబడి, వారాల తరబడి చర్చసాగేది చివరికి బిల్లును ఉపసంహరించుకొనక తప్పేదికాదు.

ఈ పద్ధతిని "ఫిలిబస్టర్", "ఫిలిబస్టరింగ్ టాక్టిక్స్" అనేవారు. సభ్యులు బిల్లును గురించే మాట్లాడాలనిలేదు అన్ని గంటలసేపు ఒక విషయం మీద మాట్లాడడానికి ఏమీ వుండదు కూడా అందుకని "ఫిలిబస్టర్" చేయదలచిన సభ్యుడు తనకు తోచినదేనిమీదైనా అనర్గళంగా ఉపన్యాసం సాగించేవాడు అదీ కుదరకపోతే, ఏ నవలనో, కావ్యాన్నో చేతపుచ్చుకుని పేజీలకు పేజీలు చదివేసేవాడు

రాజ్యసభలో ఎస్. ఎస్. పి సభ్యుడు శ్రీ రాజ్‌నారాయణ్ మొన్న ఈ "ఫిలిబస్టర్" పద్ధతిని అనుసరించాడట అధికారభాష చట్టం సవరణ బిల్లుకు వ్యతిరేకంగా ఆయన ప్రసంగం వరదలా, ఉప్పెనలా సాగిపోయిందట దానితో మిగతా కార్యక్రమాలు ఆగిపోవలసి వచ్చింది

ఇటువంటి సుదీర్ఘ ప్రసంగాలకు అవకాశం లేకుండా అమెరికన్ సెనేట్ 1917లో కొన్ని నిబంధనలను రూపొందించుకున్నది శ్రీ రాజ్‌నారాయణ్ వంటి వక్తల వాక్ప్రవాహానికి అడ్డుకట్టలు కట్టడానికి మన లెజిస్లేచర్లలో కూడా కొన్ని నిబంధనలు అవసరం కావచ్చు

# పావురానికి ప్యాస్ పోర్టు

ఒకప్పుడు మానవులకు కూడా ప్యాస్‌పోర్టులు అక్కరలేని స్వర్ణయుగం వుండేది ఇప్పుడు పావురాలకు కూడా ప్యాస్‌పోర్టులు కావలసివస్తున్నది

ఫ్రాన్సు నుంచి ఒక ఆసామీ తన పెంపుడు పావురాయిని న్యూయార్క్‌కు ఓడలో తెచ్చుకోబోతే, దాని ప్రయాణ పత్రాలు సరిగా లేవని అధికారులు త్రిప్పి పంపివేశారట దానితో అది తిరిగివెళ్ళి ప్యాస్ పోర్టు తెచ్చుకుని వచ్చి న్యూయార్కులో దిగవలసి వచ్చింది

జాతీయత వెర్రితలలు వేయడం మొదలు పెట్టినప్పటి నుంచే ప్యాస్ పోర్టులంటూ వచ్చాయి, గ్రీకు చరిత్రకారుడు హిరాడోటస్ ఏ ప్యాస్‌పోర్టు లేకుండానే దేశాలు తిరిగి చరిత్ర రచించాడు పాహియాన్ బుద్ధుని జన్మస్థలాల్ని దర్శించడానికి ఏ ప్యాస్ పోర్టు నిబంధనలు అడ్డు రాలేదు హ్యూయెన్‌త్సాంగుకు సయితం అంతే; ఇటాలియన్ యాత్రికుడు మార్కోపోలోకూడా ప్యాస్‌పోర్టు లేకుండానే ఇండియా మొదలైన దేశాలు తిరిగాడు పద్దెనిమిదవ శతాబ్దం వరకు ప్యాస్‌పోర్టుల పద్ధతి, వీసాల విధానం లెనేలెదు. ఇవన్నీ ఇటీవల వచ్చినవే

మానవులకు సరే స్వేచ్ఛగా తోచిన చోటికి వెళ్ళగల విహంగాలకు కూడా ప్యాస్‌పోర్టులా? ఫ్రెంచి పావురం చట్టానికి కట్టుబడి ప్యాస్‌పోర్టు తెచ్చుకున్నదిగాని, ఆకాశమార్గాన రాదలిస్తే అమెరికన్ అధికారులు ఆపగలిగేవారా?

# కప్పల ఎగుమతి

"త్రైప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ" అన్నాడు కవి

అవును వానాకాలం వస్తే ఎక్కడెక్కడి కప్పలు బయటపడ తాయి వాన కురవబోతున్నట్టు వాటికి ముందే తెలిసిపోతుంది కాబోలు, ఒక్కొక్కసారి వర్షాగమనానికి ముందే గొంతులు సవరించుకుని సిద్ధంగా వుంటాయి

వాన కురిసి చెరువులు, దొరువులు, గోతులు, గుంటలు నిండగానే "మండూక శబ్దం" ప్రారంభమౌతుంది ఒకటి మంద్రస్థాయిలో, మరొ కటి తారస్థాయిలో, మధ్యలో ఉండుండి ఒకటి మధ్యమ స్థాయిలో వంతులు వేసుకున్నట్టు అయిస్తూ పాటకచేరీ చేస్తాయి గంటల తరబడి గంభీరోప న్యాసాలిచ్చినా నోరు నొప్పిపుట్టని రాజకీయ నాయికులతో వాటిని పోల్చవచ్చు

రాజకీయ నాయకులతో వాటికి మరొక పోలిక కూడా తేవచ్చు తరచుగా పార్టీలుమారే రాజకీయ వాదుల వ్యవహారం కప్పల తక్కెడ వంటిదే.

పాములకు కప్పలే ప్రధానాహారం మానవులకు కూడా అవి రుచి కరమైన ఆహారంగా పనికివస్తాయట అమెరికా• ఫ్రాన్సులలో కప్పలను చాలా ఆప్యాయంగా తింటారట

అందువల్ల వాటిని భారీయెత్తున ఎగుమతి చేయాలని ఇండియా ప్రభుత్వం తలపోస్తున్నది నిడుడు కప్పల ఎగుమతివల్ల 68 లక్షల విదేశీ మారకద్రవ్యం లభించినదట

మనదేశంలో కప్పలకేమి కొరత? ఎన్నిటినైనా ఎగుమతి చేయ వచ్చు, మనం కప్పలను పంపితే అమెరికా ఆహార ధాన్యాలను పంపేటట్టు ఒడంబడిక కూడా కుదుర్చుకోవచ్చు

# ఫిబ్రవరి 30

కుంందేటి కొమ్మును సాధించవచ్చు ఇసుకనుంచి తైలం తీయవచ్చు మూర్ఖుని మనస్సు రంజింపచేయవచ్చునేమో కూడా కాని, ఫిబ్రవరి నెలకు 30 వ తేదీని చేర్చడం సాధ్యమా?

చేర్చినా, అది ఏనాటికో ఒకనాటికి బయటపడకుండా వుంటుందా? హైదరాబాద్‌కు చెందిన నూరుద్దీన్ అనే ఇంజినీరింగ్ పట్టభద్రునికి ఇంతే జరిగిందట అతని స్కూల్ సర్టిఫికెట్‌లో ఏ మహానుభావుడు వేశాడో గాని, అతని పుట్టిన రోజును ఫిబ్రవరి 30 వ తేదీగా వేశాడట; అది ఇన్నేళ్ళకు బయటపడింది

అతడు ఫిబ్రవరి 29 వ తెదీన జన్మించి వుండవచ్చు లేదా మార్చి 1వ తేదీన జన్మించి వుండవచ్చు ఫిబ్రవరి 30 వ తేదీన జన్మించడానికి మాత్రం వీలులేదు అందువల్ల అతడు అసలు పుట్టనె లేదనే ప్రభుత్వం నిర్ధారణకు వచ్చినా ఆశ్చర్యం లేదు

ఫిబ్రవరి 30 తేదీయే కాదు, ఫిబ్రవరి 29 కూడా కొందరిని చాలా ఇబ్బంది పెడుతూ వుంటుంది. మన ఉపప్రధాని మొరార్జీదేశాయి ఫిబ్రవరి 29వ తేదీన జన్మించారు అది నాలుగేళ్ళ కొకసారి లీప్ సంవత్సరంలో తప్పరాదు అందువల్ల అందరివలె ఆయిన ఏటేటా ఇంగ్లీషు తేదీ ప్రకారం జన్మదినోత్సవం చేసుకొనడానికి వీలులేదు ఇంతే కాదు ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారం ఆయన వయస్సు వచ్చే ఫిబ్రవరి 29వ తేదీ నాటికి 18 సంవత్సరాలే

# హాస్య మహాసభ

రచయితల మహాసభలు సర్వసామాన్యమై పోయాయి రచయితలలో మళ్ళీ వేర్వేరు ధోరణులకు చెందినవారి మహాసభలుకూడా తరచుగా జరుగుతూనే వున్నాయి. రచయిత్రుల మహాసభలుకూడా జరుగుతున్నాయి. కాని, ప్రత్యేకంగా హాస్యరచయితల మహాసభ జరిగినట్టు ఎక్కడా విన లేదు హైదరాబాదులో మరి కొద్ది రోజులలో జరుగనున్న హాస్య మహా సభ బహుశా మొదటిది కావచ్చు దానిలో ఉర్దూ మొదలయిన భాషల రచయితలు పాల్గొంటారట తాము వ్రాసుకు వచ్చిన ఛలోక్తులు చదువుతారట

ఊహ మంచిదే! జోక్స్ అంటే చెవికోసుకోనివా రెవరు? కాసేపు ఈతి బాధలను మరచిపోయి హాయిగా నవ్వుకొనడానికి అంతకంటె మంచి సాధనమేది ?

జోక్సు నిజంగా బాగుంటే శ్రోతల నవ్వులతో సభాస్థలం ఎగిరి పోకుండా తగు కట్టుదిట్టాలు చేయడం మంచిదేమో అయితే రచయితలలో ఒకరంటే ఒకరికి ఒక్క పిసరు ఈసు వుండడం సహజం కనుక అంతగా నవ్వులు వినబడక పోవచ్చు. ఒకరిమీద ఒకరు జోక్స్ విసురు కుంటే గలాటా జరిగే ప్రమాదం వచ్చినా ఆశ్చర్యంలేదు అలా కాకుండా మహా సభ మూడు నవ్వులు, ఆరు జోకులుగా (లేదా మూడు జోకులు, ఆరు నవ్వులుగా) జరుగుతుందనే ఆశించుదాము

ఈ మహా సభ తర్వాత, విషాద రచయితలు కూడా గొల్లున కన్నీరు మున్నీరుగా మహాసభ జరుపుతారా ?

# భీమ సంఘం

ఇది సంఘాలయుగం వృత్తులవారీగా సంఘాలు కులాలవారీగా సంఘాలు. మతాలు, భాషలు, ప్రాంతాలు, జాతులు, సెక్సులు వయస్సులు, కళలు, అభిరుచులు, అభిమానాలు - అన్నిటికి వేర్వేరు సంఘాలు

పార్లమెంటులోని అతికాయులు మొన్న వేరె సంఘం పెట్టుకున్నారట తమ ప్రత్యేకావసరాల కోసం, ముఖ్యంగా భోజనం, వసతి మొదలైనవి తమకు ఉదారంగా లభించేటట్టు చూడడం కోసం వారు ఈ సంఘం ద్వారా పోరాడుతారట

నిజానికి, వారికి వేరే సంఘమంటూ కావాలా? చొక్కా చేతులు పైకెత్తి గట్టిగా దబాయిస్తే, ఏ మంత్రి, ఏ అధికారి వారి కోర్కెలను తిరస్కరించ గలడు?

దేహబలం లేనివారికే సంఘ బలం కావాలి పార్లమెంటులో సన్నటి వారు కూడా తగు సంఖ్యలో వుండకపోరు పేద భారత దేశానికి తామే నిజమైన ప్రతినిధులమని, తమకుకూడా కొన్నిప్రత్యేక సౌకర్యాలు కావాలని వారు వేరొక సంఘాన్ని పెట్టుకున్నా పెట్టుకోవచ్చు

కాని, ఇదే జరిగితే, పార్లమెంటులో రకరకాల సంఘాలు తామర తంపరగా బయలుదేరి గందరగోళం ఏర్పడె ప్రమాదం తప్పదు పొట్టి వారు, పొడుగువారు, పెళ్లికానివారు, అయిన వారు, నలభై దాటని వారు దాటినవారు - ఇలా ఇంకా రకరకాలవారు వేర్వేరు సంఘాలు పెట్టుకుంటే ఓవరికి వీరంతా పార్లమెంటుకు ఎన్నికకావడం తమ హక్కుల సాధన కోసమా, దేశ సమస్యల పరిష్కారం కోసమా అని అనుమానం కలుగుతుంది

అతికాయులని తెలిసి తెలిసి వారిని గట్టిగా వ్యతిరేకించే సాహసం ఎవరూ చేయరుగాని, వారు వేరె సంఘం పెట్టుకోవడం ఏమంత మంచి ఉదాహరణ కాదని సాధ్యమైనంత మృదువుగానే విజ్ఞప్తి చేయదలచుకున్నాము

# సుదామ సంఘం

పార్లమెంటులోని అతికాయులతో భీమసంఘం ఏర్పడినప్పుడే, అల్పకాయులంతా కలసి వేరొక సంఘం పెట్టకోవచ్చునని మేము వ్రాశాము సరిగా అదే జరిగింది

121 పౌనులకు మించని సన్నపాటి సభ్యులు చేరి "సుదామ సంఘం" పెట్టుకున్నారట వారి అధ్యక్ష, కార్యదర్శుల బరువులు 99 పౌనులట.

తమకు సగం రేట్లకు భోజనాదికాలు సరఫరా చేయాలని, బరువును బట్టి రైళ్ళలో విమానాలలో టిక్కెట్ రేట్లను నిర్ణయించాలని వీరు పోరాడుతారట అర్భకులైన వీరు జరిపే ఆందోళనను పోరాటం అనవచ్చునో లేదో మరి

కాని అతికాయుల సంఘానికి కుదిరినంత బాగా వీరి సంఘానికి పేరు కుదరలేదు సుదాముడంటే కుచేలుడు అతడు దారిద్ర్యానికి ప్రతీక కాని, సన్నదనానికి కాదు సన్నపాటి వారందరూ బిదవారు కానక్కరలేదు గదా?

భీమసంఘం వారితో కరచాలనం చేయరాదన్నది సుదామ సంఘం నిబంధనలలో ఒకటి కాని, ముల్లువచ్చి అరిటాకు మీద పడినా, అరిటాకు వచ్చి ముల్లుమీద పడినా ఒకటేగదా? సుదాముడు భీమునితో కరచాలనం చేయకపోయినా, భీముడే వచ్చి సుదామునితో కరచాలనం చేస్తే చేయగలిగేదేముంది? బుద్ధిబలం ఉపయోగించి దూర దూరం నుంచే తప్పుకుపోతూ వుండాలి మరి !

ఏమైనా భీమసంఘంవారి కోర్కెలు నెరవేరినంత సులభంగా సుదామసంఘం వారివి నెరవేరడం కష్టం !

# మంత్రుల పరిభాష

"ఫలానా విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది" అని మంత్రిగారు సెలవిస్తే, దానికి సంబంధించిన ఫైలు పోయిందని అర్థమట

"శ్రద్ధ వహిస్తున్నా" మని మంత్రి అంటే ఆ ఫైలు తిరిగి దొరికిందని అర్థమట "తీవ్రంగా పరిశీలిస్తున్నా"మని చెబితే ఈ గొడవంతా దేన్ని గురించో ప్రభుత్వానికే తెలియ దన్నమాట

మొన్న లోక్‌సభలో స్వతంత్రపార్టీ సభ్యుడు శ్రీ ఎన్ దండేకర్ ఈ కొత్త నిర్వచనాలు చేశారు.

అవును, మరి మామూలు భాష వేరు మంత్రుల పరిభాష వేరు మనం వాడే మాటలే మంత్రులు కూడా వాడతారు గాని, వాటి అర్థాలు వేరు,

"త్వరలో అది చేయబోతున్నాం— ఇది చేయబోతున్నాం" అని తరచుగా మంత్రులు చెబుతూ వుంటారు ఆ "త్వరలో" అనే మాట "గోడమీద" రేపు వంటిదేనని మనకు అనుభవైక వేద్యం!

మంత్రుల మాటలకు అర్థాలు వేరని ప్రజలకు తెలిసిపోయింది కనుక, వారు తమ పాత పరిభాషనే ఇంకా ఉపయోగించడం బాగులేదు కొత్త పారిభాషిక పదజాలాన్ని సృష్టించుకోవడం మంచిది

# రోడ్లూ, గోతులూ

మన పట్టణాలలోని రోడ్లన్నీ గోతులతో నిండి పోతున్నందుకు తరచుగా విమర్శలకు లోనవుతున్న మన పురపాలక సంఘాలు పత్రికలలో పడిన ఒక వార్తను చూసి ధైర్యం తెచ్చుకోవచ్చు లండన్ శివార్లలోని ఒక పేటలో ఒక రోడ్డు అయిదేళ్ళుగా గోతులుగా వుంటున్నదట

ఆ రోడ్డును మొదట గ్యాస్ బోర్డువారు త్రవ్వారు దాన్ని పూడ్చి చదును చేశారో లేదో ఎలక్ట్రిసిటీ బోర్డు వారు త్రవ్వారు తిరిగి రోడ్డు బాగుపడిందో లేదో పోస్టల్ శాఖవారు టెలిఫోన్ తీగెల కోసం త్రవ్వారు. వారి పని ముగిసి రోడ్డు చదును కాగానే, మళ్ళీ మొట్ట మొదట త్రవ్విన గ్యాస్‌బోర్డువారు రంగంలోకి దిగారట

"మాకు ఈ గోతుల నుంచి మోక్షం లేదా!" అని ఆ పేటలోని పౌరులు మునిసిపాలిటీకి మొరపెట్టుకున్నారట వా రెవరో విజయవాడ పౌరుల సోదరులవలె వున్నారు.

ఎటొచ్చీ విజయవాడ పౌరుల బాధ అయిదేళ్ళ నాటిది కాదు దగ్గర దగ్గర పదేళ్ళనాటి బాధ డ్రెయినేజ్ సౌకర్యానికై త్రవ్విన గోతులు ఎప్పటికీ పూడేట్టులేవు పౌరులు సభలుచేసి, తీర్మానాలుచేసి, నిరసనలు తెలిపి ఎన్ని చేసినా, పత్రికలలో లేఖలు, సంపాదకీయాలు, కార్టూనులు ఎన్ని పడినా ఎక్కడ తీసిన గోతు లక్కడే వుంటాయి నాగార్జునసాగరైనా పూర్తికావచ్చుగాని, ఈ గోతులు, గతుకులు విరగడ అయ్యేటట్టు లేవు

# ఎక్కడికి వెళ్ళినా....

"పెడుక్కి బియ్యానికి ఒకటే మంత్రమా?" అని సామెత పిడుగు పడినప్పుడు చదవవలసిన మంత్రం వేరు. అక్షతలు చల్లేటప్పుడు చదవవలసిన మంత్రం వేరు

సమయానికి జ్ఞాపకం రాకపోవడం వల్ల పురోహితుడు ఈ మంత్రాన్ని ఆ సందర్భంలో, ఆ మంత్రాన్ని ఈ సందర్భంలో చదివాడేమో, లేక తానున్నది ఏ సందర్భమో మరచిపోయి ఒకదాని కొకటి చదివాడేమో లేక ఎవరు చూడవచ్చాఃులే అని, ఏదైనా మంత్రమె కదా అని ఏదో మంత్రం చదివాడేమో, ఇటువంటిదే ఏదో ఎప్పుడో జరగబట్టే ఆ సామెత వచ్చి వుంటుంది.

ఇటువంటిదే మొన్న విశాఖపట్నంలో సాంఘిక సంక్షేమశాఖ మంత్రి శ్రీ అరిగె రామస్వామిగారికి జరిగిందట జిల్లా మహిళా కాంగ్రెసు మహాసభలో మాట్లాడడానికి వచ్చి, హరిజనుల సమస్యలపై ఆయన మాట్లాడడం మొదలు పెట్టారట

అవును మరి ఇందులో ఆయనను తప్పు పట్టవలసినది లేదు మంత్రులు పర్యటనకు బయలుదేరితే రోజుకు తేలికగా నాలుగైదుసభలలో మాట్లాడవలసి వుంటుంది ఎన్ని సభలలో ఎన్ని కొత్త విషయాలని మాట్లాడ గలరు?

అందులో శ్రీ రామస్వామిగారు ఆనాడే హరిజన సేవక్ సమాజ్ సభలో మాట్లాడ వలసి వుంది అదే ఇది అనుకుని అక్కడి విషయాలు ఇక్కడ మాట్లాడడం మొదలుపెట్టి వుంటారు

అది ఇది కాదని ప్రక్కనేవున్న శ్రీ కాకాని వెంకటరత్నం గారు జ్ఞాపకం చేయగా "ఎక్కడ మాట్లాడినా విషయం ఒకటె కదా!" అని శ్రీరామస్వామి చమత్కరించారట

ఇదీ నిజమేమరి రాజకీయ నాయకులు ఎక్కడికి వెళ్ళినా మాట్లాడేది ఒకటే సాహిత్య సభకు పిలిచినా వారు రాజకీయాలే మాట్లాడతారు సినిమా సభకు పిలిచినా రాజకియాలే మాట్లాడతారు విద్యార్థుల సభకు పిలిచినా రాజకీయాలే మాట్లాడతారు రాజకీయాలే వారి జీవితమైనప్పుడు వారి ఉపన్యాసాలు రాజకీయమయం కావడంలో ఆశ్చర్యం ఏముంది?

# 'సారావేదన"

మోతాదును మించి మద్యపానం చేసేవారికి మర్నాడు వచ్చే తలనొప్పి మొదలైన ఈతి బాధలను ఇంగ్లీషులో "హ్యాంగ్ ఓవర్స్" అంటారు ఇది ప్రత్యేకమైన శిరోవేదన కనుక తెలుగులో "సారావేదన" అనవచ్చు

ఈ "హ్యాంగ్ ఓవర్స్" కారణములేమి, వాటిని నివారించుట ఎట్లు అనే విషయంపై లండన్‌లో మొట్టమొదట సాధికార, ప్రామాణిక గ్రంథం వెలువడనున్నదట రచయిత పేరు జొనాదన్ రూత్ రోజూ మత గ్రంథాన్ని పఠించినట్టు రోజూ సారాయణం తర్వాత దీన్ని పారాయణం చేసేవారు చాలామంది వుంటారు కనుక, ఈ ఏడాదికి ఆ పుస్తకం "బెస్ట్ సెల్లర్" అయినా ఆశ్చర్యం లేదు

ఈ ఉద్గ్రంథంలో రచయిత సారావేదన రాకుండా చేయడానికి, వస్తే పోగొట్టడానికి చాలా ఉపాయాలు సూచించాడట ముఖ్యమైనవి వేర్వేరు రకాల మద్యాలను కలపకూడదు మంచి ఆకలిమీద ఉన్నప్పుడు మద్యం సేవించరాదు. అల్పాహారం తీసుకుని మరీ సేవించాలి మద్య పానం తర్వాత ప్రాణాయామం చేసినట్టు గాలి బాగా పీల్చాలి లివర్‌పై సారా ప్రభావం తొలగించడానికి గుర్రపుస్వారీ, ఈత, పరుగెత్తుట, మంచిదంటాడు, అవి కుదరనప్పుడు ఇద్దరు ముగ్గురు చేరి ముష్టి యుద్ధం చేయాలట (దీనికి ఒకరి సలహా కావాలా? తరుచుగా జరిగేదే కదా?)

వీటి సంగతి ఏమైనా, 'హ్యాంగ్ ఓవర్స్" రాకుండా చేయడానికి రచయిత ఇచ్చిన ఒక మంచి సలహాతో మేము ఏకీభవిస్తున్నాము అసలు మద్యం తాగనేవద్దు తెల్లవారేసరికి కళకళలాడుతూ శుభ్రంగా వుంటారు.

# స్థూల కాయులు

బెర్నార్డ్ షా ఎంత సన్నగా వుండేవాడో, చెస్టర్‌టన్ అంత లావుగా వుండేవాడు ఒకసారి చెస్టర్‌టన్ షాను చూసి "నిన్నుచూస్తే ఈ దేశంలో కరువు వుందేమో ననుకుంటారు" అన్నాడట దానికి షా "నిన్ను చూస్తే ఆ కరువు నీ వల్లనే వచ్చిం దనుకుంటారు" అని సమాధానమిచ్చాడట

ఈ ఇరువురు ప్రసిద్ధ రచయితల సంభాషణను జ్ఞాపకం చేస్తున్నది మొన్న లోక్‌సభలో శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి, శ్రీ పీలూ మోడీకి జరిగిన సంవాదం శ్రీ పీలూ మోడీ ఆహార సమస్యపై మాట్లాడడానికి లేచారట ఆయన స్థూలకాయాన్ని చూచి తిండి కరువును గురించి మాట్లాడే అర్హత ఆయనకు లేదని చమత్కరించారట శ్రీ విశ్వనాథంగారు

ఎందుకోగాని, లావుపాటి వారిని చూస్తే చాలమందికి ఛలోక్తులు వేయబుద్ధి పుడుతుంది లావుపాటి వారికి ఆశావాదం, ఆత్మ విశ్వాసం మొదలైన మంచి గుణాలతోపాటు హాస్యప్రియత్వం కూడా ఎక్కువే సాధారణంగా వారిలో దిగులు కనబడదు తమమీద తామే ఛలోక్తులు వేసుకుంటారు ఇతరులు వేస్తే కోపగించుకు సరికదా, తాము కూడా నిర్మలంగా నవ్వేస్తారు వారి శరీరం పెద్దది, మెదడు చిన్నది కావడంవల్ల ఛలోక్తి అర్థం కావడానికి కొంచెం వ్యవధి పడుతుందని, అందుకే కోపం రాదని కొందరంటారు కాని, ఇలా అనేవారు సన్నపాటివారై వుంటారు

ఏమైనా స్థూలకాయులలో హాస్యప్రియులెక్కువ షేక్‌స్పియర్ తన ప్రసిద్ధ హాస్యపాత్ర ఫాల్‌స్టాఫ్‌కు శరీర స్థౌల్యాన్ని అందుకే అంటగట్టాడు దుష్టపాత్ర కేషియస్‌ను "లీన్ అండ్ హంగ్రీ లుక్" కలిగినవాడని వర్ణించాడు

అందువల్లనే శ్రీ పీలూమోడీ శ్రీ విశ్వనాథంగారి మోటు సరసాన్ని నాజూకు సరసంతో ఎదుర్కొన్నారు ఆహారసమస్యపై మాట్లాడవద్దని తన పార్టీవారు మొదట తన్ను నిషేధించారని కాని, వారికి ధైర్యం చాలకపోవడంచేత తానే ఆ భారాన్ని వహించవలసి వచ్చిందని ఆయన సమాధానం పార్లమెంటు సభ్యులందరు ఇంత హాస్యప్రియులైతే సభా కార్యక్రమాలు మరింత సరసంగా సాగవా?

# బహుసంతానవతి

బ్రెజిల్ దేశంలో 45 సంవత్సరాల ఇల్లాలు 32 మంది బిడ్డలను కన్నదట

పురాణాలలో, పూర్వచరిత్రలో ఆమెను మించిన బహు సంతానవతు లుండవచ్చు కాని, ఈ రోజులలో, అందులోను ఆమె వయస్సును లెక్కలోకి తీసుకున్నప్పుడు, బ్రెజిలియన్ ఇల్లాలిదేనేమో రికార్డు

ఆమెకు వివాహమైంది 14వ ఏట అంటే 31 సంవత్సరాలలో 32 మంది సంతానం ఏడాదికి సగటున ఒకటి, ఒకటిబై ముప్ఫయిఒక్క బిడ్డ చొప్పున కన్నది

సగటు లెక్కలు ఎప్పుడూ వాస్తవాన్ని తెలపవనుకోండి కాని, ఈ సగటు లెక్క ఎంత హాస్యాస్పదంగా కనిపిస్తుందో ఆమె 31ఏళ్ళలో 32 మందిని కనడం అంతే విచిత్రంగా కనిపిస్తుంది విచిత్రం కనుకనే ఆమె నిన్న "వార్తలలోని వ్యక్తి" అయింది

పదిమంది బిడ్డల తల్లిని చూచినా, అందరినీ ఎలా సంబాళించుకోగలుగుతుందా అని జాలిపడతామే! ముప్ఫయి యిద్దరిని కన్న ఆ తల్లిని చూసి ఇంకెంత జాలిపడాలి? వారందరికి నీళ్ళు పోయడం, బట్టలు తొడగడం, తిండి పెట్టడం విద్యాబుద్ధులు చెప్పించడం ఎంత కష్టం! ఇప్పటికైనా బ్రెజిల్ ప్రభుత్వం ఆమె భర్తకు వేసెక్టమీనో, ఆమెకు ట్యూబెక్టమీనో చేయించడం మంచిది మన కుటుంబనియంత్రణ శాఖామంత్రిగారైతే ఈ పాటికి ఆ దంపతులకు విడివిడిగా యావజ్జీవ శిక్ష వేయాలని సిఫారసు చేసి వుండేవారు కాదా?

# స్వెట్లానా అదృష్టం

స్టాలిన్ కుమార్తె స్వెట్లానా వ్రాసిన స్వీయచరిత్ర దాని అమెరికన్ ప్రచురణ కర్తలకు ఆశాభంగం కలిగించింది దాని ప్రతులు అమెరికాలో అమ్ముడు పోవడంలేదట

స్వెట్లానా అదృష్టవంతురాలే ఆ పుస్తకంతో ఆమె 11 లక్షల డాలర్లు డబ్బుచేసుకున్నది నష్టమంతా ఆమెను నమ్మి పుస్తకం అచ్చు వేసినవారిదే

ఈ వార్త చూడగా, మాకు బెర్ట్రాండ్ రస్సెల్ ఆత్మకథలో వ్రాసుకున్న ఒక ఉదంతం జ్ఞాపకం వస్తున్నది రస్సెల్, వైట్ హెడ్ కలిసి గణితశాస్త్రంలో అమూల్యమైనదిగా, మౌలికమైనదిగా ప్రసిద్ధికెక్కిన "ప్రిన్సిపియా మేథమెటికా" అనే ఉద్గ్రంథం వ్రాశారు దాన్ని అచ్చువేయడానికి యూనివర్సిటీ ప్రెస్సు అంగీకరించింది కాని, దానిపై 600 పౌనుల నష్టం రాగలదని, అందులో 300 పౌనుల నష్టం మాత్రమే తాను భరించగలనని తెలిపిందట రాయల్ సొసైటీవారు 200 పౌనులు సహాయం చేయడానికి సమ్మతించారు మిగిలిన వంద పౌనులలో రస్సెల్, వైట్ హెడ్‌లు చెరొక 50 పౌనులు పెట్టుకోవలసి వచ్చింది

ప్రపంచ సాహిత్యానికి అమూల్యాలంకారమనదగిన "ప్యారడైజ్ లాస్ట్" మహాకవి మిల్టన్ పది పౌనులకు అమ్ముకున్నాడు, గోల్డ్‌స్మిత్ తన "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు"ను అప్పులు తీర్చడానికి 60 పౌనులకు అమ్ముకోవలసి వచ్చింది

కాని, ఎవరికీ అక్కరలేని చెత్తపుస్తకం వ్రాసి స్వెట్లానా 82,50,000 రూపాయలు సంపాదించుకుంది ఆమె అదృష్టవంతురాలే కాదు తెలివైనదికూడా వాణిజ్యంలో నేర్పరులైన అమెరికన్ ప్రచురణ కర్తలనే పల్టీ కొట్టించింది

# డాక్టర్ త్రిదోష సేన్

వెనకటి కొక నాటకంలో గయుని పాత్ర ధరించిన కొత్తనటుడు కంగారుపడి గజగజ వణుకుతూ "న న నా దరా" అన్నాడట దీనితో నారద పాత్రధారి మరింత గాబరాపడి "భయుడా! గయము వలదు." అన్నాడట

మొన్న లోక్‌సభలో విద్యామంత్రి డాక్టర్ త్రిగుణసేన్ పడిన కంగారు చూస్తే పైకథ జ్ఞాపకం వస్తుంది డాక్టర్ సేన్ స్వతంత్రపార్టీ సభ్యులను "స్వరాజ్య సభ్యులు"గా పేర్కొన్నారట స్వతంత్రపార్టీవారి "స్వరాజ్య" పత్రిక జ్ఞాపకం వచ్చింది కాబోలు, ఆ తర్వాత ఫ్రాంక్ ఆంథొనీని ఆంథొనీ ఈడెన్ అని పేర్కొన్నారట. మరి ఆ మాజీ బ్రిటిష్ ప్రధాని ఎందుకు జ్ఞాపకం వచ్చాడో!

డాక్టర్ సేన్‌గారికి కంగారు కొంచెం ఎక్కువగానే వున్నట్టుంది రాజ్యసభలో ప్రమాణ స్వీకారం చేసిన సందర్భంలో కూడా ఆయన కంగారు తిన్నారని చెబుతారు ప్రమాణ స్వీకారం కాగానే, వెళ్ళి కూర్చోబోయాడట కాదు, రిజిష్టరులో దస్కతు చేసి కూర్చోవాలని చెప్పగా దస్కతు చేసి వెళ్ళి కూర్చోబోయారట చైర్మన్‌తో కరచాలనం చేయాలని చెప్పగా మళ్ళీ వెనక్కువచ్చి, కరచాలనం చేసి, వెళ్ళి కూర్చోబోయారట అలాకాదు చైర్మన్‌కు వెనకనుంచి వచ్చి కూర్చోవడం సంప్రదాయమని చెప్పేసరికి, మళ్ళీ వెనక్కువచ్చి, చైర్మన్‌ను చుట్టుచుట్టివచ్చి కూర్చున్నారట, ఇదంతా చూస్తున్న ఒక సభ్యుడు "మన విద్యామంత్రి మూడు తప్పులు చేశారు కనుక డాక్టర్ త్రిదోషసేన్ అంటే బావుంటుందేమో"నని చమత్కరించారు

వ్యక్తిగతంగా ఆయన కంగారు మనిషైతే ఎవరికేమి నష్టంగాని ప్రాంతీయ భాషలలో ఉన్నత విద్యాబోధన పేరుతో డాక్టర్ సేన్ సృష్టిస్తున్న గందరగోళం దీనానికి దాఖిగా వుంది

# రాజకీయాలలో తర్ఫీదు

పందిట్లో పెళ్ళి అవుతుంటే పెళ్ళికోసం వచ్చిన వారు కొందరు ఏ గదిలోనో చేరి పేకాట ప్రారంభిస్తారు. ఎవరి వెర్రి వారికి ఆనందం

చరిత్రలో మొదటిసారిగా మానవుడు భూమి ఆకర్షణ శక్తిని జయించాడు మొదటి సారిగా గంటకు 25వేల మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తున్నాడు మొదటి సారిగా లక్షన్నర మైళ్ళ ఎత్తునుంచి తాను చూస్తున్న దృశ్యాలను భూలోక వాసులకు చూపిస్తున్నాడు. మానవులెవ్వరూ ఇంత వరకు చూడని చంద్రుని రెండవవైపు చూడబోతున్నాడు

ఇంత మహత్తర సంఘటన మీద కాస్తయినా ఆసక్తి లేనివారు వుంటారంటే ఆశ్చర్యమే అమెరికాలో కొలంబియా బ్రాడ్‌కాస్టింగ్ సంస్థ వారు మొన్న అపోలో యాత్రికులు ప్రసారం చేస్తున్న వింత దృశ్యాలను టెలివిజన్‌లో ప్రదర్శించారు దీనికోసం వారు అంతవరకు చూపిస్తున్న ఏదో ఫుట్‌బాల్ పోటీని పావు గంటసేపు నిలిపివేశారట ఇందుకు చాలమంది ప్రేక్షకులకు ఆగ్రహం కలిగిందట రోదసీ దృశ్యాల వెర్రి కోసం బంగారం లాంటి ఫుట్‌బాల్ పోటీ దృశ్యాలు ఆపేస్తారా అని రెండు వేలమంది అసమ్మతి తెలియజేశారట

కొంతమంది ఎంత అద్భుత సంఘటనైనా చాలా తేలిగ్గా తీసుకో కలుగుతారు అద్భుత సంఘటనే కాదు. విషాద సంఘటనలను కూడా అంతే రైలు పడిపోయి రెండు వందల మంది మరణించారని వార్త వస్తే "ఆ ఏముంది? వాళ్ళకి ఆయువు తీరిపోయింది చచ్చారు" అని తేలిగ్గా అనేస్తారు

అందరు అంత అదృష్టవంతులు కారు విషాదవార్తవింటే కనీసం సానుభూతి ప్రకటిస్తారు అద్భుత వార్త వింటే ఆశ్చర్యం వెల్లడిస్తారు అమెరికాలోని ఆ ఫుట్‌బాల్ అభిమాను లెవరోగాని అదృష్టవంతులు ఆకాశంలో మొదటిసారిగా జరుగుతున్న అద్భుతం కంటె నేల మీద రోజూ జరిగే ఫుట్‌బాల్ ఆటే వారికి ఆసక్తికరంగా కనిపించింది

ఎందరో మహానుభావు లుంటారు అందరికీ వందనాలు పెట్టడం సాధ్యమా!

# ఎందరో మహానుభావులు

ఈ రోజులలో ఎవరుపడితే వారు రాజకీయవేత్తలై పోతున్నారు. వీరి పాండిత్యాన్ని చూసి కాబోలు పంజాబులో ఒక రాజకీయ కళాశాలను స్థాపించాలని ఆలోచిస్తున్నారట.

రాజకీయ కళాశాలలో చదివినంతమాత్రాన రాజకీయవేత్తలై పోతారా? రాజకీయవేత్తకు కావలసింది కార్యదక్షత, లోకజ్ఞానం, సమయస్ఫూర్తి, వాక్పటిమ, పరేంగితజ్ఞత. ఇవి రాజకీయ కళాశాలలో చదివితే అబ్బుతాయా?

పామర్‌స్టన్ అంత సమర్థుడైన బ్రిటిష్ విదేశాంగ మంత్రి అని పేరుపొందిన ఎర్నెస్ట్ బెవిన్ ఏ కళాశాలలోను చదువుకోలేదు. స్వయం ప్రతిభ వల్లనే అతడు అంత పేరు పొందాడు.

అయితే, మన దేశంలో మంత్రులౌతున్న కొందరిని చూస్తే అలాంటి కళాశాల వుంటేనే మంచిదనిపిస్తుంది. 1937లో బొంబాయిలో శ్రీ బి. జి. ఖేర్ మంత్రివర్గంలోని ఒక మంత్రిని చెక్కు "క్రాస్" చేయమని అడిగితే అడ్డంగా ఒక గీత, నిలువుగా ఒక గీత పెట్టాడట.

బి. ఏ. బి. ఎల్. చదివిన ఒక మద్రాసు మంత్రి తాను ఏదో పనిమీద ఊరు వెళ్ళవలసివచ్చి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి "అయ్యా, నాకు రెండు రోజులు సెలవు మంజూరు చేయవలెను" అని కోరుతూ సెలవు చీటీ వ్రాశాడట.

ఈ మధ్యనే బీహారులో శ్రీ బి. పి. మండల్ తన మంత్రివర్గంలో చేర్చుకున్న నలభై యాభై మంది మంత్రులలో ఒకనికి చేవ్రాలు చేయడం రాదట. వ్రేలుముద్ర వేసేవాడట. మరొకడు "నీకేమి పోర్టుఫోలియో కావా" లని అడిగితే "అదేదో నాకెందుకు? ఏదో ఇలా మంత్రిగా ఉండనిస్తే చాలు" నన్నాడట.

ఇటువంటి మహామహులు ఎలాగూ మంత్రులై పోయే రోజులు వచ్చాయి కనుక, వారికి కనీసం "కామన్ సెన్సు"లో శిక్షణ ఇవ్వడానికైనా రాజకీయ కళాశాలలు స్థాపించడమే మంచిదేమో!

# మంచి సూచన

"అతని కంటె ఘనుడు ఆచంట మల్లన్న" అని సామెత కుటుంబ నియంత్రణ ఉద్యమానికి చక్కని సూచనలు (వింత సూచనలు కూడా) చేయడంలో కేంద్ర మంత్రి డాక్టర్ చంద్రశేఖర్ ఘనులని అనుకున్నాము ఇప్పుడు వారిని మించిన ఘనులొకరు—కలకత్తాలో ఇండియన్ శ్టాటిస్టికల్ ఇన్స్టిట్యూట్ డైరెక్టరు డాక్టర్ సి ఆర్ రావు మరొక మంచి సూచన చేశారు

స్త్రీలు తమ శారీరక సౌష్ఠవం కాపాడు కొనడానికి కూడా కుటుంబ నియంత్రణవిధానం మంచిదని ఆయన సూచన ఒక్కొక్క కాన్పుతో స్త్రీ నడుము అయిదు సెంటి మీటర్ల చొప్పున లావు పెరుగుతుందట అలా పెరగకుండా వుండాలంటే కుటుంబ నియంత్రణ పద్ధతిని అనుసరించాలట.

మంచి సూచనే స్త్రీల సౌందర్యాన్ని ఇనుమడింపజేసేది ముఖ్యంగా నడుము స్త్రీలకు ఎంత సన్నని నడుము వుంటే అంత అందమని మన పూర్వ కవులు ఒకరితో ఒకరు పోటీలుపడి వర్ణించారు స్త్రీకి తనుమధ్య అని, కృశాంగి అని ఎన్నో పేర్లు పెట్టారు అతిశయోక్తులు వారికి బాగా అలవాటు కనుక, ఒక్కొక్కసారి తమ నాయికకు నడుము అసలు లెనే లేదని కూడా వర్ణించేవారు శ్రీనాథుడు "అస్తి నాస్తి విచికిత్సా హేతు" వని నాయిక నడుమును వర్ణిస్తే, పోతన "మహిత భావా భావ మధ్యంబు మధ్యంబు" అని వర్ణించాడు లె నడుమును అందమని భావించడం మన దేశంలోనే కాదు, అన్ని దేశాలలోనూ వుంది విక్టోరియన్ యుగం చివరి వరకు ఇంగ్లీషు స్త్రీలు కూడా నడుము సన్నదనం ప్రస్ఫుటంగా కనబడే విధంగా దుస్తులు ధరించేవారు

స్త్రీలకు సౌందర్య రక్షణ కంటె కావలసిన దేముంది? ఎక్కువ సంతానాన్ని కంటే శరీర సౌష్ఠవం చెడిపోతుందని ప్రచారం చేస్తే సింహేంద్ర మధ్యలు తప్పకుండా కుటుంబ నియంత్రణకు సుముఖులవుతారు

దీనికేమి గాని, స్త్రీల ఆరోగ్య రక్షణ దృష్టి నుంచి చూచినా కుటుంబ నియంత్రణ అత్యావశ్యకమే కదా?

# కంప్యూటర్ పెళ్ళి

ఆడపిల్లలను కన్నవాడిదే కష్టం వారికి పెళ్ళిళ్ళు చేయడం పెద్ద సమస్య ఆడపిల్ల ఎదుగుతున్నకొద్దీ గుండెలపై కుంపటిలా వుంటుంది ఎక్కడ రాసిపెట్టి వుందో, ఎక్కడ ముడిపడుతుందో అని బెంగ ఎక్కువౌతుంది అయితే, కళ్యాణ ఘడియ రావాలి కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగ దంటారు వెయ్యి అబద్ధాలు ఆడి అయినా ఒక పెళ్లి చేయాలంటారు

పూర్వమైతే అష్టవిధ వివాహాలుండేవి స్వయంవరంలో—పరీక్ష పేపర్లలో మాదిరిగా— ఆడపిల్లలకు "ఛాయిస్" వుండేది. రాక్షస వివాహంలో కాగల కార్యాన్ని వరుడే తీర్చేవాడు గాంధర్వంలో తల్లిదండ్రు లకు శ్రమ లేకుండా ఆడపిల్ల తన వివాహం తానే చేసుకునేది ఇలాగే రకరకాలు

ఇప్పుడుకూడా ఆ పేర్లతో కాకపోయినా అలాంటి పెళ్ళిళ్ళు వున్నాయనుకోండి ఉదాహరణకి మన కాలేజీలు, యూనివర్శిటీలు స్వయంవర మందిరాలుగా తయారు కావడం లేదా?

ఏమైనా, ఆడపిల్లల పెళ్ళి పెద్ద చిక్కే ఈడు, జోడు, కట్నాలు, కానుకలు, వంశం, సంప్రదాయం, ఆస్తి, చదువు అన్నీ చూడాలి ఒక టుంటే ఒకటుండదు ఈ చిక్కువల్లనే మన దేశంలో "పెళ్ళిళ్ళ పేరయ్య" అనే వ్యవస్థ ఏర్పడిందేమో

ఈ మధ్య ఇంగ్లండులో ఒక కంప్యూటర్ పెళ్ళిళ్ళ పేరయ్యగా పనిచేసిందట •27 ఏళ్ళ క్రికెడోరీ అనేవాడికి బోలెడుమంది వధువులలో ఎలిజబెత్ ఫర్త్ అనే 23 ఏళ్ళ కన్యక అన్ని విధాలా సరిపోతుందని కంప్యూటర్ నిర్ణయించిందట "ఇంతకంటె మంచి సంబంధాన్ని నాకు నేనైనా చూసుకోలేను" అని పెళ్ళికొడుకు సంతోషపడ్డాడు

"పెళ్ళిళ్ళు స్వర్గంలో జరుగుతా"యని ఇంగ్లీషు లోకోక్తి ఇక నుంచి"కంప్యూటర్లలో జరుగుతాయి" అని మార్చుకోవచ్చు

ఈ మధ్య ఎల్ ఐ సి. మొదలైన వాటిలో కంప్యూటర్ యంత్రాలను ప్రవేశపెట్టాలన్న ఆలోచనను ఉద్యోగులు వ్యతిరేకిస్తున్నారు ఆ ప్రతిపాదనను విరమించి పెళ్ళి సంబంధాల నిర్ణయానికి కంప్యూటర్లను ఉపయోగించడం మంచిది కాదా? కంప్యూటర్లలో అయితే ఈడు జోడు వగైరాలన్నీ లెక్కప్రకారం నిర్ణయమవుతాయి తల్లిదండ్రులకు, వధూ వరులకు ఎన్ని చిక్కులైనా తప్పుతాయి

# గోళ్ళు కొరుక్కోవడం

అమెరికాలో గోళ్ళు కొరుక్కునేవారి సంఖ్య ఎక్కువైందట ప్రతి మూడవ కుటుంబంలోను కనీసం ఒకరికి ఈ అలవాటు వున్నదట

కొందరు గోళ్ళు పొడుగ్గా పెంచుతారు ముఖ్యంగా ఆడవాళ్ళు అందంకోసం గోళ్ళు పెంచుతారు వాటికి రంగు వేస్తారు వీరు గోళ్ళ రంగు పరిశ్రమకు మహారాణీ పోషకులు

మరి కొందరు గోళ్ళను ఎప్పటికప్పుడు తీసివేస్తారు కాస్తకూడా పెరగనివ్వరు వీరు "నెయిల్ కట్టర్" పరిశ్రమకు పోషకులు

కాని, ప్రకృతిసిద్ధమైన "నెయిల్ కట్టర్లు" మన పళ్ళు ఏ కత్తెర కత్తిరించలేనంత నీటుగా మన పళ్ళు గోళ్ళు కత్తిరిస్తాయి గోళ్ళలో విషం వుంటుందని పళ్ళతో గోళ్ళుకొరకరాదని అనే వాళ్ళు "నెయిల్ కట్టర్" పరిశ్రమ ఏజంట్లు అయి వుంటారు అయితే, గోళ్ళు కొరుక్కునే అలవాటువల్ల వీరికి వచ్చిన ముప్పేమీ లేదు కాలిగోళ్ళు కత్తిరించడానికి కట్టర్లు ఎలాగూ కావాలి

"దేవుడు మనకు గోళ్ళు ఎందు కిచ్చాడురా?" అని ఒక టీచరు అడిగితే "కొరుక్కోవడానికండీ" ఒక కుర్రాడు జవా బిచ్చాడట ఈ జవాబులో నమ్మకంవున్నవాళ్ళు అమెరికాలోనే కాదు, అన్ని దేశాలలోను వున్నారు గోళ్ళు కొరుక్కోవడం చాలామందికి ఖర్చులేని హాబీ

పనిలేని బార్బరు పిల్లితల గొరిగాడట అలాగే చేతిలో మరేమీ పనిలేనప్పుడు కొందరు పళ్ళకి పని చెబుతారు చాలామంది రచయితలకి ఈ అలవాటు వుంటుంది ఏదో వ్రాయడానికి కూర్చుని, ఆలోచన రాక పోతే కలం పక్కన పెట్టి గోళ్ళు కొరుక్కోవడం మొదలెడతారు గోళ్ళు కొరగ్గా, కొరగ్గా వారికి అద్భుతమైన భావాలు వచ్చేస్తుంటాయి

అమెరికాలో గోళ్ళ సర్వే నిర్వహించిన ఒక కంపెనీ మరొక విషయం కనిపెట్టింది మనుషులు ఏదో ఆందోళనలో వున్నప్పుడు గోళ్ళు కొరకడం మొదలెడతారట మా అనుమానం-ఈ కంపెనీవారికి ఏదో ఆందోళన కలిగివుండాలి లేకపోతే గోళ్ళమీద ఈ సర్వే ఎందుకు చెప్పండి

# చిరునవ్వు మహిమ

ఏడుస్తూ చేసిన పని ఏడుస్తున్నట్టే వుంటుంది. నవ్వుతూ చేసిన పనే నాణ్యంగా వుంటుంది

కొందరి ముఖాలు నిత్యదరహాస స్నిగ్ధాలై వుంటాయి వారితో స్నేహం చేయడం సులభం.

అయితే, ఎప్పుడూ చిరునవ్వును పెదవులకు అతికించినట్టు వుంచుకునేవారు వట్టి మేదకులు, తెలివి తక్కువవాళ్ళు కూడా కావచ్చు హామ్లెట్ చేత షేక్స్పియర్ అనిపించినట్టు నిత్యమందహాసం ధూర్త లక్షణం కూడా కావచ్చు

ఏమైనా చిరునవ్వు ఆరోగ్యప్రదమైనది. ముఖానికి వెలుగు నిస్తుంది చిరునవ్వు నవ్వే వాడితోపాటు లోకంకూడా చిరునవ్వు నవ్వుతూ వుంటుంది

అందుకే కాబోలు యు పి లోని ఉత్తర కాశీ ప్రాంతంలో రైతులు చిరునవ్వు నవ్వుతూ విత్తనాలు చల్లుతారట. అది పర్వత ప్రాంతమైనా ప్రపంచంలో మరెక్కడా లేనంత సమృద్ధిగా వరి, గోధుమ, మొక్కజొన్న అక్కడ పండుతున్నాయట

ఎరువు కూడా కావా లనుకోండి వాటికి చిరునవ్వులు కూడా తోడయ్యే సరికి మరీ ఎక్కువగా పంట పండుతున్నదట,

ఇది ఎంతవరకు నిజమోకాని, మన వ్యవసాయశాఖ ఈ నూత్న ప్రయోగాన్ని ఎందుకు అమలు చేయరాదు? అదృష్టవశాత్తు రెట్టింపు పండుతుందేమో! విత్తనాలు చల్లుతున్నంతసేపు చిరునవ్వు నవ్వుతూ వుండడం కష్టం కనుక రైతులకు ప్రత్యేక శిక్షణ పెడితే సరి

# తండ్రులు, తనయులు

తండ్రి నుంచి తనయునికి వారసత్వంగా ఆస్తి రావచ్చు. మంచి గుణాలు, చెడ్డ గుణాలు రావచ్చు కాని, విజ్ఞానశాస్త్రీలలో ప్రతిభ కూడా వారసత్వంగా వస్తుందా?

ఏమో, రావచ్చు. అలా వచ్చిన సందర్భాలు చరిత్రలో అనేకం వున్నాయి

యురేనస్ గ్రహాన్ని మొదటగా కనుగొన్న సర్ విలియం హెర్షెల్ ప్రఖ్యాత ఖగోళ శాస్త్రవేత్త ఆయన కుమారుడు సర్ జాన్ హెర్షెల్ మరొక ప్రఖ్యాత ఖగోళవేత్త

"నాచురల్ సెలెక్షన్" సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన చార్లెస్ డార్విన్ కుమారులలో ఒకడైన సర్ ఫ్రాన్సిస్ డార్విన్ ప్రముఖ వృక్షశాస్త్రజ్ఞుడు రెండవ కుమారుడు సర్ జార్జి డార్విన్ ఖగోళ-గణిత శాస్త్రవేత్త

ఇటువంటి ప్రసిద్ధ ఉదాహరణలు మరికొన్ని విజ్ఞానశాస్త్ర చరిత్రలో కనిపిస్తాయి కాని నోబెల్ బహుమతులు కూడా వారసత్వంగా వస్తాయా?

ఇందుకుకూడా ఉదాహరణలున్నాయి అణువులో ఎలక్ట్రాన్‌లను మొదటగా కనుగొన్న సర్ జె జె థామ్సన్‌కు 1906లో ఫిజిక్స్ నోబెల్ బహుమతి లభించింది ఆయన తనయుడు సర్ జార్జి థామ్సన్ ఎలక్ట్రాన్లకు తరంగ(వేవ్)లక్షణాలున్నాయని నిరూపించినందుకు 1937లో నోబెల్ బహుమతి పొందాడు

రేడియో యాక్టివిటీని మొదటి సారిగా కనిపెట్టినందుకు మదాం క్యూరీ తన భర్త పియర్ క్యూరీతో కలిసి 1903లో ఫిజిక్స్ నోబెల్ బహుమతి పొందింది రేడియంను కనుగొన్నందుకు ఆమె 1911లో మరొక

సారి విడిగా నోబెల్ బహుమతిని పొందింది ఇలాగే క్యూరీ దంపతుల కుమార్తె ఐరిన్ జోలియో-క్యూరీ, ఆమె భర్త ఫ్రెడరిక్ జోలియో-క్యూరీ కృత్రిమ పద్ధతిలో రేడియో యాక్టివిటీని సాధించినందుకు 1935లో కెమిస్ట్రీ నోబెల్ బహుమతిని పొందారు

ఇవి పాత ఉదాహరణలు నోబెల్ బహుమతుల వారసత్వానికి సరి క్రొత్త ఉదాహరణ మొన్ననే జరిగింది ఈ ఏడాది ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి పొందినవారిలో ఒకరు డేనిష్ శాస్త్రవేత్త ఆగే బోర్ ఈయన తండ్రి జగత్ప్రసిద్ధుడైన నీల్స్ బోర్ అణువు స్వరూపాన్ని మొదటగా నిర్ధారణ చేసిన నీల్స్‌బోర్ 1922లో నోబెల్‌ఫిజిక్స్ బహుమతి పొందాడు అదే సంవత్సరంలో జన్మించిన ఆగే బోర్ అణు కేంద్రం గురించిన పరిశోధనలకు ఈనాడు నోబెల్ బహుమతి సంపాదించుకున్నాడు

జీవుల వారసత్వ లక్షణాలను నిర్ణయించేవి "జీన్స్" అని శాస్త్రవేత్తలు కనుగొన్నారు నోబెల్ బహుమతులు వారసత్వంగా రావడానికి ఏ "జీన్స్" కారణమో ఎవరైనా కనుగొంటే, ఆయనకు మరొక నోబెల్ బహుమతి ఇవ్వవచ్చు!

# యోగ మహాత్మ్యం

యోగాభ్యాసంవల్ల అలౌకిక శక్తులే సాధ్యమయితే వాటిని యోగులు ప్రజల యోగక్షేమాలకు ఎందుకు వినియోగించరో? నిప్పులపై నడుస్తామంటారు, నీటిపై నడుస్తా మంటారు, మేకులు,సూదులు మింగుతామంటారు ఇంతకంటె కరువు, కాటకాలను పారద్రోలవచ్చు గదా? కొరతగా వున్న వస్తువుల ఉత్పత్తికి తోడ్పడవచ్చుగదా?మంత్రదండంతో మేఘాలను బెదిరించి అనావృష్టి మాన్పవచ్చుగదా?దానితోనే అతివృష్టిని కూడా ఆపివేయవచ్చుగదా?

అరవై సంవత్సరాల వయోవృద్ధులైన ఒక స్వాములవారు 72 గంటలపాటు భూసమాధిలో వుండడానికి సంకల్పించినట్టు హైదరాబాదు వార్త యోగ మహాత్మ్యాన్ని రుజువు చేయడానికే ఆయన ఇలా సంకల్పించారట.

ప్రాణాయామం వంటి హఠయోగ పద్ధతులవల్ల ఇట్టి విచిత్ర చర్యలు సాధ్యం కావచ్చు కాని ఈ పద్ధతులేవీ అనుసరించ కుండానే సాధారణ సాధనతోనే మిహిర్ సేన్ మైళ్ళ తరబడి, గంటల కొలది సముద్రాలలో ఈది తన శక్తిని ప్రదర్శించాడు ఇంకా ఎందరో రకరకాలుగా తమ వ్యక్తిగత ప్రతిభను ప్రదర్శిస్తున్నారు యోగంవల్లఅలౌకిక శక్తులు సిద్ధించ గలవని నమ్మేవారు వాటిని ఇట్టి వాటికి కాకుండా ఇంతకంటె విస్తృతమైన ప్రయోజనాలకు ఎందుకు ఉపయోగించరు?

ఆసనాలు మొదలైనవి శరీరానికి, మనస్సుకు ఆరోగ్య ప్రదాలని పండిట్ నెహ్రూ కూడా నమ్మేవారు. ఈ పరిమిత ప్రయోజనానికే అయితే, వాటిని ప్రోత్సహించడం మంచిదే కాని, వాటికి ఏవేవో శక్తులను ఆపాదించడం, కొరగాని పనులకు వినియోగించడం ఆ విధంగా మూఢ విశ్వాసాలకు ప్రోది చేయడం దేనికి?

ఇంతకీ మానవుడు సాధించవలసింది భూమి మీద సుఖ జీవనాన్ని. భూమి లోపల కాదు !

# బొమ్మా బొరుసూ

బొమ్మ మాత్రమే వుండి, బొరుసులేని నాణెం ఎక్కడైనా వుంటుందా? అసలు అటువంటి నాణాన్ని ఊహించగలమా?

ప్రపంచమే ద్వంద్వాల మయంకదా? సుఖం లేనిదే దుఃఖంలేదు మంచి లేనిదే చెడులేదు, వెలుగు లేనిదే చీకటిలేదు, ఒక వేళ వున్నా, అది దుఃఖమని, చెడు అని, చీకటి అని మనం తెలుసుకోలేము ఒకటి వున్నప్పుడే రెండవదానికి రెండవదిగా మనుగడ

అలాగే ఉత్తర, దక్షిణ ధ్రువాలలో ఏదో ఒకటి వున్న అయస్కాంతం ఎక్కడైనా వుంటుందా? ఒక అయస్కాంతం ముక్కను ఎన్ని ముక్కలుగా, నలుసులుగా, రేణువులుగా, కణాలుగా భేదించినా రెండు ధ్రువాలు వుండి తీరుతాయి

కాని, ఇప్పుడు కాలిఫోర్నియాలోని శాస్త్రజ్ఞులు ఒకే ఒక ధ్రువం కల అయస్కాంతాన్ని కనుగొన్నారట దానికి "మోనోపోల్" (ఏక ధ్రువం) అని పేరు పెట్టారు

ఇటువంటి "మోనోపోల్"ను బ్రిటిష్ శాస్త్రవేత్త పి ఎ ఎం డిరాక్ 1931లోనే సిద్ధాంత రీత్యా ఊహించాడట ఎలా ఊహించాడో తెలియదు గాని, ఇది రెండవవైపు లేని నాణాన్ని ఊహించడమంత కష్టం

కొత్తగా కనుగొన్న "మోనోపోల్" అయస్కాంతాన్ని ప్రయోగశాలలలో విరివిగా సృష్టించ గలిగితే క్యాన్సర్ వంటి వ్యాధుల చికిత్సకు, మరెన్నో విధాలుగా నిత్య జీవితానికి అది ఉపయోగపడగలదట

సైన్సు చేయగలిగిన వింతలకు అంతులేదనిపిస్తుంది ద్వంద్వమయమైన ప్రపంచంలో నుంచి మనకు అక్కరలేని దుఃఖం, చెడు, దారిద్ర్యం మొదలైన వాటిని తొలగించే మార్గాన్ని కూడా సైన్సు కనుగొనగలిగితే బాగుండును

# ప్రాణాలు తీసిన కవిత్వం

వెర్రిమొర్రి కవిత్వం వ్రాసి ఇతరులను చంపేవారు లోకంలో కావలసినంతమంది కాని, తామే చనిపోయే కవు లుంటారా ?

మొన్న బొంబాయిలో ఒక ఉర్దూ కవి తన కవిత్వానికి తానే బలి అయిపోయాడట అర్ధరాత్రివేళ అతడు తన స్నేహితులను పోగుచేసి తన కవిత్వం వినిపిస్తున్నాడు ఆ తర్వాత అతడు వీధిలోకి రాగానే, బిగ్గరగా కవిత్వం చదివి నిశ్శబ్దాన్ని భంగం చేసినందుకు కోపంతో ఒకడు ఆ కవితో వాగ్వాదం వేసుకుని, చివరికి కత్తితో పొడిచి చంపివేశాడు

కేవలం బిగ్గరగా కవిత చదివినందుకే ఈ హత్య జరిగిందని నమ్మడం కష్టం కవిత్వం బాగుంటే హంతకుడు కూడా విని ఆనందించి వుండేవాడేమో బహుశా అది చెత్త కవిత అయినందువల్లనే అతడు హత్యకు పాల్పడి వుండవచ్చు

ఇలా తన కవితకు తానే ఒక కవి బలి అయిపోయిన విషాద సంఘటన సాహిత్య చరిత్రలో మరొకటి వున్నది జూలియస్ సీజరు హత్యకు కుట్రచేసిన వారిపై ప్రతీకారం చేయడానికి రోమ్ వీధులలో బయలుదేరిన ఒక గుంపుకు సిన్నా అనే కవి ఎదురవుతాడు కుట్రదారులలో వేరొక సిన్నా వున్నాడు అతడే ఇతడనుకొని జనం చంపబోతారు తాను కుట్రదారును కానని, కవినని ఎంత చెప్పినా, జనం వినరు. ఎవరినో ఒకరిని చంపి వేయాలన్న ఉద్రేకంలో వారు వున్నారు చివరికి "అయితే, చెత్త కవిత వ్రాసినందుకు చీల్చి వెయ్యండి" (Tear him for his bad verses) అంటూ కవి సిన్నాను జనం పొడిచి వేస్తారు ఇది షేక్‌స్పియర్ తన "జూలియస్ సీజర్" నాటకంలో కల్పించినదే కాదు నిజంగా జరిగిన సంఘటనే

కవిత్వం చాలా నిరపాయమైన హాబీ అనుకుంటాము. కాని, విప్లవ కవిత వ్రాసి జైళ్ళపాలైనవా రున్నారు తిట్టు కవిత వ్రాసి తిట్టించుకున్నవా రున్నారు కాగా, ఒక్కొక్కసారి కవిత్వం ప్రాణాలకే మోసం తేవచ్చు ననడానికి బొంబాయి సంఘటనే ఉదాహరణ

# పాలకాలవ

పురాణాల కాలంలో పాల సముద్రం వుండేదట. అది ఇప్పుడు వుందో లేదో గాని, ఒక పాలకాలవ మాత్రం పామర్రు దగ్గర వెలిసింది

పాల సరఫరా పథకం అధికారులు 57 వేల లీటర్ల పైచిలుకు పాలను ఆ కాలవలో పారబోశారట అన్ని పాలు కలిసిన తరవాత అది పాలకాలవ కాకుండా వుంటుందా ?

ఇప్పటివరకు పంటకాల్వలనే మనం ఎరుగుదుము ఇప్పుడు పాడికాల్వకు కూడా ఉదాహరణ లభించింది

పాలు చెడిపోయినందువల్లనే పారబోశారనుకోండి కాని, ఇంటిలో ఒక్క శేరు పాలు పాడైపోతేనే ఎంతో బాధ కలుగుతుందే, అన్నివేల లీటర్లపాలు ఎవరికీ కాకుండా నీళ్ళ పాలైపోతే ఇంకెంత బాధపడాలి? మరి దీన్ని పాల పథకం అనాలా? లోపాల పథకం అనాలా ?

ప్రజలను కన్న బిడ్డలవలె పాలిస్తూ వుండవలసిన ప్రభుత్వమే ఇలా పాలివ్వకుండా పారబోస్తుంటే ఎలా ?

# నీరుగా మారిన ఆల్కహాల్

ఏసుక్రీస్తు నీటిని ద్రాక్షరసంగా మార్చినట్టు బైబిల్ కధనం ఆయన తన జీవితకాలంలో ప్రదర్శించిన ఎన్నో మహిమలలో ఇది మొదటిదని సెంట్ జాన్ సువార్త పేర్కొంటున్నది

కాని, ఇందులో వింత ఏమున్నది? మొన్న మన రాష్ట్రంలోనే ఒక విచిత్ర సంఘటన జరిగింది సికిందరాబాదు నుంచి తొమ్మిది వేల లీటర్ల ఆల్కహాల్‌తో ఒక లారీ షక్కర్‌నగర్ బయలుదేరింది తీరా గమ్యస్థానం చేరుకునేసరికి మొత్తం ఆల్కహాల్ నీరుగా మారిపోయింది.

ఈ వింత ఎలా జరిగింది? ఏమో, ఎవరికి తెలుసు? ఈ రోజులలో పాలు సగానికి పైగా నీళ్ళుగా మారిపోవడం లేదా ? ఎరువులు ఉప్పుగా, అసలు మందులు కల్తీ మందులుగా, ఆహారం విషపూరితంగా మారిపోవడం లేదా? అలాగే ఇదీని!

ఆల్కహాల్ రవాణాను కంట్రాక్టుకు తీసుకున్న వ్యక్తి ఇందుకు బాధ్యుడని, ఇంకా దీనితో ప్రమేయం గలవారందరిపై చర్య తీసుకుంటున్నామని, దర్యాప్తు చేస్తున్నామని ప్రభుత్వం మొన్న అసెంబ్లీలో తెలియజేసింది మంచిదే

వెనకటికి ఆంగ్ల మహాకవి బైరన్ విద్యార్థిగా వుండగా క్లాస్ పరీక్ష సందర్భంలో, ఏసుక్రీస్తు నీటిని ద్రాక్షసారాగా మార్చిన సంఘటనపై వ్యాసం వ్రాయవలసి వచ్చిందట తక్కిన విద్యార్థులు సుదీర్ఘ వ్యాసాలు వ్రాయగా, బైరన్ ఒకే వాక్యంతో వ్యాసం ముగించాడట ఆ వాక్యం ఇది Water saw her Lord and blushed ! — "నీరు తన ప్రభువును చూచి సిగ్గుపడింది" (ఆడవారు సిగ్గుపడినప్పుడు బుగ్గలు ఎరుపెక్కుతాయి ద్రాక్షసారా ఎర్రగా వుంటుంది ) ఈ మహావాక్యం వ్రాసినందుకు బైరన్‌కు మిగిలిన విద్యార్థుల కంటె ఎక్కువ మార్కు లిచ్చారట పరీక్షాధికారులు

బహుశా, సికిందరాబాదు నుంచి లారీలో బయలుదేరిన ఆల్కహాల్ తనచుట్టూ లోకంలో జరుగుతున్న అవినీతిని భరించలేక నిలువునా "నీరై" పోయి వుంటుంది !

# రూపాయి నాణాలు

కనీసం ఒక విషయంలో మనం తిరిగి వెనకటి రోజులకు వెడుతున్నాము రూపాయి నోట్ల ముద్రణను దాదాపుగా విరమించి రూపాయి నాణాలను క్రమంగా ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదట.

ఇందుకు ఒక కారణం రూపాయి నోట్లను ముద్రించడానికి వాడే కాగితం తగినంతగా ఉత్పత్తి కాకపోవడం వార్తా పత్రికలకు, పాఠ్య పుస్తకాలకు, నోట్సు పుస్తకాలకు కాగితం కొరత సరే, చివరికి డబ్బు ముద్రించే కాగితానికి కూడా కొరత ఏర్పడినదంటే ఇక కొరత లేనిది దేనికి ?

రూపాయినోట్లు ముద్రించే ప్రెస్సు శక్తి పరిమితం కావడం కూడా ఈ మార్పుకు కారణమని ఆర్థిక మంత్రి శ్రీ చవాన్ మొన్న చెప్పారు నిజానికి ప్రెస్సు శక్తిని కూడా మించిపోయి రూపాయి నోట్లను ముద్రించవలసిరావడాన్ని మన దేశంలో ఇన్ఫ్లేషన్ ఎంత విపరీత స్థాయికి వెళ్ళిందో తెలిపే కొలమానంగా తీసుకోవచ్చు

రూపాయి విలువ ఇప్పుడు ఏ 36 పైసల ప్రమాణానికో తగ్గిపోయిందని ఆర్థికవేత్తలు చెబుతున్నారు రూపాయి నోటును చూస్తుంటే నిజంగానే చులకన భావం కలుగుతున్నది ఇకపై బరువైన లోహపు నాణాలను చూస్తేనైనా రూపాయిపై కొంత గౌరవభావం కలుగుతుందేమో

రూపాయి నాణాలవల్ల మరొక లాభం కూడా వున్నది జేబులో నాలుగు రూపాయి నాణాలను వేసుకున్నా, జేబు "బరువు" గా వున్నదనే సంతృప్తి కొందరికి కలగవచ్చు

# అనుక్రమణిక

